# భారతి

సాహిత్య మాసపత్రిక

నవంబరు : 1989



వెల : 5 రూపాయలు



సూఫీతత్త్వము : "తి"

అంగుళమునకు గళము : డా. కె. వి. పుట్టప్ప

అమరేశ్వరాలయ ప్రాచీనత : డా. పురాణం రాధాకృష్ణప్రసాద్

శుభవర్తమానం : కె. గోదావరి శర్మ

ఆలయం : వజ్ఝల కాళిదాసు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

## మాసపత్రిక

*


శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 66 నవంబరు 1989 సంచిక : 11

విడిప్రతి వెల ఐదురూపాయలు


## విషయానుక్రమణిక

# స్వవిషయం

ఈ నెల భారతిలో ప్రముఖ కవి డా॥ కె. వి. పుట్టప్పగారి పద్యనాటకం "అంగుళము నకు గళము" అందిస్తున్నాము. దీనిని కన్నడం నుంచి తెలుగులోకి శ్రీ శంకరగంటి రంగాచార్యులు హృదయంగమంగా అనువదించగలిగారు. ఉన్నతస్థాయికి చెందిన విశిష్టమైన రచనగా ఈ నాటకం విమర్శకుల దృష్టిలో నిలువగలదని మా ఆశ.

కావ్యాల లోపలి నవరసాల గురించీ ఎందరో ఎన్నో రకాలుగా సమీక్షలు చేసి ఉన్నారు. అయితే కావ్యాలమీది ముఖపత్రాల మీద ఎవరూ పరిశోధించినట్లుగా పెద్దగా తెలియడం లేదు. శ్రీ ఓబళేసు "కుమార భారతి" కావ్య ముఖపత్రాల అధ్యయనానికి సంబంధించిన రచన - ఈ విధమైన పరిశోధనకు శ్రీకారం చుట్టినట్లు కాగలదు.

శ్రీధాన్య కటకమున శైవము - అమరేశ్వరాలయ ప్రాచీనత వ్యాసం చరిత్ర పరిశోధకులకు ఆసక్తికరంగా ఉండగలదు. అదేవిధంగా మఱుగుపడిన మధురకవి శ్రీ మల్యాల జయరామయ్యకి సంబంధించిన రచన తెలుగు సాహిత్య పరిశీలకులకు సంతోషాన్ని కలిగించగలదని మా నమ్మకం. అజ్ఞాతంలో ఉన్న మహామహులను గుర్తించవలసిన బాధ్యత సాహిత్య విమర్శకులకు, చరిత్ర విమర్శకులకు ఎంతయినా ఉంది.

ఈ నెల భారతి అందిస్తున్న మరో ఉదాత్తమైన రచన "త"గారి సూఫీ తత్వము-ఋతస్యపంథాలో సూఫీతత్వాన్ని గుర్తిస్తూ ఉపనిషత్ తత్వానికీ దీనికీ గల సామ్యాన్ని విశదపరస్తూ "త"గారు ఎంతో కష్టపడి ఈ వ్యాసాన్ని రాసారు. ఇది అందరి దృష్టినీ ఆకట్టుకోగలదని విశ్వసిస్తున్నాము.

కవిత్వం గురించి ప్రత్యేకంగా చెప్పడంలేదు. కలగూరగంపకు, గ్రంథవిమర్శలకు ఎక్కువ పుటలు కేటాయించడానికి ప్రయత్నం చేయగలము. అన్నిరకాల సాహిత్య ప్రక్రియలకూ భారతిని సదా వేదికగా ఉంచగలము. ఇందుకు అందరి తోడ్పాటు అవసరమని సవినయముగా తెలుపుకుంటున్నాము.

## ఆలయం

నా శైశవం నాటి స్వప్నాలన్నీ
సీతాకోక చిలకలై
చెల్లా చెదరై పోతున్నై!

నా బాల్యపు ఊహల ఆశలు
రంగుల గాలిపటాలై
నింగిని చీల్చుకుపోతున్నై!

నా యౌవన భావనా హర్మ్యాలన్నీ
యధార్థ జీవితాశనిపాతాలలో
శిథిలాలై పోతున్నై!

నా ప్రౌఢ వయః పరిణతి కొలిమిలో
అనుభవాల అపరంజి కణికలు
కరిగి నీరై పోతున్నై!

నా మాటలు రెక్కలు తొడుగుతున్నై
ఆకాశంలో ఎగురుతూ
అవనీతలాన్ని చూడాలని!

నా పాటలు చిచ్చరపిడుగులౌతున్నై
ప్రపంచ కాలుష్యాన్ని
భస్మీపటలం చెయ్యాలని!

ఈ మానవ జీవితాద్యంత
రహిత వలయం
సకలాశా పరివృతానేక
గహన నిలయం
అణుస్ఫోటు స్ఫురిత
మహత్యాలయం!

**శ్రీ వఝ్ఝల కాళిదాసు**

## "పురాణ సత్యాని కతిపయాని"

1. ధనాధిపో దరిద్రస్య
స్కంధ మారోఢు మిచ్ఛతి।
జానీమహే వయం సర్వే
కుబేరో నర వాహనః

2. అన్యాయో న్యాయోవా
ధనినం హి సదైవజనాః సమర్థయన్తే।
సందేహస్స్యా ద్యది తే
పశ్యేః సైన్యం పాండవ కౌరవాణామ్॥

3. గురు తల్పగతోఽప్యబ్జః
రుద్రేణ మూర్ధ్ని ధార్యతే।
శ్రీమాన్ భయద ధూర్తోఽపి
సమర్చ్యతే సదా జనైః॥

4. ఆంజనేయేన కృష్ణేన
ద్వాభ్యాంచ ధ్రియతే గిరిః।
గిరి ధార్యేవ గోవిందః
కిం కరః ఖలు మారుతిః॥

5. దౌరాత్మ్యం వైధవేయానాం
నిరాతంకం ప్రవర్తతే।
పర్యభూయత పాంచాలీ
పశ్యతో ర్ద్రోణ భీష్మయోః

6. సంరక్షితవ్యం నిరతం కథంచిద్
'భద్రాసనం'; కిం పున రన్య తద్వైః।
చౌర్యాణి హత్యాశ్చ కదాపి కుర్యాత్
తన్మార్గదర్శీ న మహేంద్ర ఏవ॥

**"ప్రభంజనః"**

శ్రీ సి. ఓబళేసు

# 'కుమార భారతి' కావ్య ముఖపత్రాల అధ్యయనం

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు తమ 28వ యేటనే 'కుమార భారతి' అనే కావ్యం వ్రాశారు. అది ప్రౌఢ కావ్యమని, రచయిత గురువుగారైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు స్వయంగా ఒప్పుకున్నట్లు మనకు ఆ కావ్య కథోద్ఘాతము చదివితే తెలుస్తుంది.

ముద్రణా సౌకర్యం వచ్చింతర్వాత కొన్నేళ్ళకు కావ్యం గాని మరేదైనా గ్రంథానికిగాని దానికి సంబంధించిన ఇతివృత్తం యొక్క తాత్పర్యం, స్థూలంగా గాని సూక్ష్మంగా గాని ఉండేటట్లు బొమ్మలు గాని, రేఖాచిత్రాలు గాని అట్టలపై (ముఖపత్రాలపై) గీయడం ఒక కళగా అభివృద్ధి అయింది. ముద్రణా సౌకర్యం లేని రోజుల్లో ఈ ముఖచిత్రాల ప్రసక్తి లేదు. ఎప్పుడైతే ముద్రణా సౌకర్యం వచ్చిందో ముఖపత్రాల శిల్పం కూడా బయలుదేరింది.

'కుమార భారతి' కావ్యానికి, కావ్యంయొక్క ఇతివృత్తాన్ని తెలిపేటట్లుగాను, ఇతివృత్తంలో దాగివున్న అంతరార్థాన్ని తెలిపేటట్లుగాను, మొదటి ముఖపత్రం చివరి కవరు పేజీలపై ముద్రణ ఉంది. ముఖపత్రం, చివరి పత్రాల సారం గురించి చర్చించడం ఈ వ్యాస ముఖ్యోద్దేశం.

స్థూలంగా ఉండే ముఖపత్రాల ఉదాహరణగా మగవాని చేతి పెద్ద పిడికిలిలో ఆడుది ఉన్నట్లు, తాళిబొట్టును ఉరిత్రాడులాగా గీయడం, చావును కల్పించడానికి గొంతుకు సంధించినట్లుగా ఉండడం నవలలు మొ॥ పుస్తకాల ముఖపత్రాలపై మనం చూస్తున్నాం. ఆ బొమ్మలు చూడగానే ఆ పుస్తకంలోని ఇతివృత్తం యిట్టే పసిగట్టవచ్చు. మిగతా పుస్తకాల్లాగా ఈ కావ్యంపై అమర్చిన బొమ్మలు అంత సులభంగా బోధపడేవి కాదు అని ఒప్పుకోవలసిందే. అయితే సూక్ష్మమైన, సుకుమారమైన దృష్టితో చూస్తే అవగతమవుతుంది. ఈ ముఖపత్రాలు ఈ విధంగా ఎందుకు ఉన్నాయి? మిగతా కావ్యాలకంటే ఇది ఎందుకు భిన్నంగా ఉంది? చాలా గ్రంథాల ముఖపత్రాలు చూస్తూనే టపీమని అర్థమవుతాయి. అయితే ఈ కావ్య ముఖపత్రం అర్థం కాలేదని వదలడానికి వీలులేదు. సహృదయ పాఠకుడు దాన్ని గురించి ఆలోచిస్తాడు. ఆలోచించాలి కూడా.

అయితే ఈ కావ్య ముఖపత్రాల ముద్రణ పైన చెప్పినట్లు అన్ని గ్రంథాలవలె కాకుండా దానికి ఒక విలక్షణమైన పద్ధతి, విశిష్టమైన భావన, మనిషి జీవిత పరమార్థమేమిటో తెలియజేస్తుంది. వాటిని ఈ క్రింద చూద్దాం.

ముఖపత్రము :-

'కుమార భారతి' అన్న కావ్యం పేరునే మొదట పరిశీలిద్దాం. కుమార భారతి అంటే కుమారస్వామిని (సుబ్రమణ్యంస్వామిని) గురించి తెలిపే కథ. కుమార శబ్దానికి పౌరాణికార్థం వేరైనా కవి బాహ్యార్థమును అంతరార్థముతో సమన్వయపరచి చెప్పడమే ఒక విశేషము. కుమార శబ్దాన్ని విశ్లేషించి చెప్పాలంటే తండ్రి కుమారుని రూపంలో తన రూపాన్ని ప్రతిబింబించుకుంటాడు. తండ్రి శరీరం నశించినా కుమారుని శరీరం ప్రపంచంలో ఉంటుంది. ఇది భౌతికార్థం. అందుకే మానవులకు తమ సంతానంపైన ప్రీతి. ఎందుకంటే తాను నశిస్తున్నా తన రూపాన్ని తమ సంతానరూపంలో చూసుకొని తృప్తిగా ప్రాణాలు వదలుతారు. అంటే తాను పోయినా లోకంలో ఉన్నట్టే. తాను ఈ విధంగా తన సంతతి ద్వారా శాశ్వతంగా ఈ భూమిపై నిలిచిపోతాడు. కాబట్టి ఈ కుమారస్వామి కథ అది నీ కథ, అంటే ప్రతి మానవుని కథ.

భగవంతుడు నిత్య కౌమారంగా ఉంటాడు. భగవత్తత్వము ఎప్పుడూ కొత్తదిగనే ఉంటుంది. ఏదైనా ఒక వస్తువును మనం మార్కెట్‌నుంచి తెచ్చుకుంటే, తెచ్చిన కొత్తలో కొన్ని రోజులు తాజాగా, నాణ్యంగా ఉండి చూడ్డానికి ఆకర్షణీయంగా ఉంటుంది. కొద్దిరోజులకు పాతబడుతుంది. ఆకర్షణ తగ్గుతుంది. అంటే ఆ వస్తువు పాతబడిందని అర్థం. ఇది లోకంలోని వస్తునైజం. కాని భగవత్తత్వమన్నది నిత్య కౌమారంగా, ఆకర్షణీయంగా,

రమ్యంగా ఉంటుంది. భగవత్తత్వము పాతబడని వస్తువు. అందుకే అది నిత్యనూతనంగా ఉంటుంది. అంటే కుమార తత్వం, కుమార శబ్దం నిత్య నూత్నత్వానికి సంకేతం. కుమార శబ్దానికి సృష్టి అని అర్థం. అది సృష్టికి ప్రతీక. యౌవ్వనము, వృద్ధాప్యము వంటి దశలు దానికి ఉండవు. అది నశించదు. కుమార శబ్దము అంటే 'బ్యాలెన్స్'. ప్రకృతిలో సమతులాన్ని కలిగిస్తుంది. అంటే ప్రకృతిని బ్యాలెన్స్ చేస్తుందన్నమాట. ఎన్ని మరణాలు సంభవించినా కుమారతత్వం ఆ లోటును భర్తీ చేస్తూనే ఉంటుంది. నాశనం కావడానికి బదులు ప్రతిసృష్టి చేయడం కుమారతత్వ లక్షణం.

భారతి శబ్దంలో భా=భాసించునది. రతి=రమ్యమైనది, రమించేది. భగవంతుడు భక్తునితో రమించే యోగం ఉంటుంది. ఆ యోగంలో అందమైన సొగసు రుచి ఉంటుంది. 'ఆత్మా వై పుత్రా నామాసి' - తండ్రే భార్యద్వారా కుమారుడుగా జన్మిస్తున్నాడు. కుమారుడు తండ్రియొక్క ప్రతి అంగమునుండి పుడుతున్నాడు. తండ్రి తనను తాను కుమారుడుగా బదిలీ (ట్రాన్స్‌ఫర్) చేసుకుంటున్నాడు. కాబట్టి తండ్రీ కొడుకూ ఒకటే. సృష్టికి ప్రతిసృష్టి చేసే లక్షణం ఈ కుమారతత్వంలో ఉందని చెప్పుకున్నాము. కాబట్టి ఈ చెప్పిన అర్థం ఈ సందర్భంగా సరిపోవడం గమనించదగ్గది.

ఈ కావ్యం ముఖపత్రం (మొదటి అట్ట)పై (చిత్రం-1 లోని) బొమ్మ మనకు కనిపిస్తుంది. ఈ కావ్యం అన్ని కావ్యాల లాగా ఆశ్వాసాలుగా కాకుండ కమలాలుగా విభజించి ఉండటాన్ని మనం చూస్తాం. కావ్యమంతా 6 కమలాలు. అవి ఆరు ముఖాలు గల కుమారస్వామికి ప్రతీకలు.

చిత్రం-2 పద్మానికి సంకేతం. ఆ చిత్రాన్ని పుష్పంగా భావిస్తే ఆ చిత్రానికి ఆరు రేకులు ఉన్నట్లు గమనించవచ్చు. చిత్రములోని 1 నుండి 6 అంకెలు ఆరు రేకులను సూచిస్తాయి. అందుకే ఈ కావ్యం ఆశ్వాసాలకు బదులుగా కమలాలుగా విభజించబడింది. ప్రథమ కమలము, ద్వితీయ కమలము, తృతీయ కమలము, చతుర్థ కమలము, పంచమ కమలము, షష్ఠకమలము- అవి. చిత్రాన్ని బాగా పరిశీలిస్తే ఎ బి సి అనే త్రిభుజము, డి అనే వృత్తమూ; 6, 1 అంకెల మధ్య శక్త్యాయుధ చిహ్నమూ; దానికి రెండువైపుల +, — లను గమనించవచ్చు. వీటిని చిత్రమునుంచి వేరు చేసి విడి విడిగా ఫోకస్ చేసిన బొమ్మలను చిత్రం-3లో చూడవచ్చు.

ఈ ఆరు కమలాలే ఎందుకున్నాయి? ఇది షణ్ముఖుడైనటువంటి కుమారస్వామిని గురించినట్టి కావ్యము. షణ్ముఖుడంటే ఆరు ముఖాలు గలవాడని అర్థం. తమిళ సోదరులు ఆర్ముగం అని పేరు పెట్టుకోవడం మనకు తెలిసిందే. ఆరు కమలాలుగా ఉండటంలోని పరమార్థం ఇదే. పై బొమ్మ, మానవుడు చతుర్విధ పురుషార్థాలను సాధించాలన్నదానిని బోధిస్తుంది. పై బొమ్మను గమనిస్తే డి అనే వృత్తం ఎబిసి త్రిభుజపు అంచులను తాకుతూ పోయినట్టు ఉంది. ఎ=అర్థం బి=కామం సి=మోక్షం డి=ధర్మం. మానవుడు ఆ మూడింటినీ సాధించవలసిందే. అర్థాన్ని (ధనాన్ని) పొందవలసిందే - కామాన్ని (కోరిక) కూడా సాధించవలసిందే- మోక్షమూ పొందవలసిందే. అయితే ఈ మూడింటినీ సముపార్జన చేసుకోవడంలో, పొందడంలో ధర్మబద్ధమై ఉండాలి అన్న సంగతి మరచిపోరాదు. డి అనే వృత్తం అంటే ధర్మం ఎబిసి (అర్థ కామ మోక్షాలు) కోణాల్ని కలుపుతూ పోవడం ద్వారా మనం ఆ మూడింటినీ సంపాదించడంలో ధర్మమనేది తప్పక ఉండాలి అన్నదాన్ని డి వృత్తం బోధిస్తుంది. (ఈ విషయం ఎ. హనుమంతప్పగారి వ్రాతప్రతి నుంచి గ్రహించడమైనది. ప్రొ॥ తుమ్మపూడి కోటీశ్వరరావుగారి ఉపన్యాసం మూలాధారం.)

'డి' అనే వృత్తాన్ని తాకుతూ శక్త్యాయుధం ఉంది. దాని కిరువైపుల +, — లు ఉన్నాయి. చిత్రం-4 చూడాలి. ఇది కుమారస్వామి ధరించే ఆయుధం. అందుకే ఆయనను శక్తిధరుడు అన్నారు. అది ధర్మ సంరక్షణార్థము. (ఆ ఆయుధాన్ని చూస్తే ఒకప్రక్క గీత (ఇ) నరుని లక్షణము, ఇటువైపు గీత (ఎఫ్) దేవుని లక్షణము, మధ్యగీత (జి) గురులక్షణాన్ని సూచిస్తుంది). దేవుని లక్షణానికి, నరుని లక్షణానికి మధ్య అనుసంధానంగా గురు లక్షణం మనకు కనిపిస్తుంది. (గురువు, మానవుని, దేవుని లక్షణాల సమగ్ర చర్చకోసం చూ. ఎ. హనుమంతప్ప 'తత్వ గేయాలు-బ్రహ్మసారం' (స్రవంతి, జన, 1982) దైవదర్శనం గురుముఖంగా మానవునకు కలుగుతుంది. (ఒక మంచి కావ్యం కూడా గురువు చేసే పనిని చేస్తుంది.) అందుకే కబీరుదాసు- గురువూ, దేవుడు ఒకేసారి నా ముందు ప్రత్యక్షమై నిలబడితే ముందుగా నేను గురు పాదాలకే నమస్కారం చేస్తానంటాడు. ఎందుచేతనంటే దైవదర్శనం కల్గించినవాడు గురువు కాబట్టి.

బొమ్మ కేంద్ర స్థానంలో (ఓం) ఉన్నది. ఓం హాజ్ ఓవర్ హండ్రెడ్ మీనింగ్స్. వన్ ఆఫ్ దెమ్ ఈజ్ "వెల్‌కమ్ టు ది గాడ్" (ఇది ఓం అనే ఒకానొక పటం క్రింద ఇచ్చిన కాప్షను).

వృత్తము :-

చిత్రం-5లో 'డి' అనే వృత్తం ఉంది అని చెప్పుకున్నాం. దాన్ని గురించి ఆలోచిద్దాం.

వృత్తమెప్పుడూ అందమే. అందుకే విష్ణుచక్రం కూడా వృత్తాకారమే. వృత్తాకారం అందానికి ప్రతీక. అందమంటే నిండుతనం, సంపూర్ణత్వం. పూర్ణతకు సౌందర్యం. కనుకనే పూర్ణ చంద్రబింబము అందంగా కనిపిస్తుంది. అంటే వైపత్వమన్నది మనోహరమైనదీ, అందమైనదన్న మాట. వృత్తాన్ని 4 భాగాలుగా చేస్తే 90°ల లంబకోణాలు 4 ఏర్పడతాయి. 90°×4 = 360°. అంటే సరిగ్గా మన తెలుగు సంవత్సరానికి 360 రోజులు. ఒకసారి వృత్తం భ్రమిస్తే ఒక సంవత్సరమన్న మాట. ఇది వృత్త పరమార్థం. (చూ. ఎ. హనుమంతప్ప, మన 'ఆచారాలు-అంతరార్థాలు', సప్తగిరి జూన్ 1983)

ఇక ప్లస్, (+), మైనస్(—)ల సంగతి ప్లస్, మైనస్ అంటే ధనాత్మకం(+), ఋణాత్మకం(—). పురుషుడు పెళ్ళి కానంతవరకూ సగమే. పురుషుడంటే మగవాడు అని మాత్రమే కాదు అర్థం, మనిషి అని అర్థం. అది ఆడ కావచ్చు మగ కావచ్చు. పెళ్ళి అయింతర్వాత సంపూర్ణ మానవుడవుతున్నాడు. ధనాత్మకం, ఋణాత్మకం కలిపి ఒకటి అవుతుంది. ఈ రెండు కలిస్తే సంపూర్ణమని అర్థం. పురుషుడు+స్త్రీ=సంపూర్ణ మానవుడు. అందుకే శాస్త్రీయంగా చెప్పినా కూడా ప్రతి పురుషునిలోనూ స్త్రీ ఉంది. ప్రతి స్త్రీ లోనూ పురుషుడున్నాడు. అంటే ఫిమేల్ హార్మోన్స్, మేల్ హార్మోన్స్ ఇద్దరిలోనూ ఉంటాయని ఇటీవల మన శాస్త్రవేత్తలు కూడా చెప్తున్నారు కదా. అందుకే వారిలో సృజనాత్మక శక్తి ఉంది. శివునకు అందుకే అర్ధనారీశ్వర తత్వం చెప్పారు. సగం శివుడు, సగం పార్వతి ఉండే బొమ్మలు అందుకే మనకు ఉన్నాయి. దాని అర్థం కూడా ఇదే. పురుషునికి పాజిటివ్(ధనాత్మకం) సంకేతమనీ, స్త్రీకి నెగటివ్(ఋణాత్మకం) సంకేతమనీ అర్థం. ప్రపంచం ద్వంద్వాత్మకం ప్రకృతి-పురుషుడు. రామాయణాన్నే తీసుకుంటే సీత ప్రకృతికి సంకేతం. భూదేవి నుండి ఉద్భవించింది. రాముడు పురుషునికి(భగవంతునికి) సంకేతం. ద్వంద్వాత్మకం గురించి ఇంకా చెప్పాలంటే భగవంతుడు-భక్తుడు, గురువు-శిష్యుడు; భర్త-భార్య ఇలా రెండు విధాలుగా ఉంటుంది. ఉన్నది-లేనిది. ఈ ద్వంద్వాత్మకమే సృష్టి మర్మం. (చూ. ఎ. హనుమంతప్ప 'చపలచిత్తులు' ఫుట్‌నోట్స్ స్రవంతి ఫిబ్రవరి 1983 మరియు మన 'ఆచారాలు-అంతరార్థాలు' సప్తగిరి జూన్ 1983) అదే ఆ బొమ్మలోని +, —ల మర్మం.

చివరి అట్ట :-

చివరి పత్రంపై శ్రీ అరవిందులవారి పద్మాన్ని (లోటస్) గురించి చెప్పిన కొటేషన్ ఉంది. ఈ కావ్యం గొప్ప తత్వాన్ని



చిత్రము-1


చిత్రము-3



చిత్రము-4



చిత్రము-2


చిత్రము-5

కూడా బోధిస్తుంది. ఇది యోగశాస్త్రంతో ముడిపెట్టి వర్ణించినట్లు ఈ కావ్యంలో గమనిస్తాము కనుక పద్మంలోని తేజస్సును గురించిన కొటేషన్ చివరి ముఖపత్రంపై ఉంచారు. అందుకే ఈ కావ్యం కమలాలుగా కూడా విభజించారని మొదే అనుకున్నాము.

—"బట్ ది ఫౌండేషన్ ఆఫ్ థింగ్స్ ఈజ్ అబౌ అండ్ నాట్ బిలో - 'ఉపరి బుధ్నాయేషం'. ది సూపర్ కాన్షియంట్, నాట్ ది సబ్ - కాన్షియెంట్ ఈజ్ ది ట్రూ ఫౌండేషన్ ఆఫ్ థింగ్స్.

ది సిగ్నిఫికెన్స్ ఆఫ్ ది లోటస్ ఈజ్ నాట్ టు బీ ఫౌండ్ బై ఎనలైజింగ్ ది సీక్రెట్స్ ఇన్ ది మడ్ ఫ్రమ్ ఉచ్ ఇట్ గ్రోస్ హియర్, ఇట్స్ సీక్రెట్ ఈజ్ టు బీ ఫౌండ్ ఇన్ ది హెవెన్లీ ఆర్కిటైప్ ఆఫ్ ది లోటస్ వట్ బ్లూమ్స్ ఫార్ ఎవర్ ఇన్ ది లైట్ అబౌ" — శ్రీ అరబిందో.

—"కాని వాస్తవిక ప్రపంచానికి పునాదులు పైన ఉన్నాయే తప్ప క్రింద లేవు. ఆ పునాది అతీత మానసావస్థ తప్ప కేవల భౌతిక మానసిక దశ కాదు.

పద్మమంటే దాని రహస్యం అది పుట్టిన బురదలో వెతికితే దొరకదు. దాని మూలాలు తేజోలోకంలో నిత్యమూ వికసిస్తూనే ఉన్న ప్రాగ్రూప పద్మంలో దర్శించాలి." - 'శ్రీ అరవింద'

ఇదంతా తత్వానికి సంబంధించింది ఆధ్యాత్మిక తత్వం లేదా గొప్ప సంస్కారమైన వాసనలు పద్మంలో ఉంటాయి. అందుకే పద్మం తత్వానికి సంకేతమైంది పద్మముయొక్క మూలము బురదలో ఉండదు. ఈ సకల పద్మాలకు మూలమైన ఒకానొక పద్మము స్వర్గంలో ఉంది. కావ్యమంతా చదువు కొచ్చిన తర్వాత కావ్య రహస్యమంతా చివర్లో ఉంటుంది. చివరి దాకా చదివింతర్వాత రహస్యం తెలుస్తుంది. ఇది తెలిసిన తర్వాత కావ్యం మళ్ళీ మొదటినుంచీ చదవాలి. అప్పుడు కావ్యం అవగాహన అవుతుంది. ఒక కొలికికి వస్తుంది.

ఆశ్వాస విభాగమంతా కమలమే. మొదట-మధ్య-చివర ఈ మూడింటి సమన్వయమే కమలము.

ఈ విధంగా మొదటి, చివరి అట్టలమీద ఉన్నవాటిని గమనిస్తే తెలుస్తుంది. ఈ కావ్యానికి అట్టలమీద ఉండే రంగులను కూడా లావర చేయాలి. ఆ రంగులు కూడా ఏదో ఒక రంగు ఉండాలి కదా అవి పూయించినవి కాదు. ఆ రంగులను ఎన్నుకోవడంలో కూడా తాత్విక విషయం ఉంది. అట్టలపై రెండు రకాల రంగులు కూర్చబడ్డాయి. కొన్ని ప్రతులకు నీలివర్ణం, మరికొన్ని ప్రతులకు ఎరుపురంగు ఉంది ఎందుకు కొన్నింటికి నీలిరంగు లేదా మరికొన్ని ప్రతులకు ఎరుపురంగు ఉంది అన్న విషయాన్ని క్రింద చూద్దాం.

నీలం రంగు -

శివుడికి నీలలోహితుడని పేరు ఇది నిర్గుణతత్వానికి, అనంత తత్వానికి సంకేతం లేదా పురుష తత్వానికి సంకేతం.

ఎరుపు రంగు :-

ఎరుపు లోహిత వర్ణం. సృష్టి (క్రియేషన్)కి సంకేతం. ఇది దేవీ తత్వ వర్ణం. ఒక్కొక్క తత్వానికి ఒక్కొక్క వర్ణం సంకేతంగా ఉంటుంది.

ఎరుపు సృష్టికి సంకేతమైతే, నీలం (బ్లూ) లోతు(డెప్త్-ఖాతము)కి సంకేతం.

ఈ రెండు వర్ణముల కలయికే ప్రకృతి-పురుష సమ్మేళన రూపమైన సృష్టి తత్వము. సృష్టిని సప్తవర్ణాత్మకంగా ప్రాచీనులు దర్శించారు. ఈ రెండు వర్ణాలు (నీలలోహిత వర్ణాలు) ఒకటి, ఏడు రంగులుగా ఉండగా మధ్యలో ఇతర వర్ణాలు ఐదు ఉన్నాయి. అంటే ఈ రెండు వర్ణాల మధ్య సృష్టి తత్వమున్నదని అర్థం. ఈ రెండు రంగుల కలయికచేత సృష్టి ఏర్పడటం పేరే కావ్యనామం కుమారభారతి. ఇదే కౌమారతత్వం. కుమారుడంటే నీలలోహిత వర్ణస్వరూపుడైన అర్థనారీశ్వరుల కలయిక. కుమారుడంటే ఇదే అర్థం కనుక కుమారభారతి కథను ఈ తాత్విక దశకు (లేదా) కుమారస్వామి కథను ఈ తాత్వికదశకు తీసుకొనిపోయి వ్యాఖ్యానించిన ఇతిహాసమే కుమారభారతి దానికి వర్ణాలు కూడా సంకేతమే.

ఈ విధంగా ముఖపత్రం మీద ఉన్న బొమ్మలు, రంగులు, మాటలు అన్నీ కావ్య తత్వ వ్యంజకాలుగా, ప్రతీకలుగా సంకేతాలుగా గ్రహించవచ్చు. ఇదే కుమార దర్శనమంటే. కుమారభారతి అంటే కుమార దర్శన మన్నమాట. దర్శనమంటే ప్రతిభ లేదా (విజన్) పశ్యంతి (తాత్విక దర్శనము). దీనినే ఐతిహాసిక కవితా దృష్టితో కుమార భారతిగా కవిగారు నామకరణం చేయడంలోని రహస్యం. ఈ విధంగా కావ్య ముఖపత్రాలు తీర్చడమనేది మనకు తెలిసినంతవరకూ ఎక్కడా కనిపించదు.

ప్రత్యగ్రమైన కుమార భారతికి ప్రణామములు. (ఈ వ్యాస రచనలో తమ అమూల్యమైన సలహాలనిచ్చి ప్రోత్సహించిన డా॥ ఎ. హనుమంతప్పగారికి కృతజ్ఞుడను.)

# అసంపూర్తి చిత్రం

ఆలోచనలు గుండెమీద పులిమే
సగం సగం రంగులు....
మగతగా....అర్ధరాత్రిలా....
మెరుపులు మెరుపులుగా
చీకటి చూరులోంచి కారిన వెలుతురు మడుగులో
కాగితప్పడవలు తప్ప-
నడవని బతుకు నావలు.
ఆకాశమంత ఆకాశంలో
కోరికల్లా పరుచుకున్న తారకల మధ్య
ఆశల అర్ధచంద్రుడు.
రంపపు ప్రేవుల రుద్రవీణమీద
దరిద్రం రాగాల అర్ధాకలి ఆలాపన.
చలిలో వణికిపోతున్న ఫుట్‌పాత్‌మీద;
ఒంటి స్పృహ లేని
చింపిరిగుడ్డల అర్ధనగ్న నృత్యం.
కెరటాలు కెరటాలుగా తరుముకొస్తున్న సమస్యల్నించి జారి
సీసాల నూతుల్లో పడి తన్నుకుంటున్న బతుకు.
పంచ నక్షత్రాల మంటలంటుకున్న శీలంతో
సగం చచ్చిన ఆడతనం.
అర్ధరాత్రి....ఒంటరిగా....పిచ్చిధైర్యంతో....
శాసనాల వీధుల్లో సంచరిస్తూ
పట్టపగలే చెరచబడుతున్న రాజ్యాంగం.
అర్ధరాత్రిని చెల్లాచెదరు చేస్తూ
ఉదయించిన స్వతంత్రం చుట్టూ
రాక్షసంగా ఆవరించిన అర్ధరాత్రి.
'ఆధా హై చంద్రమా....రాత్ ఆధీ....'
ఎవడో పిచ్చివాడు పిరుకుంటున్న
సగం కాలిన పాట ముక్కలు....
ఊహల కుంచెకు లొంగని అక్షర రేఖలు
కవిత్వం కాన్వాసుమీద
వివర్ణభావ కోణాకృతులు....
ఈ అర్ధరాత్రి—
సగం పుండుపడిన కాలం నేత్రం!
ఒక అసంపూర్తి చిత్రం....!!!

# మనిషి సముద్రమైనప్పుడు...

ఎండ కన్నెరుగని అనుభూతులు
ముత్యాల్లా లోలోన దాగి వున్నా
చిత్రవర్ణం ఊహలు
చిరుచేపల్లా కేరింతలు కొడుతున్నా
అగాధాల్లా నోరు తెరుచుకున్న సమస్యల ముందు
బడబలా దహించే ఆకలి ముందు
సముద్రంలో రెట్టాలా తుడిచిపెట్టుకు పోతాయి.
ఉపరితలం మీద సోమరిగా కదిలే అన్ని ఆదర్శాలూ
విరుచుకుపడే తుఫానుల్లో తలకిందులవుతాయి
బ్రతుకొక్కటే; తీరంలో నిటారుగా వెల్లుతూ
బాటలనిండా కాంతులు విరజిమ్ముతుంది.
కసితో బిగిసిన వేయి పిడికిళ్ళు
ఉధృతంగా తీరాన్ని ఢీకొంటాయి.
ముడుచుకుపోయిన నిశ్శబ్దాన్ని పగులగొడుతూ
కెరటాలు కెరటాలుగా జీవనాదం ఘోషిస్తుంది.
శరీరార్ణవంలోంచి అవిరిగా ఎగసిన స్వేదం
ఆకాశమెత్తు ఎదిగి
మబ్బులు మబ్బులుగా పరచుకొని
ప్రాణధారై ధారాపాతంగా వర్షించినప్పుడు
పుడమి జీవశక్తితో పచ్చపచ్చగా శ్వాసిస్తుంది.
సముద్రం మనిషైనప్పుడు
మనిషి సముద్రమైనప్పుడు
బొట్లు బొట్లుగా మనిషి ప్రవహించి
అపార జనరాశిలో సంగమించినప్పుడు
గుండె లోతుల్లోంచి పైకి లేస్తూ
భవిష్యత్ ఆకాశం అంచుమీద
చైతన్యం ఎర్రగా ఉదయిస్తుంది.

శ్రీ దిలావర్

డా॥ పురాణం రాధాకృష్ణప్రసాద్

# శ్రీధాన్యకటకమున శైవము-అమరేశ్వరాలయ ప్రాచీనత*

శివుడు అనుగ్రహమూర్తి, మహాదేవుడు. సర్వప్రాణులకు పతి యగుటచే పశుపతి. హిందువులకు అతి ముఖ్యదేవుడై లింగాకారమున[1] అర్చింపబడుచున్నాడు. త్రిమూర్తులలో సంహార మూర్తి యనుట క్రోధమూర్తి యగుటచే కాదు. కార్యనిర్వహణ వ్యాజము.

లింగార్చన ఆంధ్రదేశమున అతి ప్రాచీనము. ఇందుకు సాహిత్యమునందు అనేక యాధారములున్నవి. నాటి ప్రాచీన కట్టడములున్నవి. నేటికివి ఆంధ్రులు బాల బాలికలకు అక్షరాభ్యాసము 'ఓం నమశ్శివాయ సిద్ధం నమః' యనుచు శివ పంచాక్షరితోనే ప్రారంభించు ఆచారమును పాటింతురు.

మధ్య శతాబ్దులలో ఆంధ్రభూమికి త్రిలింగదేశమను పేరు కల్గినది. మూడు ప్రసిద్ధ శివ క్షేత్రములు, దాక్షారామమ్ము, శ్రీశైలమ్ము, కాళేశ్వరము ఎల్లలుగా గుర్తింపబడుటచేతనే ఈ పేరు వచ్చుట. శివుడనగా శుభమును గూర్చువాడు. అశుతోషుడనగా త్వరగా ప్రీతిని చెందు మూర్తి. అభిషేక ప్రియుడగుటచే అభిషేక మాత్రముననే అందరకు సులభసాధ్యుడగు దేవుడు. దేవి సర్వమంగళ. అగుచో ఈ ఆదిదంపతులను ఎవరారాధించకుందురు?

ప్రాచీన చారిత్రిక కాలమునాటికే శివారాధన మునుపటి పూజా పద్ధతులను విడనాడి నూతన అర్చనా విధానాలతో సాంప్రదాయకతను, ప్రాముఖ్యతను సంతరించుకున్నది. సూత్రకారుడగు ఆపస్తంబ మహర్షి (క్రీ.పూ. 500) కాలమునాటికే ఔపనిషదమగు జ్ఞానమార్గమునకును జైమినీయ పూర్వమీమాంసా విధానమగు కర్మమార్గమునకును మధ్యేమార్గముగా భక్తిమార్గము ప్రచారములోనికి వచ్చెను. ప్రోత్సహించబడెను. పౌరాణిక భక్తితత్త్వము ఆంధ్రుల జీవన విధానమును ప్రభావితము చేసినది. విష్ణువు, శివుడు వారి వారి పరివార దేవతలు వెలసిరి. వారియందలి భక్తి ప్రవృత్తులను వృద్ధి చెందించినది. ఆపస్తంబమహర్షి యొకచో మతాచార సాంప్రదాయములను పాటించుటయందు పురాణ వచనములు ప్రామాణికములని పేర్కొనెను.[2] ఇందుకు కారణము ఆ కాలమున క్రమక్రమంగా విస్తరించుచున్న అవైదిక మతముల పురోగతిని ఆటంకపరచి వాని ప్రభావమును తగ్గించు ప్రయత్నమే. వాస్తవమునకు ఏ మతము గూడ సమకాలీన యితర మతవిషయక సంప్రదాయముల ప్రభావము లేకుండా ఒంటరిగా వృద్ధి చెందదు.

తూర్పు తీరాంధ్రమున, అందును కృష్ణ పరీవాహిక ప్రాంతములో మతవిషయక వాతావరణము యింతకంటె భిన్నముగా లేదు. శ్రీ ధాన్యకటకము బౌద్ధులలో మహాసాంఘికులకు లేక మహాయానీయులకు ఆలవాలముగా నుండెను. వీరే యిచ్చటి మహాచైత్యము నారాధించువారై చైత్యవాదకులని పిలువబడుచుండిరి. వాస్తవంగా ఇది బౌద్ధులకు ప్రధాన కేంద్రము. దీని ప్రభావమున తీరాంధ్రమున, యితర ప్రాంతములందు కూడ అనేక బౌద్ధ కేంద్రములు వెలకొల్పబడటమే కాక బౌద్ధము ఇక్కడ నుండియే సుదూర ప్రాంతములకు యావత్ దక్షిణదేశంలో విస్తరించింది.

ధాన్యకటకమునకు సమీపంలోని వడ్డమానువద్ద అదే కాలంలో జైనం కూడా వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తుంది. దానికి ఆధారాలు ఈ మధ్యనే పురాతత్త్వజ్ఞుల త్రవ్వకాలలో లభించాయి (టి. వి. జి. శాస్త్రి. 1981-83).

ఇటువంటి పరిస్థితులలో ఈ ప్రాంతంలో క్రీస్తుకు ముందు శతాబ్దాలలో పురాణ ప్రభావం విస్తరించటం గాని అవైదిక మతాల వ్యాప్తికి దీటుగా శైవమందిరాలు, శాలలు నెలకొల్పబడటం ఆశ్చర్యం కాదు. కృష్ణాతీరంలో కోస్తా జిల్లాల్లో ప్రాచీన శైవమందిరాలు అనేకం ఉన్నట్లు ఈ మధ్య జరిగిన నూతన పరిశోధనల వల్ల తెలిసింది. (ఐ. కె. శర్మ 1983)

ధాన్యకటకం గూడ దీనికి మినహాయింపు గాదు. ప్రస్తుత పరిశోధనలవల్ల శైవం క్రీస్తు ముందు శతాబ్దులనుండి గూడ స్థిర

పడియున్నట్లు ఇక్కడ బయటపడ్డ శైవమందిరాలవల్ల తెలుస్తుంది. అమరావతిలో ఈ మధ్యనే లభించిన శాతవాహనకాలం నాటి చలువరాతి చతుర్ముఖ యిష్టలింగం (ఐ. కె. శర్మ 83, పుట 74, తరువాత) మాత్రమే కాక మరో రెండు ఆలయాలు- అమరేశ్వరునిది, స్కందకుమారునిది - ధాన్యకటకంలో ముఖ్యమైనవి. వీటిలో రెండవది - స్కందకుమారుని ఆలయం - కాలగర్భంలో కలిసిపోగా, అమరేశ్వరుని ఆలయం మాత్రం కాలానికి, బౌద్ధుల ఆధిక్యతకు ఎదురునిలిచి, ప్రతికి బౌద్ధం తిరోముఖం పట్టిన తరువాత మళ్ళీ ఆధిక్యతను సాధించుకొని తీరాంధ్రంలోని పంచారామ క్షేత్రాలలో మొదటిదిగా గణుతికెక్కింది

అయినప్పటికి, ఈ అమరేశ్వరాలయం పూర్వ చాళుక్య రాజుల కాలంలో బౌద్ధ కట్టడ శిధిలాలమీద నిర్మింపబడ్డట్లుగా పండితులు ఇప్పటిదాకా తలంచారు. దీనికి బాధ్యులు కాలాముఖులనే శైవశాఖీయులని, విజయవాడ, అమరావతి మొదలైనచోట్ల వారి సింహపరిషత్తులు స్థాపించేటప్పుడు ఈ ఆలయం గూడ నిర్మించి శైవులు ఈ ప్రాంతంలో బౌద్ధం క్షీణించటానికి కారకులయ్యారని పండితులు అనుకున్నారు. (బి. యస్. యల్. హనుమంతరావు-1973, పుట-130) ఇంతేకాకుండా అమరేశ్వరుని పొడవాటి లింగము బౌద్ధులు తమ మహాచైత్యముపైన అమర్చిన ఛత్రముయొక్క దండము కావచ్చునని, లింగముపైనున్న చిన్న గుంట దీనిని సూచిస్తుందని అనుకున్నారు. కాకపోతే ఆయక స్తంభము కావచ్చునని ఇటువంటివే మరికొన్ని బౌద్ధులయొక్క స్తంభములను శైవుల పంచారామ క్షేత్రాలలోని ఆలయాలలో లింగమూర్తులుగా ఉపయోగించుకున్నారు అని గూడా భావించారు. (ఐ. కె. శర్మ 83 పుటలు 78, 79)

ఏదో పెద్ద దిబ్బమీద కట్టబడినట్లుగా రెండవ అంతస్థులో ఎత్తుగా కనుపించే ఈనాటి దేవాలయ నిర్మాణము, ఈ ఆలయ ప్రాంగణంలో పెద్ద సంఖ్యలో లభించిన బౌద్ధశిల్ప శకలాలు, బౌద్ధులు ఉపయోగించిన ఆకుపచ్చని చలువరాయి (సున్నపురాయి)లో ఆయక స్తంభము లేక ఛత్రదండమును పోలి అదే సున్నపురాతిలో కన్పించే 15 అడుగులకు పైగా పొడవైన లింగము యీ మూడున్నూ పండితులు ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చటానికి కారణాలు కావచ్చు.

కాని ఆలయ కట్టడాన్ని విశదంగా పరిశీలించినట్లయితే కొన్ని ముఖ్యమైనవి, ఆసక్తికరమైన విషయాలు తెలియగలవు. వీనివల్ల పండితుల పై వాదనలు ఖండింపబడటమే కాకుండా ఆలయం మొదట దాని ప్రారంభంనుంచి శైవులదేనని, ప్రాచీన



నేటి అమరేశ్వరాలయము - అమరావతి

కాలంలోనే అంటే ఈ ప్రాంతంలోని బౌద్ధ నిర్మాణాలకు ముందుగా గాని లేక సమకాలంలోనైనా గాని నిర్మింపబడ్డట్లు తెలుస్తుంది.

ప్రస్తుతం కనపడే రెండంతస్థుల ఆలయ కట్టడం పూర్వ చాళుక్యరాజుల కాలానికి చెందుతుంది ఆనాటి రాజగు చాళుక్య భీముడు (892-922 క్రీ శ) కట్టించి ఉంటాడని పండితుల అంచనా (మారేమండ రామారావు 1964) ఎందువలనంటే ఆయనచే కట్టింపబడినట్లు లిఖిత శాసనాధారాలతో లభించిన కోస్తా జిల్లాలలోని ఆయనయొక్క యితర ఆలయాలను ఇది పోలి ఉంటుంది[3] గనుక

ఈ ఆలయంలో లభించిన మొదటి శాసనాధారం శక. సం 1051 (1129 క్రీ శ) నాటిది. దీనిలో పుని 'అమరేశ్వర మహాదేవర' అని ఉదహరించారు. మరొక శాసనం[4] శ.సం 1068 (1164 క్రీ శ.) వలన యిక్కడ బుద్ధునకు (బుద్ధవర), అమరేశ్వరునకు కూడ ఆలయాలు ఉన్నట్లు తెలుస్తుంది. పురాణాలవలన తెలిసే కాకుండా పంచారామాలలో ఈ ఆలయం కూడా చేరిఉన్నట్లు తెలియజేసే మొదటి శాసనాధారం యిదే స్థానిక పాలకులయిన కోటకేత రాజులయొక్క మరొక శాసనం[5] శ సం 1104 (1182 క్రీ.శ) నాటిది ఆలయం యొక్క దక్షిణ ద్వారంవద్ద తూర్పువైపు స్తంభంమీద కనపడుతుంది. దానిలోని ఒక శ్లోకంలో శ్రీ ధాన్యకటకంలో అమరేశ్వరుడు, బుద్ధదేవుడు, నానాశిల్ప (చిత్రి) శోభితమయిన ఉన్నతమగు చైత్యం గూడ ఉన్నట్లు వర్ణింపబడ్డది

అస్తిశ్రీ ధాన్యకటకం సురపుదాద్వరం
యత్ర అమరేశ్వరః శంభు రమరేశ్వర పూజితః
బుద్ధ దేవస్య సాన్నిధ్యా దత్ర ధాత్రో ప్రపూజితః
చైత్య మత్యున్నతం యత్ర నానాచిత్ర సుచిత్రితమ్॥

అదే శిలాలేఖనంలో బుద్ధదేవునికిగాను మూడు గ్రామాలు పన్నుల మినహాయింపుతో ఈయబడినట్లు చెప్పబడింది.

సింహళ దేశంలోని కాండీజిల్లా గదలదేసియ గ్రామవాసియైన ధర్మకీర్తి అనే బౌద్ధభిక్షువు 1344 క్రీ శ.లో వ్రాయుకున్న శాసనంలో[6] ధాన్యకటకంలోని బుద్ధదేవుని ఆలయానికి కొన్ని మరామత్తులు చేయించినట్లు చెప్పుకున్నాడు దీనివలన యిచ్చటి బౌద్ధక్షేత్రాన్ని సింహళం వంటి సుదూర దేశాలనుండి గూడ యాత్రికులు వచ్చి పదునాల్గవ శతాబ్దంలో సైతం దర్శిస్తూ ఉన్నట్లు తెలుస్తుంది



చిత్రము - 1
అమరేశ్వర లింగము - అమరావతి

పైన ఉదహరించిన శాసనాధారాలవలన ఇక్కడ శైవులు, బౌద్ధులు దేవాలయం కట్టిన తరువాత గూడ కనీసం నాలుగు శతాబ్దాలు ఇరుగు పొరుగుల ఉన్నట్లు తెలుస్తుంది దీనివలన ఇరుమతాలవారి మధ్య వైషమ్యం ఉన్నట్లుగాని, దాని కారణంగా బౌద్ధుల కట్టడాలను శైవులు ఆక్రమించి ఉంటారనుకోవటం అనుచితం ఈ విషయాన్ని బౌద్ధం క్షీణదశలో ఉన్నప్పుడు ధాన్యకటకాన్ని దర్శించిన (క్రీ.శ 7వ శతాబ్ది) చీనా యాత్రికుడు హ్యుయాన్‌సాంగు యొక్క వ్రాతలు (సి-యు-కి) బలపరుస్తున్నవి. అటువంటి ఏపాటి ఆధారాలున్నా ఆయన ఉదహరించకుండా ఉండేవాడు కాదు పైగా ఇక్కడ చాలా దేవాలయాలు ఉన్నట్లు వాటిని అన్ని మతాలవారు దర్శిస్తూ ఉన్నట్లు ఉదహరించాడు. ఏ కారణం చేతనైనా బౌద్ధుల స్థలాన్ని లేక కట్టడాన్ని దౌర్జన్యంగా శైవులు ఆక్రమించి ఉంటే దాని తరువాత బౌద్ధులు నాలుగు వందల సంవత్సరాలకు పైగా అక్కడ నిలచి ఉండరు. మరొక ముఖ్యవిషయం గూడ గమనించాలి. కాలాముఖుల వంటి సాంప్రదాయవాదులు అవైదికులు, నాస్తికులు అని గర్హింపబడిన బౌద్ధులయొక్క "అపవిత్రమైన" కట్టడాలను ఆక్రమింతుకోవటంగాని, వారి కట్టడాలలోని స్థంభాలను తెచ్చుకొని తమ ప్రధాన ఆరాధ్యదేవుని మూర్తిగా తమ మందిరంలో నిలుపుకోవటం గాని జరిపి ఉండరు. ఒకవేళ అట్లా చేస్తారనుకున్నా దాన్ని ఆగమశాస్త్రబద్ధంగా మలచుకొని ఉండేవారు.

ఈ లింగం ఆగమ శాస్త్రాలకు పూర్వంనుంచి ఉన్నటువంటిది. ఆ కారణంచేతనే ఆగమ శాస్త్రానుబద్ధంగా లింగంమీద ఉండవలసిన బ్రహ్మ, విష్ణు, రుద్ర భాగాల విభజన లేదు. అట్లాగే బౌద్ధుల స్థంభాల మాదిరిగా (అష్టభుజాకారం) ఎనిమిది పలకలుగా ఉండకుండా వర్తులాకారంలో పైనుంచి క్రిందివరకు పీఠభాగంలో గూడ ఉంటుంది.[7] [చిత్రం-1].

లింగానికి పైన ఉన్న గుంటకూడ దీనిని బౌద్ధుల స్థంభంగా నిర్ణయించదు. బౌద్ధ శిల్ప సంప్రదాయంలో ఛత్రదండానికి ఛత్రము ను అమర్చే విధానంలో దండానికి కూసమును అమర్చి ఛత్రమునకు గుంటను ఏర్పరచి బిగిస్తారుగాని దానికి వ్యతిరేక విధానంలో కాదు. అమరావతి మ్యూజియంలో ఉన్న అనేక ఛత్ర శకలాల వల్ల గూడ ఈ విధానం తెలుస్తుంది అంతేకాకుండా ఈ లింగం మీది గుంట ఛత్రం అమర్చగలందులకు యేర్పరచే విధానంలో క్రమబద్ధంగా ఉండక ఎగుడు దిగుడుగా చెక్కిన గుంటవలె ఉంటుంది. దీనిలో నిండే అభిషేక జలము పొర్లిపోకుండా ప్రక్కలకు జారిపోయేట్లు పైనుండి క్రిందివరకు రెండుప్రక్కల



చిత్రము - 2

ప్రాచీన ఆలయ ఉత్తర ద్వారము.

ప్రస్తుతం మూయబడినది - అమరేశ్వరాలయం

వున్నవి కాలువలలాగా మార్గాలను ఏర్పరచారు. అట్లాగే వెనక ప్రక్కన గూడా మరి రెండు మార్గాలను (అంటే మొత్తం నాలుగు మార్గాలు) ఏర్పరచారు. లింగమూర్తి బౌద్ధులకు చెందినదే అయితే శైవులు యీ గుంటను పూర్తిగా తొలగించి ఉండేవారు గాని దానినుండి నీటిమార్గాలను ఏర్పరచేవారు గాదు. అట్లా గాకుండా యీ గుంటను శైవులే ఒకానొక ప్రయోజనాన్ని ఆశించి ఉద్దేశ్యపూర్వకంగా ఏర్పరచారు. అయితే ఆ ఉద్దేశ్యం ఏమై ఉంటుందో ప్రస్తుతం చెప్పలేము.[8]

ఇప్పుడున్న ఆలయం రెండవ అంతస్తుతో ఎత్తుగా ఉంటుంది. క్రింది అంతస్తు భాగాన్ని పూర్తిగా మట్టితో భర్తీ చేసారు. ఈ పనివల్లనే ఇది బౌద్ధుల కట్టడమై దానిని శైవుల సంబంధమైనదిగా మార్చేశేమోనన్న అపోహ కలుగుతుంది. కాని యీ కట్టడం నదికి సరిగా దక్షిణపు గట్టుమీదనే ఉంటుంది. ఆ కారణంచేతనే ఈమధ్యవరకు ప్రతి సంవత్సరం నదిలో వచ్చే వరదలు ఆలయాన్ని చుట్టుముట్టి దాని ఉనికికే భంగం కలిగించే టట్లుగా ఉండేది పరిస్థితి.[9] బహుశ నది ముంపుకు లోనవుతున్న ఆలయాన్ని కాపాడుకోవటానికి చాళుక్యరాజుల కాలంలో ప్రయత్నించారు. చాళుక్య భీముడు (892-922 క్రీ శ) నేటి ఆలయ నిర్మాణానికి కారకుడై ఉంటాడు ఇక్కడ నిర్మించిన ఆలయ శైలి, దాని హుందాతనం ఆయనను ఉత్తేజపరచాయి. ఆ కారణం చేతనే ఆయన కట్టించిన యితర ఆలయాలను నదుల ఒడ్డున కానిచోట్ల గూడా ఇదే శైలిలో నిర్మింపజేసి ఇటువంటి లింగములనే ప్రతిష్ఠించి వానికి తన పేరుమీదిగా భీమేశ్వరుడని నామకరణం చేసాడు.[10]

ఇక్కడి లింగం మాత్రం కొత్తదికాక ఆయనవలన ఆలయం మాత్రమే జీర్ణోద్ధరణ లేక పునర్నిర్మాణం కావటంచేత దేవునికి ఉన్న పురాతన నామాన్ని 'అమరేశ్వరుడని' అలాగే ఉంచాడు. అయితే ఆలయం అనేక బౌద్ధ సంఘారామాలతో నిండిన ప్రాంతంలో ఉండటంవలన ఇదిగూడ అమరేశ్వరుని పేరు మీదుగా అమరారామమని పిలవబడేదిగా తోస్తుంది. బహుశ ఈ ఆరామ పదము, ఆలయ నిర్మాణశైలి, యిదే శైలిలో యితర ప్రాంతాలలో నిర్మించిన మరో నాలుగు ఆలయాలకు గూడా వర్తించి యివి పంచారామాలుగా గణుతికెక్కినట్లు తెలుస్తుంది.

మొదట్లో నది ముంపులనుంచి తప్పుకోవటం కొరకే పొడవాటి లింగాన్ని గట్టుమీద ప్రతిష్ఠించి ఉంటారు.[11] దాని చుట్టూ సామాన్యమైన చిన్న ఆలయం ఉండి ఉంటుంది. దాన్ని తరువాత పూడ్చివేసి దానిమీదనే ప్రస్తుత ఆలయాన్ని నిర్మించి అందులోనికి లింగాన్ని మార్చిఉంటాడు.[12] ప్రస్తుత ఆలయపు ఉత్తరపు ప్రక్కలో నేలమీద నేటికి ఒక పూడిపోయిన ద్వారం కనపడుతుంది. నేల ఎత్తు పెరగటంవల్ల ద్వారం మూడువంతులు మట్టిలో కప్పపడిపోయి మిగతా భాగం రాళ్ళతో మూయబడి ఉంది. [చిత్రం-2] ఈ ద్వారం అంతకుముందు లోపల ఒక ప్రాచీన ఆలయం ఉండటాన్ని, దానికి ఇది నదివైపునుండి ఉత్తరపువైపున ఏర్పాటు చేసిన ద్వారం కావటం సూచిస్తుంది. లోపల ఉన్నది బౌద్ధకట్టడమే అయితే యీ ద్వారాన్నే ఉంచనిచ్చేవారు కాదు. పైన నూతన ఆలయం నిర్మించిన తర్వాత గూడ క్రింది అంతస్థు కొంతకాలం వాడుకలో ఉండి ఉంటుంది

యీ అభిప్రాయం బలపడటానికి మరొక ఆధారం గూడ లభించింది. 1980లో నేడున్న తూర్పుగోపురాన్ని నిర్మించటానికి పునాదులు తవ్వుతుండగా నేలలో లోతుగా దాదాపుగా పైన చెప్పిన ద్వారం మట్టంలో ఒక పెద్ద నంది విగ్రహం విరిగిపోయి ప్రక్కకు పడివుండి లభించింది. దీన్ని నేడు పూర్వరూపానికి తెచ్చి అతికించి అమరావతి పురావస్తు ప్రదర్శనశాలలో

(మ్యూజియం) ప్రదర్శించారు. [చిత్రం-3] ఇది సాతవాహనుల నాటి శిల్పాలలాగా చలువరాతిలో చక్కగా అలంకరింపబడినట్లుగా మలచిన నిలువెత్తు విగ్రహం. లింగమూర్తిని చూస్తూ ఎదురుగా నిలుపబడినట్లు మలచినది. తూర్పుగా లింగానికి అభిముఖమై విరిగి పడిపోయి లభించింది.

యీ శిల్పం సాతవాహన కాలానికి (క్రీ.శ. 2వ శతాబ్ది) చెందింది. లింగాన్ని మలచిన రాతిలోనే దీన్నిగూడ మలచారు. మలచిన శైలి అలంకార విధానం గూడ బౌద్ధుల శిల్పాలంకరణ విధానంతో పోలి ఉంటుంది అందుచేత మహాచైత్యంమీది శిల్పాలంకారాలను మలచిన శిల్పులే దీన్నిగూడ దేవాలయం కొరకు మలచి ఉంటారనిపిస్తుంది అంతేగాని ఇదిగూడ బౌద్ధ శిల్పమే అయి మిగతా బౌద్ధ శిల్పశకలాలతోబాటుగా మహాచైత్యం దగ్గరనుంచి ఆలయ జీర్ణోద్ధరణ సమయంలో క్రీ.శ. 19 శతాబ్ది ప్రారంభంలో తరలింపబడి ఉంటుందనుకోవటానికి ఏమాత్రం వీలులేదు. అప్పుడు అలా చాలా శిల్పాలు తరలింపబడినట్లు తెలుస్తోంది. (జి. మెకంజీ కృష్ణా డిస్ట్రిక్టు మాన్యువల్ పుటలు - 164-65) ఇదిమాత్రం అటువంటిది కాదు. ఎందువల్లనంటే—

మొదటిది : అమరావతి బౌద్ధ శిల్ప శైలీ విధానంలో నిరలంకృతములేగాని ఎక్కడ పైవిధంగా అలంకరింపబడినట్లున్న జంతువులు లేవు. రెండవది : మహాచైత్య ప్రాంతం నుంచి ఇక్కడకు తరలించబడ్డ పెద్ద పెద్ద శిల్పశకలాల మాదిరిగా కాకుండా యీ భారీ విగ్రహం కాలూకూ ప్రతి చిన్నభాగం సన్నని కాళ్లు, గిట్టలు మొదలయిన సులభంగా విరిగిపోయే భాగాలు గూడ ఇక్కడనే దొరికినవి.[13] చివరిగా : ఇది లభించిన ప్రదేశము, భంగిమ, విరిగి పడిపోయిఉన్న స్థితి గమనించినట్లయితే ఇది ఆలయానికి చెందినదే విరిగి పడిపోయినప్పుడు ఉపయోగం లేనిది కావటంచేత అక్కడే మట్టిలో పూడ్చిఉంటారనిపిస్తుంది.



చిత్రము - 3
నందీశ్వరుడు - అమరేశ్వరాలయంలో
సాతవాహన కాలంనాటిది.
(పురావస్తు సంగ్రహాలయంవారి సౌజన్యంతో)

అందుచేత ఇక్కడి మొట్టమొదటి ఆలయం - ఇతరత్రా లభించిన ఆ కాలంనాటి యితర ఆలయాలవలె ఇటుకలతోనో లేక అటువంటి యితర సామగ్రితోనో కట్టినది - నేలమీదనే ఇంచుమించుగా నంది విగ్రహం లభించిన ఆనాటి నేలమట్టంలోనే నిర్మించారని తెలుస్తుంది.

సాతవాహన-ఇక్ష్వాకు రాజవంశాల పరిపాలన కాలంలో బౌద్ధులు తమ చైత్యాలంకరణలో విరివిగా సున్నపురాయిని (చలువరాయి) ఉపయోగించారు కనుక ప్రతి సున్నపురాతి శిల్పాన్ని బౌద్ధులదే అనలేము. యీనాటి పరిశోధనలో సున్నపు రాతితో మలచిన శివలింగాలు ప్రాచీన కాలానికి-ఆగమ కాలానికి ముందువి - ఆసక్తికరమైన పద్ధతులలో ఒక్కొక్కచోట ఒక్కొక్కరకంగా మలచినవి యీ పరిసర ప్రాంతాలలో చాలా ఉన్నట్లు తెలిసింది (శర్మ 1983). అమరేశ్వరుడు కూడ అట్టివానిలోని లింగమే. మొదట అది నదిలోని వరదలను తట్టుకొనేందుకే పొడుగుగా మలచబడి నేలమీద నిలువబడి బహుశా ఒక చెట్టు క్రింద నీడన వుండేది. సాతవాహనుల కాలంలో దానిచుట్టూ ఒక చిన్న మందిరం (ఆయతనం), ఎదురుగా నందిని ఏర్పరచారు. అయినా నదిలో వచ్చే వరదలకు ముంపు మాత్రం తప్పింది కాదు. యీ ఆయతనాన్ని మరొకమారు శాశ్వతంగా వరదల బాధనుంచి కాపాడుకోవటానికే పూర్వం చాళుక్యుల కాలంలో పైకి లేవనెత్తి నేడు మనకు కనపడుతున్న విధంగా నిర్మించారు. ఆ సందర్భంలోనే నది గట్టును కూడా పెద్ద బండరాళ్ళతో కాపడం చేసి వరదముంపు ఆలయానికి తాకకుండా కట్టుదిట్టం చేసారు. నేటికి కూడా కనపడుతుంది. అప్పటినుంచి దీన్ని ఆరామ క్షేత్రంగా పిలుస్తూ మధ్య శతాబ్దులలో బౌద్ధం తన ప్రాభవాన్ని కోల్పోతూ క్షీణదశలో ఉన్నప్పుడు ముఖ్య శైవక్షేత్రంగా గుర్తించి పంచారామ క్షేత్రాలలో మొదటిదిగా లెక్కించారు.

అమరేశ్వరుడు మొదట్లో అమరవటేశ్వరుడుగా పిలువబడేవాడు. దీనికి కారణం ఆయన వటవృక్షం (మర్రిచెట్టు) క్రింద ఉండటమే కావచ్చు. చాళుక్య ప్రభువగు రెండవ అమ్మరాజు (945-970 క్రీ.శ) కాలంనాటి కాడికొండ శాసనంలో[14] కాలా

ముఖుల సింహపరిషత్తులలోని గురుపరంపరను వర్ణిస్తూ వారు "అమరవటేశ్వరాది అనేక పురాణ దేవాయతన నివాసు"లకు చెందినవారని ఉదహరింపబడ్డది. యీ అమరవటేశ్వరుడు అమరేశ్వరుడేనని మరొకరు కాదని పండితులు అభిప్రాయం వెల్లడించారు. దేవుడున్న మట్టి గనుక దేవుడిమట్టి సంస్కృతంలో అమరవటం అయి దానిక్రింద వున్న ఈశ్వరుడు అమరవటేశ్వరుడు అయివుంటాడు.[15] తరువాత ఒక చిన్న ఆయతనాన్ని సంతరించుకొని కాలక్రమంలో అమరేశ్వరుడయినాడు.

ఈ విధంగా ఈ క్షేత్రాన్ని, లింగాన్నీ కూడా కోస్తా ఆంధ్రలోని ప్రాచీన శివక్షేత్రాలలో ఒకటిగా క్రీ.పూ. రెండు శతాబ్దులలోనిదిగా భావించవచ్చు.

దీనికితోడుగా ఈమధ్య (1964-65) ధరణికోటలో (ప్రాచీన ధాన్యకటకంలోని కోట ప్రాంతంలో) కేంద్ర పురాతత్త్వ శాఖవారు జరిపిన త్రవ్వకాలలో ఒక ప్రాచీనమైన దంతపుముద్ర లభించింది. [చిత్రం-4] దీనిమీద స్కంద కుమారుని ఆలయ చిత్రంతోపాటు దానిక్రింద క్రీ.పూ. మొదటి శతాబ్దానికి చెందిన బ్రాహ్మీ లిపిలో అయిదు అక్షరాలతో ప్రాకృతంలో "ఖదసాలస" అన్న పదం చెక్కబడి ఉంది. "ఖదసాలస" అంటే "స్కంద శాలయొక్క" అని అర్థం. చిత్రంలో ఆలయం ముందుభాగం చూపబడి ఉంది. క్రింది తలంమీద రెండు అంతస్థులతో కనబడుతుంది. క్రింది తలం చతురపు కట్టడంగా తెలుస్తుంది. చిత్రం మధ్యలో కొంత నష్టమైంది. ప్రతి అంతస్థు క్రిందిదానినుండి వేదికా ప్రాకారంతో వేరుచేయబడి అర్ధచంద్రాకృతితోనుండే 'కుడు' అలంకరణలతో ఉంది. పై అంతస్థుమీద శిఖరము కలదు. ఆలయ ముఖద్వారానికి ఇరువైపుల రెండేసి ధ్వజములు ఉన్నవి. వానిమీద కుడివైపున ఆరు ఆకులతోనున్న దర్భ మొక్క (కుశ) దాని తరువాత స్వస్తిక చిహ్నము అలంకరింపబడిఉన్నవి. ఎడమప్రక్క వానిమీద మయూరము, శక్తి లాంఛనము అలంకరింపబడినవి.[16]

ఈ దంతపు ముద్రిక క్రీ.పూ. మొదటి శతాబ్దంలో ఇక్కడ ఉన్న ఒక బ్రాహ్మణ మతస్థుల కట్టడం, స్కందకుమారుని ఆలయాన్ని, గురించిన తగినన్ని వివరాలను తెలియచేస్తుంది. ఆనాడు స్కంద కార్తికేయుడు ప్రధాన దైవతంగా ఆరాధింపబడేవాడు. కార్తికేయుడు ఈశ్వరుని కుమారుడు. ఆ ఆలయం యొక్క వ్యవహారములు దంతపుముద్రిక ద్వారా నడుపుకోవలసిన స్థాయిలో వున్నప్పుడు అదే కాలంలో - క్రీ.పూ. మొదటి, రెండవ శతాబ్దాలలో - యీ ప్రాంతంలో శివాలయం గూడా వుండి



ఖద సాలస

ముద్రిక మీది బ్రాహ్మీ లిపి-సవ్యరీతిలో

చిత్రము - 4

ప్రాచీన స్కందశాలయొక్క దంతపు ముద్రిక.

ధరణికోట

వుంటుందని వేరే చెప్పనవసరం లేదు. అది అమరేశ్వరాలయం కాక మరొకటి అయివుంటుందన వీలులేదు. ఆ కారణంగా గూడ ఇక్కడ అమరేశ్వరుని ఉనికి ప్రాచీనమే. అందుచేత బౌద్ధ కట్టడాన్ని శివాలయంగా మార్చిఉంటారన్న వాదం పూర్తిగా తిరస్కరింపబడుతుంది.

ఆ విధంగా క్రీస్తుపూర్వం రెండు శతాబ్దులలో కృష్ణా పరీవాహక ప్రాంతంలో అందునా ముఖ్యంగా ధాన్యకటకంలో దాదాపుగా బౌద్ధులు యీ ప్రాంతంలోకి కొత్తగా ప్రవేశించే కాలానికి గాని అంతకు ముందుగా గాని శైవం యిక్కడ బాగా పాతుకొని వెళ్లూనినట్లు తెలుస్తుంది. అయితే తరువాత బౌద్ధుల తీవ్ర మత కార్యకలాపాలవల్ల వెలుగులో నిలువలేకపోయింది. ఫలితంగా యీ క్షేత్రం ప్రధానంగా బౌద్ధక్షేత్రంగానే తెలియ

వచ్చిందిగాని శైవక్షేత్రంగా గుర్తింపబడలేదు. బ్రాహ్మణులు, వైదికాగమములు గూడ దీన్ని అవైదిక క్షేత్రంగానే తలచి ఉపేక్షించారు. తరువాత కాలంలో బౌద్ధం తిరోముఖం పట్టి తెరమరుగవుతున్న దశలో యీ శైవక్షేత్రం మళ్ళీ ఒకమారు వెలుగులోకి వచ్చి ప్రధాన శివక్షేత్రాలలో ఒకటిగా గుర్తింపు పొంది పంచారామాలలో మొదటిదిగా గణన కెక్కింది.[17]

పంచారామ క్షేత్రాల ఉత్పత్తిని గూర్చిన పురాణ కథనం గూడ ఇక్కడ అవైదిక మతాలు వ్యాపించటానికి పూర్వమే శైవ మున్నట్లు సూచిస్తుంది. భీమేశ్వర పురాణాన్ని[18] అనుసరించి ఇక్కడ ఒక మహాలింగం వుండేది దాన్ని అసురులు ఆపరించుకొని పూజిస్తూ అమితమగు శక్తులనూ, సంపదనూ పొందారు. దానివలన వారు గర్వించి దేవతలను ఇతరులను గూడ వేదించి బాధిస్తూ వుండటంవలన దేవతలు శంకరుని శరణు వేడారు. ఫలితంగా గొప్ప యుద్ధం సంభవించింది. దానిలో మహేశ్వరుడు అసురులను నాశనం చేయటమే కాకుండా వారి లింగాన్ని గూడ అయిదు శకలాలుగా భేదించి అయిదు ప్రదేశాలలో ప్రతిష్ఠించటం వల్ల అవి పంచారామాలుగా ప్రసిద్ధిలోనికి వచ్చినవి.

అమరారామంలో (ధాన్యకటకంలో) తప్ప మిగతా నాలుగు క్షేత్రాలలో అసురులు (అవైదికులు-బౌద్ధులు) ఉన్నట్లు ఆధారాలు యివ్వటివరకు లభించలేదు దాక్షారామ భీమేశ్వరుడు (సప్త గోదావరం) గూడ ఆగమ శాస్త్రములకు ముందు కాలమువాడే. ఆగమములలో దేశంలోని స్వయం భూలింగములను ఉదహరిస్తూ సప్తగోదావర భీమేశ్వరుని ఉదహరించారు. కాని అమరేశ్వరుడు ఆ కాలానికే ఇక్కడ వున్నట్లు నిస్సంశయంగా తెలిసినా ఉపేక్షించారు.

ఇదేవిధంగా చిత్తూరు జిల్లాలోని గుడిపల్లం పరశు రామేశ్వర లింగంగూడ ఉపేక్షింపబడ్డది క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దానికి చెందినదిగా యీ లింగం పురాతత్త్వ ఆధారాలవలన తెలుస్తుంది. అయినా పేర్కొనబడలేదు

దీనికి కారణం యీ రెండున్నూ అవైదిక లింగాలుగా పరిగణింపబడటమే. గుడిమల్లం లింగం మానవ లింగాకృతిలో వున్నది దాని ముందు భాగంమీద మానవాకృతి చెక్కబడి వుంది కాని నుదుట మూడవ నేత్రము, శరీరంమీద యజ్ఞోప వీతము - శివునియొక్క ముఖ్య లక్షణాలు - రెండూ లేవు. అమరేశ్వర లింగం గూడ అవైదికులు, నాస్తికులు అయిన బౌద్ధుల ఆరామాలతో ఆవరింపబడి వుంది ఈ కారణాలచేత సాంప్రదాయ వాదులైన బ్రాహ్మణులు, ఆగమకర్తలు ఉద్దేశపూర్వకంగానే యీ క్షేత్రాలను ఉపేక్షించి విస్మరించారు. సప్తగోదావరి భీమేశ్వరుని మాత్రం ఉదహరించారు.

బౌద్ధం యీ ప్రాంతంలో తిరోముఖం పట్టిన తర్వాతనే అప్పటిదాకా నామమాత్రంగా అస్తిత్వంతో వున్న అమరేశ్వర క్షేత్రం ముఖ్య తీర్థక్షేత్రంగా గుర్తింపబడి, అరువది నాలుగు స్వయంభూ లింగములు, ద్వాదశ జ్యోతిర్లింగములు, పంచ భూతేశ్వర లింగక్షేత్రములవలె అదే ప్రాతిపదికపై పంచారామ క్షేత్రములలో నొకటిగా గుర్తింపబడ్డది. పై ఆధారాల వలన తూర్పు తీరాంధ్రమున శైవమెంత ప్రాచీనమో అమరేశ్వర క్షేత్రము, అమరేశ్వరుడు గూడ అంత ప్రాచీనమని చెప్పబడివి ఉంది.

## అధోజ్ఞాపికలు :

* శ్రీశైలమునందలి తెలుగు విశ్వవిద్యాలయమువారు నిర్వహించిన శైవ సదస్సులో (1988 సెప్టెంబరు) చర్చింపబడిన రచయిత ఆంగ్ల వ్యాసము దీనికి మాతృక.

1. కొందరు పండితుల అభిప్రాయంలో ఈ చిహ్నము వైదిక సంప్రదాయమునుండి ఉద్భవించిన అగ్నితో సంబంధము కల్గిన రుద్రునకు ప్రతీకగా గుర్తింపబడినది. (నే. వెం. రమణయ్య - రుద్రశివ)
2. బుహ్లార్ : ఆపస్తంబాస్ కొటేషన్స్ఫ్రం ది పురాణాస్. ఐ. ఏ 25 - పుట 323 తరువాత.
3. ఎస్. ఐ. ఐ. వాల్యూం-6. నెం. 665. సామర్లకోటవద్ద నున్న చాళుక్య భీమవరంలోని భీమేశ్వరాలయము చాళుక్య భీముని కాలములో కట్టబడినట్లు తెలియును.
4. ఎస్ ఐ.ఐ. వాల్యూం-6, నెం-749.
5. పైన ఉదహరించినది. నెం-15.
6. ఎ. ఘోష్ : ది ఎర్లీ ఫేజ్ ఆఫ్ ది స్తూపా ఎట్ అమరావతి, సౌత్ ఈస్ట్ ఇండియా : ఏన్సెంట్ పిలోస్ నెం-3 ఆగస్టు 79, పుటలు 100-101.
7. డాక్టరు మంగళగిరి రామానుజదాసుగారు. 1980లో ఆలయ పునర్నిర్మాణ కాలంలో ట్రస్టీ బోర్డు మెంబరు. వారి ప్రత్యక్ష సాక్ష కథనం. వారికి మా కృతజ్ఞతలు.
8. ఇటువంటివే మరికొన్ని లింగములు సున్నపురాతిలోను, ఇతర రాతిలోనూ మలచినవి ప్రాచీన కాలమునాటివి

ఆసక్తికరమైన లక్షణాలతో నున్నవి గుర్తింపబడినవి. కాని వాని విలక్షణతలకు తగిన సమాధానం ప్రస్తుతం చెప్పలేము.

(1) దాక్షారామ భీమేశ్వరుడు : సున్నపురాతి ధారాలింగము, పైన చతురస్రపు గుంటతో నున్నది.

(2) చేజెర్ల కపోతేశ్వరుడు: సున్నపురాతి లింగము. పైన చతురస్రపు గుంట - పరిమాణములో భీమేశ్వరలింగము కన్న చిన్నది.

(3) పెదకొండూరు అనందేశ్వరస్వామి(తెనాలి తాలూకా): సున్నపురాతి లింగము, 'లింగము పైభాగమున ముందు వైపు తక్కువగానుండి వెనుకవైపు ఎత్తుగా నుండును. జటాజూటమును గాని, నాగాభరణమును గాని రాతిలోనే మలచి ఉందురు. లింగము ముందు భాగమున అర్ధ నారీశ్వర రూపము చెక్కబడియున్నది. క్రీ.శ. 4వ శతాబ్ది, ఆనందగోత్రికుల నాటిది.

(4) చిలుమూరు రామలింగేశ్వరుడు (తెనాలి తాలూకా) · ఎఱ్ఱరాతి లింగము. పైన పిడికిలిలాంటి జటాజూటము చూపబడినది.

(5) అమరావతి అమరేశ్వరుడు : సున్నపురాతి పొడవాటి వర్తులాకార లింగము. పైన పిడికిలి పట్టునంతటి లోతైన గుంట, దానినుండి ఇరువైపుల, వెనుకప్రక్కను నీరు క్రిందికి పోవునట్లు సన్నని కాలువలు నిలువుగ లింగము పొడవున ఏర్పరచబడినవి. బహుశ గంగాధరుని శిరమునుండి గంగ క్రిందకు ప్రవహించుటను చూపు విధానమై యుండును.

(6) చేజెర్ల నుండి మరియొక లింగము: సున్నపురాతిది. పై భాగమున రొమ్ములవరకు చెక్కబడిన మానవాకృతి - స్త్రీ పురుష వివరములు గుర్తింపలేనంతగా అరిగిపోయినది. పైనున్నది స్త్రీరూపమే యగుచో గంగాధరుడై శిరమున జటాజూటమున గంగనే కూర్చుండబెట్టుకొని యుండ వచ్చును.

9. మొన్న మొన్నటివరకు 40 సంవత్సరముల క్రిందటి వరకు వరదల కాలంలో గ్రామ మధ్యంలోనికి లాంచీలు నడిచేవిధంగా నీరు వచ్చేది. శ్రీశైలం, నాగార్జునసాగర్ రిజర్వాయరుల కారణంగా నేడు నదిలో నీటి పరిమాణము పరిమితము చేయబడినది.

10. భీమేశ్వరాలయములు : చాళుక్య భీమవరము(సామర్లకోట వద్ద), చేబ్రోలు (గుంటూరువద్ద), మరికొన్ని ప్రదేశము లలో- ఎస్.ఐ.ఐ. వాల్యూం నెం-6. పుట-665.

11. పెదకొండూరులోని అనందేశ్వర లింగము (తెనాలి తాలూకా) ఆనంద గోత్రికుల కాలమున క్రీ.శ. 4వ శతాబ్దంలో కృష్ణ ఒడ్డునవే ప్రతిష్ఠింపబడిన లింగము. సుమారు రెండున్నర మీటర్లు ఎత్తు కలిగినది. నేడు ఒక మీటరు మాత్రమే కనుపించును. ఆలయము పైకి ఎత్తు చేయబడినప్పుడు మిగతా క్రిందిభాగము కప్పివేయబడినది. ఈమధ్య వరకును వరదల కాలములో ఈ లింగము కూడ మూడు వంతులు నీటిలో మునిగియుండెడిది. శ్రీ పుద్చా రామమూర్తిగారు (పెదకొండూరు) యిచ్చిన సమాచారం. వారికి మా కృతజ్ఞతలు - ఈ ఆలయంలో తరువాత ప్రతిష్ఠింపబడిన దేవి విగ్రహము వరద మట్టమునకు పై భాగమున నుండునట్లుగా ఏర్పరచిరి.

12. ఇట్టి పరిస్థితి చాలా ఆలయాలలో జీర్ణోద్ధరణ, పునర్నిర్మాణం చేయునప్పుడు నేడు కూడా జరుగుచున్నది. శ్రీశైలం, భద్రాచలం, వారణాసి, నెల్లూరు మొదలగు చోట్ల.

13. కొమ్ములు, చెవులు ఈ విగ్రహానికి ప్రత్యేకముగా అతికింపబడినవి కావటంచేత లభించలేదు.

14. రెండవ అమ్మరాజు తాడికొండ శాసనము : ఇ. ఐ. 23. పుటలు. 166 తరువాత.

15. ప్రాచీన కాలంలో కొన్ని ప్రాంతములలోని లింగములు ఏ చెట్ల క్రిందనున్నవో ఆ చెట్లపేరున పిలువబడెడివి. బిల్వేశ్వరుడు, కదంబేశ్వరుడు, జంబుకేశ్వరుడు, వటేశ్వరుడు, ఏకామ్రేశ్వరుడు మొదలగునవి. అట్లే అమరవటేశ్వరుడు గూడ.

16. ఇండియన్ ఆర్కియాలజీ-ఎ రివ్యూ 1964-65 ప్లేటు 2వి. పి. వి. పరబ్రహ్మశాస్త్రి : 7. ధరణికోట ఐవరీ సీల్ రిఎక్జామిన్డ్. జె.యి.ఎస్.ఐ. 12-1985 పుటలు 59-62.

17. (1) అమరారామము (శ్రీధాన్యకటకము) గుంటూరు జిల్లా
(2) భీమారామము (దాక్షారామము) తూ॥ గో॥ జిల్లా,
(3) కుమారారామము (చాళుక్య భీమవరము) ప॥గో॥జిల్లా
(4) సోమారామము (గునుపూడి భీమవరము) ప॥గో॥జిల్లా
(5) క్షీరారామము (పాలకొల్లు) ప॥గో॥జిల్లా.

18. శ్రీనాథుని భీమఖండము : చతుర్థాశ్వాసము పద్య 151.

# దివ్వె

జననీ!
నీ సువర్ణ కాంతియుత నేత్రోన్మేషం
ప్రాణప్రదమైన అనురాగామృతం
నీ పుత్రుడనై పునీతుడనై
ఆత్మసాక్షిగా నీ సేవలో తరిస్తాను.

మాతా
నీ శీతల కరుణాకల దృష్టియుత
దీవెనలో చక్కగా నడవగలుగుతున్నాను
నా కంఠక్షేత్రంనిండా రాగాలపంటలు
ఈ నా ప్రాణవీణకు నీవే ప్రాణం

అమ్మా
ఈ హృదయాన్ని తేజశ్చక్రంగా
సౌమ్య ధర్మక్షేత్రంగా
తీర్చింది నీ అనురాగమే
నేనొక బండరాయినైనా
నన్నొక కమనీయ శిల్పంగా చెక్కించి
నాకో హృదయాన్ని పుట్టించి
నాకో ప్రాణాన్ని ప్రసాదించి
కాంతిమంతమైన కావ్యంగా తీర్చింది నీవే!

అమ్మా!
ఈ కలుషిత జగతిలో
ఈ నా చిరుదివ్వెను
ఆరకుండా చూస్తున్నది నీవేనమ్మా!
ఈ దివ్వె పేరు 'మానవత్వం'.

# ఆశ

ఎంత రాగమంతపు హస్తమో
ఈ దీపం ముట్టించింది?
ఎన్ని కన్నీటి బిందువులో
ఈ స్వేచ్ఛాదీపాన్ని సృష్టించింది!
ఎన్ని శకటాల నడకనో
ఈ మార్గాన్ని తీర్చిదిద్దింది!

ఎన్ని పావురాల కాపురాలో
ఈ హృదయసీమల నలరించింది!
ఈ శోభాయమాన బింబం
నా నవోదయాశా విహంగం

ఈ దీపకాంతులనిండా
నా జనని ఆశీస్సులు
నా పుడమి మహితోక్తులు
నా హృదయం ఒక తటాకం
దీన్ని తవ్వింద తల్లి
దీనిలో దయను నింపింది జనని
దీనినిండా శీతలత్వాన్ని
కురిపించింది మాత

ఆ మహాదేవత పాదాలకడ
పరిమళం వెదజల్లే పుష్పంగానో
కాంతినిచ్చే దీపంగానో
బ్రతకడానికి ఎంత ఎదగాలో ఇంకా!

**శ్రీ పాతూరి రఘురామయ్య**

# నీవు మది నిలిచినవేళ

దేనికో ఆత్మ కొట్టుకులాడుతోంది
మనో మైదానంలో తారట్లాడే రూపాల్ని
ఆత్మ దర్పణం ముందుంచాను
ఎన్నో కదిలిపోయాయి
ఒక్క నీవే నిశ్చలంగా నిలిచావు స్వామీ!

దీపకాంతులు లేని మనసు నాది
దేహదాహాలారని వయసు నాది
ముగిసిపోయే క్షణాల్ని మృత్యువుకి తొడిగే తనువు నాది
నైవేద్యానికి నోచని నడమంత్రపు సిరి నాది
ఏ ఆశ చూపి నిను బంధించను?
నీవు వెడలితే నేనెలా జీవించను?

**శ్రీ అనంత వేంకటేశన్**

కన్నడ మూలము : మహాకవి డా॥ కె. వి. పుట్టప్ప

ఆంధ్రీకరణము : శ్రీ శంకరగంటి రంగాచార్యులు

# అంగుళము నకు గళము

( ప ద్య నా ట క ము )

## పాత్రలు

ద్రోణాచార్యుడు — ఏకలవ్యుడు

అశ్వత్థామ — అమ్మ (ఏకలవ్యుని తల్లి)

ఏకలవ్యుని భటులు, ఇత్యాదులు.

## ప్రథమ దృశ్యము

### గురువు

(చుక్కలు క్రిక్కిరిసిన మిన్నే కన్నై, సహస్రనేత్రియైన గగనదేవత భూమివైపు చూచుచున్నది. చీకట్ల దట్టపుతెర కొండ అడవిమీద అలమియున్నను, తూరుపు కడుదూరపు దిగంతరేఖ గుర్తు కనిపించునట్లు నింగి అంచులో వేకువ వెలుగు వికసింప దొడగినది. మెల్లమెల్లగా ఉషఃకాంతి హెచ్చిపకొలది, చీకటి కడలిలో మునిగి అణగికొని యున్నట్లున్న కనుమలు, కొండ అడవులు వరుసలు వరుసలుగా ఇంచుకించుక దృగ్గోచరమగు చున్నవి. ఒకటి రెండుసార్లు క్రూరమృగముల గర్జనలచేత క్షుబ్ధమై, మరల సెలయేటి దూకుడు వినా నిశ్శబ్దపు టబ్ధిగానున్న అరణ్యమున అక్కడొకటి, ఇక్కడొకటి ధ్వనితరంగము పులుగు గొంతుకనుండి పొడమి, తీయని గానమై సంచరించి, విపినదేశపు టనిలశరీరము పులకితమగుచున్నది. అంధకార గర్భాంతరాళమందుండి అప్పట్లు బహుదూరమందు ప్రారంభమై, దగ్గర దగ్గరకు వచ్చుచున్నట్లు గురుస్తుతి ధీరముగా, భక్తిభావ పూర్వకముగా, తరంగ తరంగాయితముగా, దిగంతమునుండి అల్లనల్లన తొణకుచున్న వెలుగుతో పోటీపడునట్లు బుగ్గలు బుగ్గలుగా ఉప్పొంగి వినవచ్చుచున్నది.

ఓం

గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః।
గురురేవ పరబ్రహ్మ, తస్మై శ్రీగురవే నమః॥

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥

అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥

చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః॥

అనేక జన్మసంప్రాప్త కర్మబంధ విదాహినే।
ఆత్మజ్ఞాన ప్రదానేన తస్మై శ్రీగురవే నమః॥

మన్నాథః శ్రీ జగన్నాథో మద్గురుః శ్రీ జగద్గురుః।
మమాత్మా సర్వభూతాత్మా తస్మై శ్రీగురవే నమః॥

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం।

ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

నిత్యం శుద్ధం నిరాకారం నిరాభాసం నిరంజనం।
నిత్యబోధం చిదానందం గురుంబ్రహ్మ నమామ్యహం॥

క్రమేణ, వెలుగు తొణికి, పర్వత విపిన కందరములు సుస్పష్టతరములయిన కొలది, అడవిలోని నిండు నిశ్శబ్దమే మొలచి, శాఖోపశాఖలై, వివిధ విహంగముల బహువిధ మధుర కూజితములచేత నాదమయమగును. ప్రతి వృక్షపు పచ్చదనమును, పుష్పముల తెలుపు పసుపు, ఎరుపు రంగులును కనులకు గోచరించును. రాత్రియొక్క తిమిర గర్భమునుండి ఇవన్నియును ఉదయించినట్లే, అరుణిమ పండబారుచున్న ప్రాచీదిక్తటమున కెదురుగా, సగర్వముగా శిరమున నెత్తికొనియున్న ఒక కొండ కొమ్మున, చెట్టుచేమలు క్రిక్కిరిసినచోట, తెలినురుగు పీవన పీచుచు, గండశిలల మధ్య దుముకుచున్న ఒక జలపాతము ప్రక్కన, దాని చరణస్థాన మున్నట్లున్న ఒక సువిశాల శిలా

ఫలకముమీద ఏకలవ్యుని శరీరము గందరించి విడిచిపెట్టబడినట్లు పొడమి పొడసూపుచున్నది.

తొలుదొలుత మనకగా చుట్టును నిలుచున్న గండశిలలతో తానును ఒక మనుష్యాకారపు గండశిలయై, కనబడును ఉషఃకాంతి అలుముకొని దీప్తికి తిరిగినకొలది, అతని అస్పష్టాకారమునుండి రూప మావిర్భవించును. ఆ స్థూలకాయపు దీర్ఘోన్నతాకృతిది చామన చాయ; కాని, మైపన్నె నలుపు కాదు. నడుమునకు చిఱుతపులి చర్మము అలంకరింపబడియున్నది. నగ్నముగానున్న విశాల వక్షస్థలము విందు దేహమునకు సౌందర్యమునే కాక గౌరవమును కూడ ప్రసాదించుచున్నది. పులిగోళ్ళతో ఐహాంచిన కంఠాభరణము విందు బొమ్మునకు దృష్టి తగులకుండ రక్షగా నున్నది. భుజములకు రెంటికిని రాళ్ళ బొమ్ములున్నవి. శరములు నిండిన అమ్ములపొది భుజముమీద పడిగెత్తియున్నది. దానిని వీపునకు బిగించిన సర్పచర్మపు పట్టిక అడ్డముగా చుట్టుకొనిన వక్షోదేశము, పాము చుట్టుకొన్న ఏట్టవలె భీమకాంతముగా నున్నది. స్వాని మాది చెవిరి. వెంట్రుకలు భుజముమీద పడి అమ్ములపొదికి సంవాదిగా నరిమొక్క ప్రక్కనుండి వెన్నుమైపునకు ప్రవహించినవి. ఉదయ సమయపు పూర్వాకాశమును నిడుపైన తెల్ల మొగిలు రేక వ్యాపించినట్లు నుదుటిపై విభూతిరేఖ భాసించుచున్నది. కనులు నీలోజ్వలములు. ముక్కు పొడుగై చిలుకముక్కువలె వంగినది. నూగు మీసములు మిగుల మోహకములు. పలుచని పెదవులు నాసికాదీర్ఘతకును, నేత్రోజ్వలతకును ప్రతిస్పర్ధులై సంస్కారపు రుచిసూక్ష్మతకు సాక్షిగా నున్నవి. ఎడమచేతి పిడికిలి ఎక్కుపెట్టిన వింటి కొప్పును పట్టుకొన్నది. వింటి మరి యొక కొన రాతి నానుకొన్నది. నారి పదులుగా నున్నది.

అతని వెనుకనే ఒక జలపాతము- ఇరుప్రక్కలను ఎత్తైన బండలు నిటారుగా, ధీరభంగిమతో నల్లగా లేచి నిలబడినవి. చెట్లు, తీగలు అక్కడక్కడ అల్లిబిల్లిగ అల్లుకొన్నవి. ఏకలవ్యుని కుడిప్రక్క చాలదగ్గర అతిస్థూలదృష్టికి మానవాకార మనదగిన ఒక ఎత్తైన బండ కననగును. దానినిండ పూలు, ఆకులు, నెమలి ఈకలు, పక్షుల రంగురంగుల ఈకలు, వరాహముల హిమధవళ దంష్ట్రలు, చిఱుతపులి చిత్రమయ చర్మము మొదలగువానిచేత రచింపబడిన అలంకారములు మెరయుచున్నవి. ఆ దీర్ఘగండశిల అగ్ర భాగమున సుప్రభు దళసరి గీతలతో మనుష్య ముఖరూపము చిత్రితమైనది. ఆ శైల విగ్రహమునకు చాలకాలముగ పూజ జరుగుచున్నదన్న లక్షణములు చుట్టుపట్ల సువ్యక్తములు. అదియే ఏకలవ్యుడు గురువని పూజించుచున్న ద్రోణ ప్రతిమ.)

ఏకలవ్యుడు - (పూర్వోక్త వర్ణనకు వివరవివరములైన, ఉచితములైన వాచికాంగిక వ్యాపారములు అన్వయించునట్లు)

ఇన్ని దినములు బ్రదికినందుకి సుదినమ్ము
కంటి! నేడేతెంచు గురువు నా ఈ వన
స్థలికి! పావనతరమ్మగును ఈ పర్వతా
రణ్య సీమమ్ము వికచమ్ము, పరిపూత గురు
చరణ సరసిజ మృదువరాగ సంస్పర్శతో!

(ఉషఃకాలపు దిగంతము వంకకు తదేకముగా చూచి, ఉన్మేషితోత్సాహముతో)

నిజము గురువరు రాక నేడు నా ఈ వన
స్థలికి! కనువిప్పుము, నిమీలిత ఉషోబాల,
నీ ఆ దిగంత దీర్ఘకటాక్ష విక్షేప
మున సుప్రసన్నత కలుగుగాక ఈ పర్వ
తారణ్య దారుడికి! ఉదయింపుమో మంచి
పగలు కిరణాల దారాల నేసిన వెలుగు
దోవతిని భూషించుచును ఈ మహారణ్య
సుమనోజ్ఞ పర్వతాంగమ్ము!

(కొంతసేపు నీరవముగా దృష్టి ప్రసారము చేయుచు, మరల ఉప్పొంగుచున్న ఉత్సాహముతో)

నిజము నేడరుదెంచు గురుడు నా ఈ వన
స్థలికి! కందరమందు నడయాడు మంచు మ
బ్బును చూడు, గురువు కట్టిన ధవళ వస్త్రంపు
టంచనగ సంచలించుచునున్న దాకాంత
రేకెత్త! అదిగో, ఆలించుమా కోకిలపు
మధుర కూజితము, తెల్లగ క్రిందపడెడు ఈ
సెలయేటి ఓంకారమును మీరి చాటెడిని
ఇంగితమ్మని నాదు గురుదేవు మంగళా
గమనమ్ము! దుముకు ఈ జలపాత ఘోష, శ్రుతి
వలె ఆశ్రయించుకొని తానతానమునందు
గానమొనరించెడిని కనరాని ఒక పక్షి
మధురమ్ముగా, వినుము, ఆహ్వానగీతమ్ము!

(మరల అటునిటు కనులు త్రిప్పి కునుగొని)

వికసించుడో సస్య సుందరగణములార,
విరుల పాన్పగునట్లు గురువు నడచెడు త్రోవ.
వేగుచుక్క పసిండి నీరెండ వెలుగులో
మంచుబిందులతోడ మెరసిపోవుచు నున్న
తీగెలకు తోరణమ్ములు కట్టి, మద్గురూ
త్తమునికి శుభస్వాగతమ్మిందు, తరులార!

(తన వెనుకనున్న జలపాతము దిక్కు చూచి, గ్రుడ్లప్పగించి, భావావేగమున దానికి చేతులు మోడ్చి)

విజయమప్పుడే వచ్చె నేడు నా గురువరుడు
నా ఈ మనఃస్థలికి! గిరిపుత్రి, సుమనోజ్ఞ
మధురజలగాత్రి, దుముకుచు దుముకుచును ముత్య
ములు చల్లి ముదమందు లాస్యమయి, నిర్ఝరిణి,
కొనుము నీ కిదె నా కృతజ్ఞతావందనము!
గిరిశివ జటాజూటమున నుండి జారిపడు
గంగామతల్లి, శైలశివాంకము నలంక
రించెడు అరణ్య పార్వతి చెల్లి, నా చెవికి
నేడిట్టు లేమంత్రమును ఘోష పెట్టెదవు?
శాలగహ్వర గుహ్య గర్భమున చుట్టుచు
ట్టుకొని పడినట్టి ఏ విధిని మ్రోగుచు పిలిచి
మేలుకొలుపుచునుంటి? పుట్టినప్పటినుండి
నీ జోలపాట నా తొట్లనూచిన; దైన
నీ జలగళము నేడు వేరుగానున్నట్లు
హృదయ మస్థిరమౌ విధాన చాటుచునుండె,
అదేల యొకదాని గతజన్మ నిస్వనమో?
భావిజన్మపు పిలుపో? లేక, ఇకముందున్న
బ్రదుకునే మునుముందు తెలుపుటకు సెలయేటి
మరుగులో నినదించునట్టి విధి వాలికయో?
(అంతర్ముఖుడై, నిట్టూర్చి, చింతాముద్రతో)
గతరాత్రి అదియెట్టి కలకాంచితిని నేను!

(కొంచెము సేపు ఆలోచించుచు నిలిచి, చింతాప్రవాహము నడ్డగించి నిలువు ముఖముద్రతో)

దుఃస్వప్నమైనప్పటికిని దివ్యము నిజము!
ఇటువంటి శుభదినమ్మున కెట్టి నాందియో!–
అది అట్టులుండనీ–
శుభము వచ్చెడు విధము నిర్ణయించుటకు మన
మెవ్వరము? దైవమె సమర్థమ్ము!
ఊరకుండుము, మనస, ఊరకుండుము, మనస.

(ఉన్నదున్నట్లే ద్విగుణీకృతోత్సాహముతో)

చూడు, చూడుము, ఏమి సొగసులుదయించెడిని
తెల్లగా క్రిందపడు సెలయేటి నీటిలో!
సూర్యకిరణాళి తన కుంచియను వీచగా
అది యేమి మాయ! అదె కనుమద్భుతమె, నిజము,
ఆ చిత్రమయవర్ణ సుర చాప ఖండములు!

(తన ధనుర్దండమునెత్తి నీళ్ళతో ఆటలాడును. ఎవరో పిలుచు సద్దు నీటిస్రోతతో కూడి వినబడును. దానిని గమనించని ఏకలవ్యుడు నీటితో ఆడుకొనుచుండును. ఆ పిలుపింకను సమీపించి, స్పష్టతరమగును. 'అబ్బీ', 'ఓరబ్బీ' అను ధ్వనికి ఏకలవ్యుడు తటాలున నిలబడి చెవియొగ్గును)

ఎవరో పిలిచెదరు కద? ఈ నిర్ఝరిణి గర్జ
వ్యాఘ్రగర్జన కూడ మ్రింగి జీర్ణించుకొను!
(మరల 'అబ్బీ! ఓరబ్బీ!' వినవచ్చును)
ఓహోహో, అమ్మయే ఉండవలె! (నవ్వుచు)
జలపాతమును మించుటకు పోటీపడు కదా!
వెదుకులాడుచు వచ్చె నుదయంపు భోజనము
నాకీయః రాత్రి చీకటి నశింపక మునుపె
చాల తెలవారుజామునని అమ్మకు చెప్ప
కుండ వచ్చితినిటకు, గురువు రాకను గూర్చి
నట్టి ఉత్సాహ ప్రవాహమందున తేలి
వినయమ్మునను, విధేయతను పూర్తిగా మరచి!

(మరల పిలుపు వినిపించును. ఏకలవ్యుడు గట్టిగా ప్రతికేక వేయుచు, చెట్ల పచ్చదనము నిండి పైకెగయుచున్న కొండవాలు ప్రక్కకు, పిలుపు వినవచ్చిన దిక్కుకు, తనచూపు సారించును. ముఖమున నవ్వు వికసించును – తల్లిని తిలకించిన ఉల్లాసమునకు)

అదె, అచట వచ్చుచున్నది, అమ్మ!
ఎక్కనేరక గండశిల నెక్కుచుండె! ఈ
రాలు రప్పల ఇరుకు సందుగొందులయందు
దారి తప్పునొ ఏమొ!

(చప్పట్లు తట్టి "అమ్మా!" అని కేకవేసి తల్లి గమనమును తానుండుచోటికి లాగును. తానుండు జలపాతపు దిశకు వచ్చుటకు దారి చూపుటకొరకు చేతితో సైగ చేయును)

ఈ ప్రక్కకీప్రక్కకమ్మ,
ఆ తగ్గులోనున్న చెట్టుప్రక్కన రమ్మ!

(అట్లే చూచుచుండి, తల్లి సరియైన మార్గమును పట్టి, తనవరు గగుటను కని, కన్నుకొట్టి, వినోద మొనరించవలెనని నవ్వి)

ఇందాక, ఒక్కపరియైన, ఎన్నోసార్లు
రమ్మంచు వేధించినను కూడ, అమ్మ
ఇచ్చటికి రాలేదు. నేడద్భుతము నొకటి
చేతును. వినోదమ్ము వర్ధించి నవ్వింతు!

(జలపాతపు వెనుక ప్రక్క నీటిధార వెనుక మునిగిపోయినవన్నట్లు మరుగగును. ఏకలవ్యుని తల్లి అరటాకున తిండివిడుకొని, ఆయాసపడుచు ప్రవేశించి, ఏకలవ్యుడు విలుచుండిన విశాలపు బండ వద్దకు వచ్చును. ఆమెకు మధ్యవయస్సు పైబడినది. కొండజాతివారి కట్టుబొట్టు ఉన్నవి. రైక లేదు. నొసటికి విభూతి. చుట్టును చూచి, ఎవరిని కూడ కానక వెరగందును)

అమ్మ - అబ్బీ! ఓరబ్బీ! (చుట్టును వెదకి చూచి)
ఇప్పుడిక్కడ ఉండె, నప్పుడే ఎటకేగె?
కూటిప్రొద్దుకు తిండివిడకాచి చాలయ్యె!
అన్న తరువాతైన పోరాద కానకు?
కానేమి మంచ? ఎండెక్క నశియించుటకు?
నిత్యమ్ము నీవికిది ఒక్కటే వ్యసనమ్మ!
కాననము! కాననము! కాననము!
పగలు రేయిను కూడ కాననము! కాననము!
కలలలో పైతమ్ము కాననము! కాననము!

(హఠాత్తుగా ఏకలవ్యుడు పూజించిన ద్రోణ ప్రతిమను చూచి, ఆశ్చర్యమున తదేకముగా కనులప్పగించి వీక్షించును. ఆశ్చర్యము వినోదముగా పరిణమించి, ముసిముసి నవ్వు నవ్వుచు తలాడించును)

ఇదియేమి బొమ్మలాటయొ వాదు పిల్లనికి!
ఈ అడవిలోన ఎచ్చోట కన నచ్చోట
నీవి ఈ బొమ్మలే! (ఒక విధపు నిర్వేదముతో)
హూ! పసివాదు కద, ఆడుకొననిమ్ము!
ముందు వెనుకల లేు; తొన్ను కట్నము లేదు;
ఒక్కడే ఒకడు కద? వేసరిక చను టెట్లు?
జంతువులు, విహగములు, వృక్షమ్ములును, శిలలు,
దినకరుడు, హిమకరుడు, ఉదయా స్తమానములు,
నదులు, - (జలపాతమును చూచుచు)
మరి యిట్టి ఎత్తిపోతల నీటి సెలయేళ్ళు?
ఇవియె కద తోబుట్టువులు, తోడునీడలును!

(జలపాతము వెనుకనుండి ఏకలవ్యుడు 'అమ్మా!' అని కేకవేసి పిలుచును. అమ్మ అదరిపడి చుట్టును చూచి)

ఇదియేమి అబ్బిగాదో, లేక సెలయేటి
భూతమో? ఎవరు పిలిచినది నను!

(తల్లి దిగ్భ్రాంతి చెందుచుండుట కని, జలపాతపు నీళ్ళ తెర వెనుకనుండి హా హ్హా హ్హా అనుచు చప్పట్లు చరచి, నవ్వుచు తల్లివద్దకు ఎగిరి దరుగిడి వచ్చును)

అమ్మ - (అదరిపడి తెచ్చికోలు కోపముతో)
ఛీ! నీకిదేమిటి వినోదమ్ము నాతోద
నబ్బి? మీసాల్ వచ్చినను విన్న పిల్లాట
వదలదు.

ఏకలవ్యుడు - (ముసిముసి నవ్వు నవ్వుచు)
ఓ అమ్మ, నీవు నా యెదురుగా నున్నచో
గర్దమ్ము నరపినను, నేను పసివాడనే!
ఏమి భయమో నీకు? దయ్యమని తలచితివ?

అమ్మ - (వెరగుపడి, ఒకింతయును తడిసిపోని కుమారుని చూచుచు)
నీళ్ళలో అదియెట్టులుంటివిర?
మునిగియును తనువు నానె లేదు!

ఏకలవ్యుడు - (వినోదముగా) మంత్రశక్తిది అమ్మ, ఇదిస్తంభన మంత్రమము!

అమ్మ - మొన్న ఆ మడుగులో అడుగు జారరలిపడి
తడిముద్దగా మారి, వడకుచును వచ్చితివి!

ఏకలవ్యుడు - (హాస్య ముఖముద్రతో)
విన్న లభియించినది ఈ సిద్ధి, ఓ అమ్మ.

(తల్లి వెరగుపడుచుండగా ఏకలవ్యుడు జలపాతమువైపు చేయి చూపి)

నీకేమి తికమకయొ, అమ్మ.
నేనేమి చెప్పినను నమ్మ అబ్బురపడెదు.
ఒక్కింత హాస్యమ్ము కూడ అర్థము కాదు!

అమ్మ - (దుఃఖముతో) కడచిపోయెను బాబు ఆ మంచి కాలమ్ము.
మీ అయ్య ఉసురు విడిచిననాడె నా సర్వ
సంతోషములు అతని వెన్నంటి వెళ్ళినవి!
మరల సంతోషపడుటెట్లు?-
ఇక నమ్మకము మాట?
నిన్ను, నీ మాటలను నేను నమ్మనినాడు
దిక్కులేనిదటంచు తెలియుమో నా అబ్బి.

ఏకలవ్యుడు - (తనకన్నను పొట్టిగా, బక్కచిక్కినదిగా ఉన్న తల్లిని ప్రేమతో కౌగిలించికొని)

అదలకుము, తల్లి!
నా వినోదము విషాదము నెదకు తెప్పించె
నీకు. అపరాధమ్ము కావించితివి, తల్లి.
కమమమ్మ, ఆ నీటిధార వెనకాలనే,

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెం

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు
ప్రవేశించలేవు కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా
చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంటు మాత్రము లోపలకు
ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని
పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది.
అమృతాంజన్-డెర్మల్ అయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు
ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

**అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004**

**Amrutanjan Limited** 

నీకు కోసిన ఒక్క రాతిగవి ఉన్నదదె.
నీవు సైతమ్మచట నానకనె ఉండనగు.
మండుటెండల వేసవుల ఎన్నియొ పగళ్ళ
నేనటకు వెళ్ళి, హిమగుహా శైత్యమును అనుభ
వించితిని. సీరాన ఏతెంచు కానన మృ
గమ్ములను చాటుగా కపగ సొగసగుచోటు!

అమ్మ - (తాను తెచ్చిన అరటాకును బండమీద పెట్టుచు)
అవియేటి మృగములో? అవియేటి ఖగములో?
అవియేటి కొండలో? అవియేటి కోనలో?
ఆకలిని, దప్పికను మరచునట్టులు చేయు
ఆ ప్రకృతులే నిజమ్ముగ సుకృతులు!
నను కూడ మరపించుననుటె నాదు భయమ్ము!

ఏకలవ్యుడు - (మాతృ ప్రేమాతిశయమున)
అమ్మ, అమ్మా, నీవు ఎత్తిపొడువకుమమ్మ!
నాదు బ్రదుకంతయును నీవె నిండితివి కద;
నీవు నా హృదినింద బ్రదుకు నిండుమ నాకు,
లేకున్న ఈ బ్రదుకు దారిలేని యెడారి!
నీ ప్రేమ బ్రదుకు వెలుగుగమంద-
ఈ ఖగము, లీమృగము, లీకొండ, లీకోన,
లీ అడవి, ఈ పుడమి - సకలములు మధురములు.
నీవు లేని దినాన అవియెల్ల తిమిరాంధ
కూపములు!

అమ్మ - (గారాబముగా మొగము చూచి)
మరి నీ పదెండులకు తెలవారుటకు మునుపె
నాకు చెప్పకనే ఈనాడు వచ్చితి వనికి?
ఉదయాన తిను చద్ది, తేనె, పండ్లును అరటి
ఆకు నిండుగ పెట్టి, పిలిచి చారైపోయె!
రా! తీసికో, కూరుచుండి తిను, తృప్తిగా.
ఇదె తేనె తీసికో, ఇవె పండ్లు తీసికో.
(అరటాకును సిద్ధము చేయును)

ఏకలవ్యుడు - (మొగము వికసించగా, సిద్ధపరుపబడిన ఆహార పదార్థముల దిక్కు కనుగొని)
అమ్మ, నీ ప్రేమయే రూపుగొన్నట్లున్న
దీ తేనె!
పండబారిన తల్లితనపు ప్రతిబింబమురె
నిక్కమ్ము రసము నిండినయట్టి ఈ పండ్లు!

అమ్మ - ఉండనీ లెమ్ము. చాలించుమీ వర్ణనము.
రా, తినుము. కడుపు నిండున, మనసు తృప్తిగన్?

ఏకలవ్యుడు - నేడొక్క నోము నోచెద నేము;
నోము నోచిన పిదప, అమ్మ, కుడిచెద కూడు.

అమ్మ - నోములవి పాఋలకు. నోములెవి బోయలకు?

ఏకలవ్యుడు - బోయలైన అదేమి? పాఋలైన అదేమి?
నోములకు ఎవరైననేమి?

అమ్మ - (మొలక నగవుతో) ఏదియో ఆ కోర్కి?
అంవాల ఆదదా?

ఏకలవ్యుడు - నాకేల ఆ చింత? ప్రీ గోడు నీకు గద?

అమ్మ - ఎరి యేమి? కుంచి పేట లభించవలెనంచ?

ఏకలవ్యుడు - ఆ తప్పుటడుగు వేయుటను నేనేనాడో
అధిగమించితిని. గురుకృపవల్ల అవిద్య
కరతలామలకమ్ము. వ్యాఘ్రమెమో? సింహమో?
సర్పమో? దంతియో? దగ్గరో? దూరమో?
కనిపించనీ, లేక కనిపించకుండనీ,
కనుచూపు మేరలో ఉండనీ, లేకుండనీ,
వింట నారి బిగించి, బాణమ్ము సంధించి,
గురుదేవు స్మరియించి, విడిచిపెట్టితినన్న
తప్పదని తెలియవలె నేను పెట్టిన గురి!
మొన్న నీకేను చెప్పితిని కద, వడచినది
ఒక్క కథ.

అమ్మ - అది యేమి కథ? నీవు నాకు ఎన్నెన్నిటినో
చెప్పుచుందువు కథలు.

ఏకలవ్యుడు - కట్టుకథ కాదిది. నిజముగా జరిగినది.
చెప్పలేదా నీకు?
నాకు పర్జునివికిని నడుమ జరిగిన రగడ.

అమ్మ - ఏమి రగడ? ఎవరతడు? ఎందుకోసము జరిగె?

ఏకలవ్యుడు - బలుసొగసు. దాని నీకప్పుడే చెప్పితిన
టంచు నే నెంచితిని. రా, ఇటకు, ఈ పెద్ద
బండపై నెమ్మదిగ కూర్చుండి వినుమమ్మ.

(ప్రక్కనఉన్న బండపై తల్లిని కూర్చుండబెట్టి, తాను ఎదురుగా నిలుచుండి, ఉత్సాహముతో చెప్పును)

బలుసొగసు, ఆ గాథ, అమ్మ, బలుసొగసు.

అమ్మ - కని నీదు ఉత్సాహమును ఈ జలపాతమ్ము
సిగ్గుతో తెల్లబోవుచు నుండె
చెప్పు మరీ, చెప్పు!
నీ గొంతు వినుటయే నాకు పండుగ అన్న
ఆ గొంతుకొక మంచి కథయుండ చెవితేనె!

ఏకలవ్యుడు - బలుపొగసు! అమ్మా, విను బలుపొగసు! ఆ కథను
ఆ కథకు నాయకుడు నేనె; కవియును నేనె!
మతికున్నదా నీకు?
ఆనాటి ఉదయమ్ము,
పుట్టమన్నట్టి ఆ జాంటితేనియ తుట్టె
పీకి తేనెను నీకు తెచ్చి ఇచ్చితిని కద-
ఆనాటి ఉదయమ్ము-

(తలయెత్తి దూరముగా చూచి, ఆ దిక్కుకు వ్రేలుపెట్టి చూపుచు)
కనుమచట, నిట్టనిలువుగ పైకి లేచి, మెర
యుచునుండె నా దీర్ఘ గండశిల, ఆ కొండ
కొమ్మనకు పోయితిని.
అడవి మధ్యమున గూడును కట్టుకొని గ్రుడ్లు
పెట్టిన ఒకానొక మయూరమ్ము గలచోటు
చూతు నను ఆతురతతో పరుగులిడిపోతి.
కాళ్ళ కెరకలు మొలచినవా, అన్న రీతిగా!
పోయి చూచితి; నేమి చూచితిని?
గ్రుడ్లు తినవలెనంచు అరుగుదెంచిన యట్టి
పాముతో ఘోరముగ పోరాడుచున్నట్టి
ఆ నెమలి చూచితిని.
బాణమ్ము సంధించి, పామునచటనె చంపి,
నెమలి తల్లిని తృప్తిపరచి, రక్షణనిచ్చి,
గ్రుడ్లపై దాని పొదిగెడినట్లుగా చేసి,
వేడ్కకై ఒక్క పెనువృక్షంపు శిరమెక్కి,
కనుచూపుమేర గల దృశ్యపైశాల్యమ్ము
కను ప్రకృతి భోగమున మునిగియుంటిని నేను.
ఇట్లుండ,
దూరమ్మునుండి వినవచ్చె వేటాడు జన
సంరంభ; మాలకించుచునుండ దగ్గరకు
వచ్చినది అతుముల రావమ్ము.
మండినది కోపమ్ము నాకు-
నా రక్షలోనున్న ఈ పర్వతారణ్య
సీమమ్ము ముట్టడించినవారి పొగరణచి,
తరిమికొట్టెదనంచు రోషమున నిర్ణయము
కొని, తరువునుండి దిగి,
వి టికొప్పుకు నారి జంటి చుచుండగ, హం
టాహాటిని చెవినిబడి పొడిచినట్ల ఒక ఏక
లంపు హుంకారంపు టార్పటము'
కొండ ఉరిమినదంత; అడవి వణకినదంత!
వెంటనే బాణమ్ము నల్లెత్రాటికి పూన్చి,
హుం కృతిని అరించి, గురిపెట్టి, కొట్టితిని!

అమ్మ - (కుమారుని రక్షించుటకు కౌగిలించుచున్నట్లభినయించి)
అయ్యో, నీవున్నెదకు వచ్చెనట ఆ ఏకలమ్ము?

ఏకలవ్యుడు - లేదు లేదది కన్నుచూపుమేరను దాటి
యుండినది, దూరమున పెనుకాన పొట్టలో.

అమ్మ - మరి నీవదెట్లు గురిపెట్టి కొట్టితి, దాని?

ఏకలవ్యుడు - శబ్దవేదియటన్న విద్యతోనమ్మ!

అమ్మ - అట్లన్న?

ఏకలవ్యుడు - గురి కన్నులకు కానబడకపోయిన దూర
వేసిన శరమ్ము తాకును గురి నమోఘమ్ము.
అది ఒక అతీంద్రియపు సామర్థ్యమమ్మ.

అమ్మ - (వెరగంది, కుమారుని మెచ్చి, చూచి)
నీవెట్లు కలచితివిరా అట్టి అటువంటి
అద్భుతమ్మగు విద్య?

ఏకలవ్యుడు - గురుకృపా మహిమచే.

అమ్మ - ఎవ్వరా గురువు?

ఏకలవ్యుడు - (ద్రోణప్రతిమ యనదగు ఆ శిలాకారమును చూపి)
ఆ పూజ్యుండు!

అమ్మ - రాతిబొమ్మ అదెట్లు నేర్పు నీకును విద్య?
అది యేమి దేవుడా?

ఏకలవ్యుడు - దేవుడే నిక్కమ్ము!

అమ్మ - ఏ దేవుడో? మనకు ఉన్న దేవుండొకడె.
వేటదేవుడు వాడు. నీవాడుకొను బొమ్మ
మన వేటదేవుడా?

ఏకలవ్యుడు - కాదు, కాదమ్మ గురుదేవుండు.

అమ్మ - అతడెవరు క్రొత్తదేవుండు? ఎప్పుడు పుట్టె?
వేటదేవుని బిడ్డడో?

ఏకలవ్యుడు - (నవ్వుచు)
బిడ్డలను కననతడు నీవు పెంచిన కోడియా?

అమ్మ - ఉన్న ఒక దేవుండు బిడ్డలను కనకున్న
అరుదెంచునెట్లు? మరి, సరిక్రొత్త ఏవుండు?

ఏకలవ్యుడు - అడవిలోనున్న ఈ వేటదేవుడె దేవు,
ఇంక దేవుళ్ళు లేరని తలంచితివేమి?
ఎందరో దేవుళ్ళు కలరు ఆ దేశాన.

అమ్మ - వారిలో ఒక్కడో ఈ రాతి విగ్రహము?

ఏకలవ్యుడు - అటువంటి దేవుండు కాడు. ఈతడు గురువు.
తినును. ఊపిరి పీల్చు. మనవలెనే జీవించు.
హస్తినాపురి రాజధానిలో నితడుండు.
రాకుమారుల కితడె వ్యాయామ దేశికుడు
దావ గురుపీఠండు. బ్రాహ్మణుల బ్రాహ్మణుడు.
ద్విజవరేణ్యుండు, గణ్యుండ, గ్రగణ్యుండు.
ద్రోణుడన్నది అతని పరిపూత నామమ్ము.
పరమ గురుదేవుండు నా; కతని కృపవలన
నాకు విలువిద్య లభియించెను అనన్యముగ
నీవు కనునట్టి ఈ విగ్రహము-ద్రోణుడే.

అమ్మ - అక్కటా, నేనెట్టి తెలివిమాలినదాన!
నీదు బాలక్రీడకై చేసినట్టి ఒక
రాబొమ్మ అనుకొంటి! తప్పయ్యె, తప్పయ్యె!

(విగ్రహమును [illegible] మొక్కును)

ఏకలవ్యుడు - అమ్మ, నీ వెఱుగవా గురు మహామహిమమ్ము.
జ్ఞానప్రదుడు, ప్రేమమూర్తి, శాంతిజ్యోతి.
అతని [illegible] సముదర్శియని
యశము. ధనుర్విద్య కధిదేవుడని యంద్రు.
నాడు, నా యయ్య ప్రకటించినాడు, అతని
ఇంటి ద్రోణుని మహిమ; లతని సామర్థ్యమ్ము
నేను ఆగక [illegible] సన్నిధికేగి విలువిద్య
నేర్చికొని వచ్చెదనటంచు వేడితినమ్మ.
అయ్య అనె - వారు బ్రాహ్మణులు బోయకు విద్య
చెప్పుటకు ఒప్పుకోరు అదికాక, నను చూచి
వక్కుమని నవ్వి, అక్కడనుండి నెట్టెదరు."
నేనంటి - "నీ కాళ్ళు పట్టుకొని వేడెదను
ననువంపుమయ్య. ఎటులైన గురువు మనస్సు
మెప్పించి, విలువిద్య నేర్చుకొని వచ్చెదను."
అయ్య నా వాంఛాగ్ని కని, కనికరించి, చని
రమ్మంచు అంగీకరించి, దీవించె నను.
నేను పోయితిని.
రాజనగరమునందు అడవి మనిషికి నాకు
చాల తికమక పట్టె. నా యదృష్టమె నిజము:
గురుదేవపుత్రుండు, నాకు వయసున సముడు,
నన్ను కని, మైత్రి ఉప్పొంగి, తన పితరునికి
నా విషయమును చెప్పె. అతని దర్శన భాగ్య
మును కలుగునటు చేసె. అమ్మ! అది ఎటువంటి
అనమాన దివ్యతేజమ్ము ఆచార్యునిది!
ధగధగని మెరయు ఆయుధశాల చొచ్చినటు
లయ్యె నా కాతనిని తిలకించి!
బిడియాన బెదరుచుండిన నన్ను ప్రీతిగా
పలుకరించెను. తడబడుచు చెప్పితి నేను
నాదు హృదయములోని తీవ్రమగు కోరికను.
నేను శూద్రుడనన్న సంగతిని ఎఱిగినను-
మనల బ్రాహ్మణులు శూద్రులటంచు పిలిచెదరు-
పూజ్యుండు నను తిరస్కరించలేదమ్మ.
ఆపాదమస్తకము నను పరీక్షించి కని
కొడుకు వంకకు చూచి, నుడివె నీ విధముగా:
"నా శిష్యులందు, అశ్వత్థామ, నీవును ఒ
కండు, నీ తమ్ము [illegible] విధాన ననుమీవు"
అని దాని, [illegible] మెలచి [illegible] కొమ్మ స్వర్గంపు
[illegible] స్పర్ధించి,
పొడిచినవె కద! - అయిన నేమాయె?-
[illegible] అడ్డగించె నన్ను
పాండవుల ఒక్కడు, గర్విష్ఠి అర్జునుడు
[illegible] హించె.
[illegible] ఆచార్యు మాట
ఉచితము కాదనుచు [illegible] బిగిసికొనె,
[illegible] ప్రత్యుంచె
ఆచార్యుడు [illegible] వచించె: "శూద్రుండయిననేమి?
వినయశీలుడు, నమ్ము, దతడు కలిచిన పిదప,
మీ సాయమెనచ్చు, మీ సేవలే చేయు.
బల్లిదులు సేవల నొనర్ప మీర్ బల్లిదులు
కార." గురువరుని ఉపదేశమ్ము ప్రక్కకు
నెట్టిరి. నను వెలివేసిరి

కమల బాష్పములు దుల ననుగాంచి కరుణాబ్ధి
గురుడు నా చేయి పట్టుకొని, తల నిమిరి, ఓదార్చి,
ఇట్లనెను, "ఏకలవ్యా" అతడు పెట్టినదె
ఈ పేరు. అబ్బియన నగుదురని పేరొక్క-
పేరుంచె
గురువు నుడివెను, "ఏకలవ్య, దుఃఖించకుము.
ఆశలు నిరాశలై నవని చింతిల్లకుము.
నీవు మా యింటిలో ఒకడవై ఉండుము.
ఈ సాము గరిడికి నన్ను సేవింపగా
ఏతెంచి, దూరమ్ము నుండియే నేర్చుకో-
పీలైనయంత-
మిగిలినది మా యింట నేను సంపూర్ణముగ
నేర్పింతు నీకు అశ్వత్థామతో పాటు."
విని నాకు ధైర్యమ్ము మొలకెత్తినది; కృత
జ్ఞత తోడ పాదములు పట్టుకొని మ్రొక్కితిని.
ఆశీర్వదించె గురువరుడు - నేర్పెను నాకు
విలువిద్యతో పాటు సంస్కృతాక్షర విద్య.
నిత్యమును నేను గానము సేయు ఆ కావ్య
ములను నీవాలకించుచునుందువు కదమ్మ,
అవి సంస్కృతంపు కావ్యమ్ములే. నా విద్య
పూర్తియగు నంతలోనే నాదు పితృదేవు
డొక్క పులితో పోరి, గాయపడి ట్టి వా
ర్తను తెచ్చె నీవు పంపిన బంటు. చాప గురు
నానతిని, దీపనల పరపి, వేగమె తిరిగి
వత్తునని చెప్పి, [illegible]గరిడి విచ్చితిని నీదు
సన్నిధికి-
అక్కటా, మరణించె నాయ్య ప్రణబాధకో!-
నిన్నొక్కతెనె వీడి నేనెట్లు పోగలను?

(అమ్మ కన్నీళ్ళు తుడుచుకొనును. ఏకలవ్యుడును ముక్కు తుడుచుకొనును)

ఇచ్చటనె నిల్చితిని.
ఈ గురుప్రతిమనే ద్రోణునిగ భావించి,
నేను కొనసాగించితిని నాదు విలువిద్య-
అమ్మ, ఆశ్చర్యమ్ము నేమంచు వర్ణింతు!
మేలుకొన్నపుడు నేనెరుగనట్టి రహస్య
ముల కలల వచ్చి బోధించె నా దివ్యగురు
సత్తముడు! ఎంతెంతలు విద్యలును నాకు
కైవసమ్మైనయవి! శబ్దవేధియు కూడ
ఆ విద్యలందొకటి.

అమ్మ - (మెచ్చుకొని) తెలిసినది. ఇపుడు తెలి
సినదయ్యా. ఆ వరాహము పడెన?

ఏకలవ్యుడు - ఔనమ్మ
పడి పొరలినది నేల వినుమమ్మ, వినుమమ్మ
తరువాత జరిగిన విచిత్రపు టుదంతమ్ము,
పడి అరచుచున్న ఆ పంది యుండిన దిశకు
వేగముగ పరుగులిడితిని నేను అడవిలో-
వీక్షించితిని; కంటినొక్క అత్యద్భుతపు
దృశ్యమ్ము
ఒక్కండు తరుణుండు, ఆజానుబాహుండు,
రాజకుల సంజాతు, డత్యంత తేజస్వి,
పడిన ఆ పెను వరాహము వద్ద,
ఆ మృగ కవోష్ణ రక్తముతోడ తడిసి పో
యిన నేలమీద నిలబడి,
పొరలాడు పందదొక్కను నాటినట్టి ఆ
నా విడిచినట్టి నారాచమును అట్టులే
గ్రుడ్లప్పగించి చూచుచునుండె!
నేను దగ్గరికేగ, శబ్దమ్ము నాలించి,
తలను పైకెత్తి నను నిలువెల్ల పరికించె.
ఒక మొలక నవ్వుటల ముఖములో తరగెత్తి
వెలుగొంద ప్రశ్నించె: "ఓరోరి, వనచరా!
ఎవరిచే పడెరా. ఈ వరాహమ్మును?
చెప్పితిని, "ఓ [illegible], చదివి తెలిసికో
చెలగించు నా శరముమీద గల అక్షరాల్!"
[illegible]బెట్టబడిన దాతనికి,
నా ముఖమ్ము [illegible] చూపులను నాటికనె;
నేను నాతని కట్టులే చూచితిని.
[illegible]

అమ్మ - ఎవరతడు?

ఏకలవ్యుడు - మును నే చెప్పెదా [illegible]ర్జునుడు
పాండుపుత్రుడు.
ద్రోణ గురువునకు కడు ప్రియుడైన శిష్యుండు;
నే ద్రోణ వారసుని గని సహాధ్యాయిగా
నుంచుకొన నొప్పక అసూయతోడ తిరస్క
రించినట్టి అల్పుడు!

అమ్మ - (చెలరేగిన కుతూహలముతో) తరువాత నేమయ్యె?

ఏకలవ్యుడు - తెచ్చికొన్నట్టి నవ్వును నవ్వి అతడు నను
మరల ప్రశ్నించె - "ఎవడుర నీవు?" చెప్పితిని.
"నీవె సంబోధించినట్లొక్క వనచరుడ"
ఇంచుక కినుక చూపి ఇట్లనెను
"నాల్క సాయము వలయునా? నీదు వాలకమె
చెప్పకయె చెప్పునుర నీదు కైరాత్యమ్ము!
నేనడిగినది నీదు నామమ్ము
నీకు పేరే లేదా? నీవనామకుడవా?"
ప్రతి వచించితి నిట్లు: "వనచరుల అవసూయ
కను పట్టుగొన్నలు తెలుగరు వారు పేరు మెర
యించుకొను ఆ అహంకారమ్ము.
పేరు కూర్చిన ఆశ అనాగరులకే
ఆ కితమ్ముయిట్టి పౌనసరి రోగమ్ము!
మొదట చెప్పుము నీవు నీ గొప్ప నామమ్ము"
"అడవి మనిషికదెంత గర్వమ్ము!" అనుకొనెను;
తిరిగి ఇట్లనివాడు: "మేమెవరమనుకొంటి?
ఏలువారలము! నీ వేలబడువాడవు!"
ప్రతివచనమిచ్చితిని పొగరునకు పొగరొడ్డి;
"మా అయ్యనుండి వచ్చిన అడవి ఈ పుడమి,
మా అయ్య తరువాత నే దీని కొడయండ.
నా అనతిని కొనక నా అడవిలో చొచ్చి,
నేను రక్షించు మృగముల వేటలాడు నీ
వొక దొంగ, వొక దుండగీడు, వొక దండ
నార్హుడవు!
నీ యూరిప్రక్కకుందును గాక నీదు పరి
పాలనాప్రాప్త దురహంకార దౌష్ట్యమ్ము.
నేను కొట్టిన ఈ వరాహమ్ము వదలుకొని
క్షేమముగ తొలగిచనుమీ నా అడవినుండి!"
కిలకిల నగె నతండు, నేను పలికిన మాట
చాల తేలికగాగ తీసికొని-
ప్రశ్నించె: "నీవు కొట్టినదెట్లురా, బోయ?
నేనిచటి కరుగుదెంచిన యప్పుడీ నీవు
నా చూపుమేరలో కానబడవే లేదు.
ఝంకార మాలించి గురిపెట్టి కొట్టితివ?"
నను గురి చేయుటకు ఆ ప్రశ్న నతడడిగె.
నేనంటినిట్లు "నిక్కము చెప్పితివి నీవు!
నీకెట్లు తెలిసెనుర, ఆ నాదు విలునేర్పు?
నవ్వి పలికెను: "అబ్బ, నీవు విలు నేర్పరివి?
శబ్దవేధీ విద్య నీకు కరగతము గద?"
ఉత్తరమొసంగితిని "సత్యవచనుడవీవు!
కరతలామలకమ్ము నిజమున నావిద్య!"
అగ్గిఅగ్గయి చెప్పె: "కల్లలాడకుర ఓ
కానన చరా! జగత్త్రయమునందొక్కడే
ఒక్కండు కలడు ఆ విద్య నెరిగినవాడు."
నేనంటి "నాకు తెలియదుర ఆ సర్వజ్ఞ
తా అహంకారమ్ము. కాని నీ వచనమ్ము
సత్యమై యున్నచో, నీ యెదుట నిలుచుండె
నీవు గర్హించు ఆ జగదేక ధన్వి!"
కనలి అరచెను ఇట్లు. నీవతడు కామురా.
[illegible] నేనత్తిపోవుచును ఇట్లంటి
"ఎట్లు తెలియునుర నీకు? ఈవు సర్వజ్ఞుడవ?"
ఎంతయో కష్టమున ఇట్లనెను:
"ఎట్లన్న ...ఎట్లన్న . ఎట్లన్న ....ఆలించు....
నేనెరా ఆ ధన్వి! విని యెరుంగవు నీవు-
త్రైలోక్య వీరవరు, అర్జున నామధేయు!"
నవ్వి, వెరగు నటించి, ఇట్లంటి: "వాడెవడు?"
వాడనెను: "అజ్ఞాతుడవు నీవు, వనచరుడవు.
నీకెట్టులుండు నా జ్ఞానమ్ము, విని యెరుగు:
"అర్జునుండుర; పాండు పుత్రుండు"
నేనంటి: "ఎవడురా వాడు, ఆ పాండుండు?"
ధిక్కరించి వచించె: "రాజేంద్ర చంద్రుండు!"
నేనును తిరస్కరించిట్లంటి: "అల్పఖ్యాతి
గన్నవారి గురించి చెప్ప లాభమ్మేమి?
నీకు చెందినవారు ప్రఖ్యాతు లొక్కరును
లేరేమి?
నీ పేరు చెప్పెదవు;
నీకు తనువునొసంగి నట్టివారల పేరు
చెప్పెదవు; నీకు లేరా ఆత్మదానమ్ము
చేసినట్టి పవిత్ర తపమూర్తులు?
విద్య గరపినవారు?
ఓరి, గర్జున వినుము.
నీకొక్క నయపద్ధతిని నేర్పు నీ ఆటవికుడు.
తన పేరు తప్పుగా పలికినందుల కహం
కారమ్ము వహియించి గర్జించి ఇట్లనియె:

"గిర్జునుండందు కాదుర! అర్జునుండంచు
చెప్పర, అనాగరక!"
"ఔనౌను! అర్జునుడ, ఆలించు" అంటినే.
"నాకు పైతమ్మున్నదిర నీకు ఉన్నట్లె
ఒక పేరు. కాని అది నా అహంకారమ్ము
మెరయించుటకు కాదు; వినయము నివేదింప
మన్నయది." అనుచు వెంటనే పందిలో దూరి
యున్న బాణమ్ము పెరికితిని; నెత్తురు గీకి
తలిరాకులకు పూసితిని; ఇచ్చితిని దాని
అతని చేతికి. చేకొనగ నిష్టపడకుండ
బిఱ్ఱబిగిసినవాని కిట్లంటి - "చదువుమిది
ఓయన్న; చదువుటయె పూజనమ్మగు నీకు;
పుణ్యమ్ము మోపికొని వచ్చు నా నామమ్ము!
నీకు వలవని ఆటవికుని, బోయని, నన్ను,
నీ తమ్ముకుఱ్ఱగా నొనరించు! చదువన్న"
వాడు వినయంపు దాక్షిణ్యమ్మునకు లొంగి,
బాణమును చేతగొని, కనులముందర పట్టి,
చూడదొడగెను. ఇట్టులుండ, కను వికసించె,
ముఖములో నొక వెరగు మొలకెత్తె, అంతలో
ఒక కొంటెత నగగ విక్కించె, ఆ మధ్యలో!
తలయెత్తకయె అడిగె:
"ఇదియేన నీదు ఆ నామమ్ము!"
"చదువుమన్నా, ఏమి కలదచట?" అని అంటి,
నవ్వుచును నేను.
"ఇది నాకు పైతమ్ము నామమ్ము కావచ్చు."
అనెనతడు. నేనడిగితిని అతని:
"అర్జునుండని కలద?"
మరిపెనాతడు: "ద్రోణ శిష్యుడంచున్నయది!'
అడిగితిని: "నీవు నా గురుదేవు శిష్యుడవ?"
"శిష్యుడను? ప్రియమైన శిష్యుడను! శిష్యోత్త
ముడను!" అంచు గర్వమున విక్కియున్నాతనికి
నేనంటి: "ఆ గర్వం మీ నాకు లేదు ఓ
క్షత్రియకుమార! ఆచార్యుని అసంఖ్యాక
శిష్యులందే నొకడ: భక్తిలో నెవరికి ద్వి
తీయుడను కానోయి!" అడిగె నను వాడిట్లు:
"నీవెట్లు ద్రోణగురు శిష్యుడవు చెప్పరా"
"నీవెట్లొ, నేనట్లె!" ప్రతివచన మిచ్చితిని.

మరియు నిట్లనె వాడు: "గుర్తేమి చెప్పరా,
అందులకు?" చెప్పితిని: "ఈ కరమె చెప్పదా?"
ఈ శబ్దవేధి విద్యామూర్తి చెప్పదా?"
ఈసుతో ఇట్లనెను: "దాన చేసెను నాకు
గురువరుడు:
"నాకుగా కితరులకు లభియింపదా విద్య!"
నవ్వుచంటిని: "నాకు అదియొకటియే కాదు.
ఆచార్య కృపవలన, నాదు గురుభక్తిచే,
అఖిలాస్త్ర విద్యలును కైవసమ్మయినవి!"
అమ్మ, ముందేమి నడచునుండెనో ఎరుగ.
అంతలో వచ్చెనట కతని పరివారమ్ము.
అబ్బురమ్ములలోన అబ్బురము! కనుగొంటి-
నాదు గురుపుత్రు, నశ్వత్థామను!
వేటాడువారితో వేడుకకు వచ్చియుం
డినవాని. నరుగెత్తి వచ్చి నను ఆలింగ
నము చేసె గాఢముగ. పరిచయము చేసె నను
అర్జునునికి; ఎఱిగించె పూర్వవృత్తాంతమ్ము.
నేను పైతము చెప్పితిని నాదు కథను.
విని దాని అందరును ముక్కుపై వ్రేలుంచు
కొనిరి. పైపై కర్జునుడు నాకు అభినంద
నము చేసె. కాని అతని హృదయ కుహరమున
రగులుకొనుచుండిన దసూయాగ్ని అప్పుడే!

అమ్మ - ఆటవికులను గాంచి నాగరీకులకు మ
చ్చరమా? రాజకుమార్లతోడ మనకేమిటికి
గొడవ? మామమురకొప్ప మచ్చరము. వాళ్ళదగు
పుడమి వాళ్ళకు విడుము. మనకుండుగాక ఈ
మన అడవి.

ఏకలవ్యుడు - వాళ్ళకెక్కడిదమ్మ అటువంటి సంతృప్తి?
తమ మాటకు విధేయముగ నుండవలెనంద్రు
అడవియును, దేశమును. (కొంత కోపముప్పొంగి)
రాకుంద్రుగాక నా అడవి గొడవకు వారు,
వచ్చిరే నగు తగిన శాస్తి!

(వీరిద్దరును మాటలాడుచున్నపుడు చుట్టును గల దృశ్యమున
కుచితముగా అరణ్య మృగపక్షుల వన్య వ్యాపారములు సాగు
చుండును. ఒక లేడిపిల్ల ఆడుచు వచ్చి, అరటాకున గల
పండ్లను, తేనెను ఫలహారము చేయుట గని)

అదిగో, అమ్మా, నీవు నాకు తెచ్చిన తిండి
నైవేద్యమైనయది, కను, వేటదేవునికి!

అమ్మ - (చూచి) చూచితివ; నేనెంత అదిలించినను కూడ
విడక వెన్నంటి వెదకుచు వచ్చినది కదా!
ఛీ, దొంగ లేడి కూనా!
ఒకరోజు తోడేలు తిండి నవుదువు నీవు
ఈ విధముగా అడవిలోన తిరుగుచునున్న!
(మృగపోతము నుండి అరటాకును లాగికొనబోవును)

ఏకలవ్యుడు - (మోరసెత్తి అరటాకును వెంబడించిన జింకపిల్లను పట్టి, ఎత్తుకొని, ముద్దాడుచు)
తోడేలా?
తోడేలదెటనుండు వాడు ఈ కొండలో?
(రాతిపై నుంచిన వింటిని చూపుచు)
ఈ ధనుష్కాంతినీటం శృతికి అదిరిపడి
క్రూరజంతువు లిచట రారాద రావమ్మ!
(కొదమలేడిని ముద్దాడుచు, దానిని సంబోధించి)
వాడు ముద్దుల లేడికూన, నీ ఇష్టమ్ము
వచ్చినట్టుల నీవు ఈ యడవి తిరుగాడు!
నీ తమా రక్షణమ్మునకుండు నేనెపుడు!

అమ్మ - అబ్బి, నీవిపుడేమి భోజనము చేతువా?....

ఏకలవ్యుడు - (మధ్యమాట కలిపి) అప్పుడే చెప్పితిని కదా?
నోము ముగిసిన పిదప నేను భోంచేతునని!
ఈనాడు (ద్రోణ ప్రతిమను చూపించి)
ఆ గురువు ఈ నన్ననుగ్రహింపగ వచ్చు.

అమ్మ - ఎవరు చెప్పిరి నీకు ఆ సంగతిని?

ఏకలవ్యుడు - మిత్రుడా గురుపుత్రు దంపించినట్టి ఒక
వార్తాహరుడు.

అమ్మ - (సగర్వముగా) వచ్చు నా గురు? వేలవచ్చు?

ఏకలవ్యుడు - ఇంకేల? శిష్యు దీవించుటకు!

అమ్మ - (కొంత ఆలోచించి, ఉప్పొంగి) ఇంక....
(కొడుకువైపు అర్థపూర్ణముగా చూచును)

ఏకలవ్యుడు - (గాఢప్రేమపు భుజపంజరము నుండి తప్పించు కొనుటకై గిజగిజ లాడుచున్న కొదమలేడిని క్రిందికి దించి, అది చెంగున దూకి తరుగిడిపోవుచుండుటనే గమనించుచు)
ఇంక?

అమ్మ - (కనుబొమలు ముడుతలు పడునట్లు చింతామగ్నురాలగుచు)
నీదు విలువిద్య నేర్పును గూర్చి ఆలించి
రాజులకు స్నేహ సాహాయ్యమ్ము కోసరింప
అటకు పిలుచుకపోదురో?

ఏకలవ్యుడు - (తమాషగా)
అమ్మ, నీ ప్రీతిపూర్వకమైన ఈ యూహ
దుబ్బులో అబ్బురపు రూపము కను కవితాజ
తను పైతమచ్చేదువు కలిగించు!

అమ్మ - (కొడుకు హాస్యమును ప్రక్కకు నెట్టి, లెక్కించక)
నీవు ఆ రాజు లూరికి వెళ్ళిపోవగా
నేనెట్టులుందు నీ యడవిలో ఒంటరిగ? (నిట్టూర్చును)

(అడవి కనుమలలో దూరమున కాహళ శబ్దము వినిపించును. ఏకలవ్యుడు ఉప్పొంగిన ఉత్సాహమున ఎగిరి నిలిచి, తన నడుమునమున్న సుడులు తిరిగిన కొమ్మును తీసి, నోటనుంచి, ఊదును. మరల కాహళము ప్రత్యుత్తరమిచ్చును)

అమ్మ - (అదరిపడి, నిలువబడి, వెరగుపడి) ఏమద్ది? ఓరబ్బి?

ఏకలవ్యుడు - ఏమిలేదమ్మా. బెదరకు.
నేనానతిచ్చినటు గురుదేవు నాగమన
మును చాటుచున్నదీ మనదు కావలి కొమ్ము.
నీవు పద, మనదు ఆ రాజభవనమ్మునకు-
సిద్ధమ్ముగా నుంచుమమ్మ ద్విజపుంగవుల
ఆహారమైనట్టి కందమూల ఫలాలు.
నేను చాపాచార్యు కని, ఎదుర్కొని, అడుగు
లకును సాష్టాంగపడి, పిలుచుకొని వచ్చెదను.

అమ్మ - (కొడుకు వేషభూషలను పరికించుచు)
నీవిట్టులే వెళ్ళ చూచుటా?
వ్యాధరాజుకు తగిన వేషభూషల దాల్చి,
పోవుటుచితము కదా?
రాజగురువుకు అట్టి మర్యాద వలయు కద?

ఏకలవ్యుడు - అటువంటి పొగడు గిగడున బుద్ధి చెడినట్టి
వాడు కాదమ్మ నా పరమ గురుదేవుండు.

అదిగాక, నీచెప్పు మన వేషభూషలవి-
గవ్వలీకలువండ్లు గోళ్ళు చర్మమ్ములను-
నచ్చునా నాగరీకుల రుచికి!(మరల కాహళ వినిపించును)
ఆలసింపకుమమ్మ, వడువేగ.
(అమ్మ అరటాకు నెత్తుకొని బయలుదేరును)

ఏకలవ్యుడు - (పేరెక్కుచున్న ఎండలో నొసటిమీద చేయి పెట్టుకొని, దూరమున వ్యాపించిన కనుమల దిక్కు చూపు విగిడించి)
ఓః! ఆ ప్రక్కనుండియే ఏతెంచు నాహాహా
కారవము. ఈ దినము ధన్యః మే ధన్యుడను!
గురు చరణ సరసిజ పరాగ సంస్పర్శతో
ధన్యమీ నాపర్వ కారణ్య ధారుణి!

గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః।
గురురేవ పరబ్రహ్మ, తస్మై శ్రీ గురువే నమః॥

(ఆఘోషించుచు ద్రోణ ప్రతిమకు దీర్ఘ దండ ప్రణామ మొనరించును. గాలి వీచును. చుట్టును వృక్షప్రసూనములు రాలును. జలపాతపు నీరు తుంపురులు తుంపురులై చిమ్మును. దాని ప్రోత పక్షుల కూతలతో కలసి ఓంకార లయమగును).

( తెర పడును )

( ఇంకా వుంది )

# సంకల్పం

అద్దంలా
స్వచ్ఛమైన నా హృదయ ఫలకంమీద
అంతం లేని
ఆలోచనల
ఆవేదనల
నిరాశల
నిట్టూర్పుల శిలావర్షం కురుస్తోంది
అవిశ్రాంతంగా!
ఛిద్రుపలైన
నా హృదయ శకలాలు
కవోష్ణ రుధిరధారల్లో తడిసి
కిరణాల్లా మెరుస్తున్నాయి మరీ ఎర్రగా!
ఓ నింగినెచ్చెలీ!
క్రౌర్యంలా, కౌటిల్యంలా
నల్లనైన నీ చీకటి ఒళ్ళోకి చేరి
మానవత్వ మహోదయాన్ని —
తుది విజయాన్ని - సూచించేలా
నీ నుదుటిని
రక్తారుణ తిలకరేఖతో
నేనివాళ అలంకరిస్తాను!
ఆరిపోయే జీవర క్తిని
అనంత చైతన్యశక్తిగా ఆవహించుకుని
రేపటి సూర్యుడుగా
మళ్ళీ నీ కళ్ళలోనే
మండుతూ ఉదయిస్తాను!

శ్రీ కాసల నాగభూషణం

## శుభ వర్తమానం

ఎవరా అన్నది ఓల్డ్ ఈజ్ గోల్డని?
నేనంటాను అందులో కల్తీలు బోల్డని!
పోయినది తిరిగి రాదన్నది తిరుగులేని నిజం
పోయినదంతా మంచిదనడం రొమాంటిసిజం;
చేజారినదాని విలువ పెరుగుతుంది చెప్పలేనంత,
చేతిలో ఉన్నదాని విలువ కళ్లు విప్పి చూడలేనంత!
ఇది వృద్ధులలో కనిపించే బాల్యం
బుద్ధి మందగించిన స్మృతి విహరణ లౌల్యం.
గెలుపూ ఓటమీ మంచీ చెడూ కలిసి మెలిసి
రాత్రింబగళ్లలా వస్తుంటాయని తెలిసీ
గతించినవన్నీ బంగారు దినాలనుకోవడం,
రోజులు మారిపోయాయని కంగారు పడడం
చేతకానివారి, చేతులెత్తేసినవారి బలహీనత;
చెయ్యగలిగి కూడా ఏమీ చెయ్యని ఆత్మన్యూనత.
శరీరంతో కాక మనసుతో జీవించేవారికి
యౌవనం వెళ్లిపోయిందని చింత దేనికి?
కాలం గమనశీలమని తెలిసినవారికి
గుడ్ ఓల్డ్ డేస్ గూర్చిన భ్రమలు దేనికి?
గుడ్ ప్రెజెంట్ తీర్చిదిద్దుకో గలవారికి
గుడ్ ఫ్యూచర్ ఉండడంలో సందేహం దేనికి?
కాలం నిత్యం ప్రవహించే నది
నిన్న, నేడు, రేపు తేడా చూపనిది.
తేడా కనిపించేది ఒడిపోయిన మనిషికే,
నడవలేక నిలబడిపోయిన మనిషికే.
అడుగు ముందుకేసేవాడికి గడచినదానితో పనిలేదు
గడిచినదాన్నే కొలిచేవాడికి అడుగు ముందుకి పడదు.
ఇకనైనా వెనక చూపు మానేసి ముందుకి నడుద్దాం
వెనకబడితే వెనకేనన్న కవి మాట పాటిద్దాం.

## చక్రవాళం

కూపస్థ మండూకాలకి
నూతిగట్టే దిగ్వలయం,
లోకం కనుచూపుమేర.
నేను నిత్యచారిని—
గమనం నా గమ్యం.
నా దారి అనంతం.
నేను నింగిని వలచిన నేలని.
నీలి నింగి నా మీదికి వంగి
గుస గుసలాడడం మీకు తెలీదు.
నా ఊహల పెదాల చివర్లని
సున్నితంగా చుంబించడం తెలీదు.
దిఙ్మండలపు మిథ్యాంచలం
మా వలపు వాఙ్మయంలో
మేం కలిసే సంకేత స్థలం.
వెలుగు వేలుపులు సూర్యచంద్రులు
బయలుదేరే ప్రాగ్ద్వారం.
నేను నడుస్తూనే ఉంటాను
అక్కడికి చేరుతూనే ఉంటాను
అక్కడే ఉంటూ ఉంటాను.
నేనున్నచోటే నా గమ్యం,
అక్కడికే నా ఆగని పయనం.

**కె. గోదావరి**

డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు

# మఱుగుపడిన మధురకవి

# శ్రీ మల్యాల జయరామయ్య

ప్రతిష్ఠాకరమైన సంస్థల్లో పనిచేయనూ లేదు. ప్రాభవంలో ఉన్నత పదవిలో ఉండనూ లేదు. గురుకుల క్లిష్టంగా ప్రాచ్యవిద్యలు ఏ కళాశాలలోనూ స్థిమితంగా చదివినవారూ కాదు పెద్దగా గురువులవద్ద అంతే వాసిత్వమూ ఉన్నట్లు కనపడదు. అయితే ఆ ప్రతిభా సంపన్నత ఏమిటో సంస్కార విశేషమేమిటో చెప్పలేను కాని కమనీయమైన కవితాధార - చక్కని సృజనాత్మకత కల్గిన ప్రదర్శనయోగ్యమైన నాటకాలెన్నో వెలువడ్డాయి ఆయన లేఖిని నుండి చెప్పుకోదగ్గ సంఖ్యలో.

తానే ఆరజాలిచ్చి కవిత్వంపై కండూతి యేర్పడి, సులక్షణసారం కొనుక్కొన్నారు రెండోఫారం పెద్దాపురం మిషను స్కూల్లో చదువుతూ. అదీ విద్యాస్పర్ధతో అవటం మరీ విచిత్రం! నూకల సత్యనారాయణమూర్తి అనే సహపాఠి పద్యాలు వ్రాస్తే, తాను ఎందుకు వ్రాయలేనని స్పర్ధించి ఛందోలక్షణం స్వయంగా నేర్చి కైత కట్టినాడు (1928). ఆయన కలంనుండి 13వ ఏట వెలువడ్డ కవిత్వం చిత్తగించండి.

వందన మందర! శ్రీరఘు
నందన! శ్రీరామచంద్ర! నన నెప్పుడు నీ
డెందము నందున నను నీ
నందము దను భావమందు నను గావుమయా!

అనగా సహజంగా కవితకోసం పుట్టాడన్నమాట. అయితే కేవలం కవిత్వం చెప్తూ జీవితరథం నడిపించుకోవటానికి తను వయిన మంచికాలం ఇంకా ముందు ముందే ఉంది. తెలుగునేలలో ఏ మల్లాది రామకృష్ణశాస్త్రి, కాటూరి వేంకటేశ్వరరావో వంటి, జీవికకు తడవుకో నవసరంలేని వసతి వాడులు కలవారేకొద్దిమందో తక్క, తక్కిన కవులు, పండితులూ అంతా ఏదో ఉపాధికి మార్గం చూచుకొని, అందులో కుదురుకొని ఆ తర్వాత తమ తమ కళిమతాలైన సాహితీపథంలో సంచారం చేసినవాళ్ళు, పేరు ప్రతిష్ఠలు గడించినవాళ్ళున్నూ.

అట్లా బాల్యంలో కవిత్వం చెప్పినవాడే మధురకవి శ్రీ మల్యాల జయరామయ్యగారు. చిన్నతప్పుడే తండ్రి గవర్రాజు గారు గతిస్తే, మాతామహులైన పాణంగిపల్లి జయరామయ్య గారింట పెద్దాపురంలో పెరిగి పెద్దయి అక్కడే స్థిరపడ్డారు. వీరి పితామహులు రాజన్నగారు పిఠాపురం ఎస్టేటులో తాశీదారు చేసే వారు. ఈ పాణంగిపల్లివారు, పెద్దాపురం సంస్థానం మూడు పువ్వులూ ఆరు కాయలుగా వర్ధిల్లుతున్న రోజుల్లో, ఆ సంస్థానానికి అమాత్య పదవి నధిష్ఠించారు. ఆ కుటుంబంలో ఆరో తరమో ఏడో తరమో ఈ జయరామ కవి. వీరి అమ్మమ్మ చంద్రంపాలెంలోని కూచిమంచి తిమ్మకవిగారి కుటుంబంలో పుట్టిన ఆడుబిడ్డ జయరామయ్యగారికి తెలుగు కవులన్నా కైత లన్నా చెప్పలేని అభిరుచీ ఆదరమూ. హైస్కూలు చదువు ముగిసింతర్వాత కాకినాడలో పిఠాపురం రాజావారి కళాశాలలో ఇంటరు చదువుతూ (1933-35) కుటుంబ జంజాల పటలంవల్ల రెండో సంవత్సరం మధ్యలో చదువు ఆపివేశారు. అప్పట్లో ఆ కాలేజీ ప్రిన్సిపాలు పెద్దాడ రామస్వామిగారు. వీరు మిగిలిన వక్త ఆంగ్లంలో. అప్పుడప్పుడే కొత్తగా తెలుగు ట్యూటరుగా చేరారు ఆ కాలేజీలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు! అప్పటికే ఆయనకు మంచిపేరుంది కవిగా. ఆంధ్రోపన్యాసకుల్లో కోవల్లె శివకామేశ్వరరావుగారు లబ్ధప్రతిష్ఠులు. భారతభాగం కాలేజీ విద్యార్థులకు, శ్రావ్యంగా చదివి చెపుతూంటే, అదొక రస స్రోతస్వినిలా ఉండేదంటారు ఏ పూర్వవిద్యార్థిని కదలించినా. చక్కని సాహిత్య కోవిదత్వంతోపాటు చక్కని వచనం, విశ్లేషణ, మంచి భావుకత పొదువుకొన్న మూర్తి ఆ మహాపండితుడు. ఆ కళాశాలకు ప్రతిష్ఠ గడించిన తొలి తరం పండితుల్లో ఆయనొక్కరు. ఇరవైయైదు సామెతలు గుదిగ్రుచ్చి ఒక ప్రశ్నకు జవాబు వ్రాయటం చూచి, శిష్యుడు జయరామయ్యను భుజం తట్టి ప్రోత్సాహమిచ్చారాయన. అది ఊరికే పోలేదు.

జయరామయ్యగారు కొంతకాలం సాహిత్యం నాటకాలూ అంటూ తిరిగి చివరకు రాజమండ్రి సెకండరీ గ్రేడు ట్రైనింగు అయ్యారు. అప్పుడే చిలకమర్తి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, నండూరి బంగారయ్యగారలతో చెప్పుకోతగ్గ సాన్నిహిత్యం పెంపొందించుకొన్నారు. సమీపంలోని కడియం గ్రామం వెళ్ళి చెళ్ళపిళ్ళవారి దర్శనం చేసుకొంటూండటం కద్దు. ఇదంతా సాహిత్యంపై అభిరుచితోనే. ఎంతో కొంత స్ఫూర్తి వారివల్ల పొందనూ పొందారు.

అట్లా ట్రైనింగు అవుతున్నప్పుడే జయపురం మహారాజా శ్రీ శ్రీ శ్రీ రాజా విక్రమ దేవవర్మగారిపై నక్షత్రమాలిక చెప్పి కైతకు పారితోషికం పొందారు నూటపదహార్లు ఆ రోజుల్లో. ఆ తర్వాత పెద్దాపురంలో మువ్వన వీర్రాజు హైస్కూలులో 1940లో ఉపాధ్యాయుడుగా చేరి 1972లో రిటైరైనారు. ఈనాటికీ పైమీద శాలువా, ఒక చేతిలో గొడుగూ, రెండో చేతిలో పుస్తకాల పంచీతో పాఠాలు చెప్పటానికై ఉదయం, సాయంత్రం వెడుతూ మాకు దర్శనమిస్తూనే ఉంటాడు పెద్దాపురంలో జయరామయ్య మేష్టారు.

వీరు తొలుత ప్రచురించిన నాటకం ఘోషయాత్ర(1939). భారతకథ ఆధారంగా రచించినది. దీన్ని శ్రీ రాజా విక్రమదేవ వర్మగారికి అంకితమిచ్చి, అచ్చువేసి, ఆ తర్వాత విశాఖపట్టణం హవామహల్‌లో వారి దర్శనం చేశారు కవిగారు. వారు ఉదయం సాగరతీరంలో వాహ్యాళికి వెడుతూండగా వారి ననుగమించారు. వారు కవిగారివైపు తిరిగి 'ఏమాశించి ఈ దృశ్యకావ్యం అంకిత మిచ్చారని రాజాగారడిగితే, 'ప్రభువుల చిత్తం' అన్నారట వమ్రంగా. ఆ తర్వాత రాజావారు వీరిని ఘనంగా సత్కరించారు. ఇదే జయరామయ్యగారికి జరిగిన తొలి సత్కారం. నండూరి బంగారయ్యగారు నాటకమంతా విని చక్కని కల్పనా కౌశలంతోపాటు ఆధునిక భాషా ప్రయోగాలు చేయటాన్ని అయన మెచ్చుకొన్నారు. శ్రీపాద, చిలకమర్తి, చెళ్ళపిళ్ళ వీరి రచనని ప్రశంసించారు. ఈ ప్రశంస కవిగారికి మరింత ప్రోత్సాహమిచ్చింది. దాంతో మరిన్ని రచనలు చేశారు. ఆంధ్రపత్రిక, ప్రజామిత్ర, గృహలక్ష్మి పత్రికలీ నాటకాన్ని బహుధా ప్రశంసించాయి.

జయరామయ్యగారిని కవితలల్లే తొలినాళ్ళలో మీరు చదివిన కావ్యాలేమిటని అడిగితే 'కనపర్తి అబ్బయామాత్యుని కవిజన మనోరంజనమూ, చేమకూరవారి విజయవిలాసమూ, ముద్దుపళని రాధికా సాంత్వనమూ, అనంతామాత్యుని భోజరాజీయమూ మా యింట్లో ఉన్న కారణాన బహువారములా కావ్యాల్ని చదువుతూండేవాణ్ణి' అన్నారు. అందుచేతనే నా కవితా రచనలో ఆయా కవుల పలుకుబడుల తీరుతెన్నులు కొంతకు కొంత కనిపిస్తూంటా యన్నారు ఎంతో వినయంగా. ఒకసారి చిన్నతనంలో శ్రీపతి త్ర్యంబకరావుగారనే సుప్రసిద్ధ శతావధాని కాకినాడలో శతావధానం చేయగా దానికి హాజరయ్యారు జయరామయ్యగారు. ఆ సాహిత్య క్రతువులో పాల్గొని ఆనందించారు. అది జరిగిన పది రోజులకు విజయనగర విద్వాంసు లొకరు త్ర్యంబకరావుగారి అవధానాన్ని అధిక్షేపిస్తూ ఒక వ్యాసం పత్రికలో వ్రాస్తే, అది చదివి 'కాకినాడ శతావధాన పరిశీలన' అనే వ్యాసం త్రిలింగ (మద్రాసు) లో ప్రచురించారు. అటుపిమ్మట కొన్నాళ్ళకు రాజమహేంద్రవరంలో బంధువుల యింట పెళ్ళికి జయరామయ్యగారు వెళ్ళగా, అప్పుడు ఈ త్ర్యంబకరావుగారు శతావధానం చేస్తున్నారు. పృచ్ఛకుల్లో ఒకరు లేచి 'తల్లాప్రగ్గడవు నీవు కల్లాడవుగా' అని సమస్య యిస్తే, ఇదేమి సమస్య అంటూ మరుక్షణంలో 'అనుక్ తల్లాప్రగ్గడవు నీవు కల్లాడవుగా' అంటూ చమత్కారంగా పూరించారని చెప్పారీయన.

లంకా దహనము :-

ఐదంకాల నాటకం (1946) సుందరకాండ ఆధారంగా వ్రాసినది. ఎన్నోసార్లు ప్రదర్శింపబడి, ప్రేక్షకుల మన్ననలు పొందింది. పెద్దాపురం హిందీ మండలి దీన్ని ప్రచురించింది. నందం గనిరాజు దీనికి ప్రేరకుడు. సులభ గ్రాంధికంలో వ్రాయబడ్డ నాటకం. పౌరాణిక నాటకాల్లో పరిపాటి అయిన రోజులు కాబట్టి, కవిగారిందు రెండువందల పదమూడు పద్యాలిందులో గుప్పించారు. రంగ విభజన ఉంది. తిరుపతి వేంకటకవుల ఉద్యోగ విజయాల్లో అడుగడుక్కీ పద్యాలే. జయరామయ్యగారి పద్యాలు సులభ సుందరంగా అక్లిష్టంగా ఉంటాయి. 'ఎందులకీ జపంబు? ప్రజలెందరు గల్గిననేమి? కోతి బట్టం దగు యోధుడే గలుగడా! ఇక సైన్యములేల?' ఇలా ఎంతో సాఫీగా నడుస్తాయి పద్యాలు. వాకోవాక్యాలు పద్యాల్లో చోటు చేసుకొంటాయి తమంత తామొదిగే పలుకుబడులతో ఒప్పుతాయి పద్యాలు. రంగస్థలానుకూలమై ప్రయోగ ప్రధానంగా రచింపబడ్డ నాటకమని సన్‌డే టైమ్స్ పత్రిక (సెప్టెంబరు 16, 1946) కొనియాడింది. పద్య రచనలో కూడా నాటకీయత ఎంతో ముచ్చట గొలుపుతుంది. అందుకేనేమో ఏ నటుడూ ఒక్క పద్యాన్ని కూడా వదలకుండా చదివేవారు.

**శ్రీ రామాంజనేయము :-**

మూడో పౌరాణిక నాటకం. ఇదీ గద్యపద్యాత్మకమైనదే. రంగస్థలంపై పలుమార్లు ప్రదర్శింపబడి ప్రేక్షకుల మన్ననలను చూఱగొన్నది. 1951లో ఇది అచ్చైంది.

**పెంకిపిల్ల :-**

ఇది సాంఘిక నాటకం. 1938లోనే వ్రాసినట్లు రచయిత పీఠికలో పేర్కొన్నారు. తొలి ముద్రణ 1951. మలి ముద్రణ 1954. ఇది నాలుగు పర్యాయాలు ప్రదర్శింపబడింది. ఇందులో సుప్రసిద్ధ నటులు రేలంగి వెంకట్రామయ్య, మైపాల రామన్న, దాసరి కోటిరత్నం, నోరి శ్రీరామచంద్రమూర్తి, చిట్టి ప్రభృతులు వేషాలు కట్టారు. వ్యావహారిక భాషలో రచన సాగినా ఇందులోనూ సందర్భోచితంగా పద్యాలున్నాయి.

ఇందులో వియ్యంకులిద్దరిలో ఒకరికి తమకు తామే గొప్పని చెప్పుకొనే స్వభావం, ఒకరు అవునన్నది కాదనే స్వభావం రెండో ఆయనది. సంభాషణలు నవ్వు పుట్టిస్తాయి. కథా నిర్వహణ విభిన్నంగా ఉంది. సాంఘిక దురాచారాలు పారద్రోలటాని కిట్టి నాటకాల అవసరం ఎంతైనా ఉంది.

**అముద్రిత నాటకాలు (1942-49) మధ్య రచించినవి :-**

(1) ఆరోగ్యమాత. ఆరోగ్యవిద్యను గూర్చి ప్రబోధించే నాటకం. (2) సుభద్రార్జునము (1942) ఇది పౌరాణికము. విజయవిలాస కథ యిందలి యితివృత్తము. (3) గౌతమబుద్ధుడు. చారిత్రాత్మక నాటకం. (4) శరసంధానము. ఇది రంగస్థల ప్రధానమైన నాటకం. పృథ్వీరాజు, జయచంద్రుల కథ. (5) రక్షా బంధన్; పద్మిని నాటకాలు. (6) మాయలోకంలో మనశ్శాంతి- సాంఘిక నాటకం. (7) మారని మనసులు-సాంఘిక నాటకం. (8) అబద్ధ హరిశ్చంద్ర-ప్రహసనము. (9) మెత్తని దొంగలు (నవల) ఇది నాకు లభ్యము కాలేదు.

**బుఱ్ఱకథలు :-**

(1) పశుసంపద - ప్రచారం కోసం పశుసంవర్ధక శాఖ కోరికమీద వ్రాసినది. (2) రుక్మిణీ కళ్యాణము. (3) కృష్ణ రాయబారము (4) మహాత్మ భీష్మ (5) ఏసుక్రీస్తు. ఇవీ అముద్రితాలే.

**సాహిత్యసభ :-**

దీని వ్యవస్థాపకులు శ్రీ జయరామయ్యగారు. ఎందరకో ఈ సభ సన్మానాలు చేసింది. కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారికి 1942లో నూట పదహారు అర్థరూపాయలతో సన్మానం. ఇదే తనకు జరిగిన తొలి సన్మానమని జంధ్యాలవారెంతో ఆనందంగా చెప్పుకుంటారు ఇప్పటికీ. జమ్మలమడక మాధవ రాయశర్మగారివంటి ఉద్దండ పండితు లెంతోమందిని సాహిత్యసభ సన్మానించింది.

**మహాత్మజీ విజయయాత్ర (1949) -**

బాపూజీ నిర్యాణానంతరం కవిలో పొంగిన భావోద్రేకమే ఈ రచనకు ప్రేరణ ముందు అలవోకగా కొన్ని పద్యాలు వ్రాసి, సాహిత్య రసికులకు వినిపించారు వారి ప్రోత్సాహంపై ఖండ కావ్యం పూర్తయింది హిందూదేశ చరిత్ర, నాగరికతల గూర్చి ముచ్చటిస్తూ భారతదేశ విభజనదాక నడిపించారు రమ్యంగా. అప్పటి మతోద్రేకాలు, బాపూజీ శాంతియాత్రలు - ఆయన ఆహుతి కావటంతో కావ్యం ముగుస్తుంది. అస్తమయ వర్ణన కరుణరసప్లావితంగా సాగింది. చదువుతుంటే పఠిత గుండె ద్రవిస్తుంది. పురాభారత చరిత్ర, ఈనాటి స్థితిగతులు పట్టిచూపే అద్దం ఈ కావ్యం మధురశైలి-చక్కని ధారాశుద్ధి కల కావ్యం. బాపూజీమీద గల భక్తి ప్రతి పద్యంలో తొణికిసలాడుతుంది. 'ఆంధ్ర సాహిత్యంపై గాంధీజీ ప్రభావం' అనే పరిశోధన గ్రంథంలో. డా॥ ఆంకయ్యగారు, డా॥ యం. వి సుబ్బారెడ్డిగారు తమ థీసిస్సులోనూ జయరామయ్యగారి కృతిని ప్రశంసించటం, ఈ కావ్యకర్తకు పట్టిన హారతి. బాపూజీని గురించి-

'అతడు విరాగి, కాని జగమందున కాతని కెంత ప్రేమ'
అతడు భికారి, కాని భారతావనిపై గల భాగ్యమెల్ల న
ల్లతనిదె' అంటూ అభివర్ణించారు.

'దీవిక్షప విశాల భారత సవిత్రిన్ చీల్చి'రని కవి వాపోయినాడు. 'పాలు పంచగ పొదుగునే చీలదీసె' దేశవిభజనపై కవి వర్ణన సహజంగా ఉంది. సమకాలీన సంఘటన ఆధారంగా వ్రాసిన ఖండకావ్యం. కవిని కదల్చిన సంఘటన కావ్యరూపమై నిల్చింది.

బాపూజీ అంతిమయాత్రయే విజయయాత్ర, 'రసపూర్ణం బగు నిండు మేఘమటులన్ రాజిల్లు మా బాపూజీ' అని పలుకుబడి. దారుణ మారణకాండను 'ప్రతి సాహసికుడు తారాజువ్వయై నిప్పు గుప్పిన తోడన నేల గూలిపోయె' అంటూ కళ్ళకు కట్టినట్లు వర్ణన. 'కిరీటము లేని రాజరాజాతడు భారతీయులకు' అని ప్రశంస.

వాచవికై ఒండు రెండు పద్యాలు చిత్తగించండి.

పావనమూర్తియై శిలువపై నిజరక్తము ధారవోసి పా
పావలి పంకమున్ గడిగివైచిన ఏసు పవిత్ర గాథలో
చేవలు దేరు నోరిమి విశిష్టత నెంత గ్రహించుకొంటివో
ఆ విధి నీవు గూడ బలియైతివి హింసకు ధర్మవేదిపై

పగలు తెగ మేసి కడు క్రొవ్వి పొగరుపట్టి
చిందులం ద్రొక్కు ద్వేషవాజిని అడంప
గక్కుల లగాము బిగియించి గాంధి దేవు
దలపియున్ బట్టువిడదు, మహాత్మ దక్కడె

చిన్నప్పుడెప్పుడో సుప్రసిద్ధ పండితకవులు మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు (ధవళేశ్వరం) జయరామయ్యగారికి 'సిద్ధం చేసికొని రాయి' అని సలహా యిచ్చారట! అది అక్షరాలా ఆచరణలో పెట్టిన కావ్యకర్త శ్రీ జయరామయ్యగారు. సాహితీ సభ ఈ కృతిని ప్రచురించింది.

**ఉన్న ఊళ్ళో సన్మానం ..**

పెద్దాపురంలో కలపాక వేంకటశివుడుగారు పేరుమోసిన న్యాయవాది. సంస్కృతి అన్నా సాహిత్యమన్నా అభిమానించటమే కాదు ఆదరించే ప్రవృత్తి ఉండటం మెండుగా ఎరిగున్నతే- మరుగున పడిన ఈ కవి యింటికి ఆయన స్వయంగా వెళ్ళి ఆహ్వానించి ఆ కవిగారిని సన్మానించిన ఉదారచరితుడు. ఇది జయనామ సంవత్సరంలో జరిగింది. రోజూ కనిపిస్తూన్న అలసత్వమో ఉపేక్షో తెలీదుకాని పెద్దాపురం ఆయనకు సముచిత సత్కారం చేయకపోవటం లోటే అనుకుంటూంటాం తరచు సాహితీపరులమంతా. తెలుగునాట జీవత్కృషి సాగించిన కవులనూ కళాకారులనూ విస్మరించటమే పరిపాటి. [illegible] రంగాలను చూచి మనం పాఠాలు నేర్చుకోవాలి. మన ప్రభుత్వాలు గొంతు చించుకోవటం తప్ప చేసిందేమీ లేదు.

1915 జూలైలో జన్మించిన జయరామయ్యగారు డెబ్బైనాలుగో సంవత్సరం నడుస్తున్నా కలంపట్టి కవిత చెప్పటం మానని మధురకవి. ఆయన్ను కదిపితే చాలు కవుల గాథలూ, అవధానాల చమత్కారాలు కోకొల్లలు జలజల రాలతాయి. ఇన్ని కృతులు వెలయించినా ఈ కవి ఇప్పటికీ మరుగున పడిన మాణిక్యమే.

# గీతలహరి

వర్షిస్తున్న ఆకాశాన్ని చూస్తే అవని అంచున హర్షం.
వికసిస్తున్న పువ్వును చూస్తే కొమ్మకొమ్మనా సరాగం.
పులుముకునే పచ్చదనంమధ్య శోభిస్తున్న పొలాన్ని
చూస్తే
రైతు గుండెనిండా చెప్పలేని సంతోషపు పొంగు.
మేఘాలమధ్య వాలిన ఇంద్రధనుస్సు రంగులు చూస్తే
విరహవేదనలో మునిగిన అపర యక్షుడికి-
ఆమె తలపుల చక్రభ్రమణపు తళతళల ఝళుళ్ళు.
రంగస్థలంమీద నర్తిస్తున్న లాసిక భంగిమలు చూస్తే
రసహృదయుని నవ వసంతోదయ సంచలనం.
దరిచేరిన చంద్రవదన కన్నులకాంతులు చూస్తే
ప్రేమోన్మత్తుడి కంఠాన ప్రియతమ గీతలహరి.
ఈ అమేయ ప్రాణిమయ స్పందనల రహస్తంత్రులే
ఈ గీతానికి ప్రాణం ఈ చేతనకు మూలం.

**శ్రీ ఆర్. చంద్రశేఖర శాస్త్రి**

# శబ్దం

## యం. యస్. సూర్యనారాయణ

1

తొడుగు వెనక నేను
అక్షరం వెనక నీవు
నాది ఆత్మ
నీది పరమాత్మ.
నీ కోసం
నేను నిద్రకాచాను
కలల్లో సైతం నీ దరిచేరాను
చివరకు కంటకమైన
నా భక్తిమార్గంలో సైతం
నిన్నే నింపాను
నా జీవనాడిలోంచి
చిక్కగా ప్రవహిస్తూ
నా గాయాలకు సాక్ష్యంగా నిలిచావు
నను ఓదార్చావు
అప్పటి నీ దివ్య సందర్శనం
నా జీవనానికి స్పందనగా నిలిచింది

2

స్పందనా!
నాకు నువ్వు
ఓ జీమూతవాహనుణ్ణి పరిచయం చేశావు
శిబి లోపలికీ,
మహాత్ముడి మందిరంలోనికీ
బోధివృక్షం నీడలోకీ
భజగోవిందంలోకీ
భగవద్గీతలోకీ
నా చెయ్యిపట్టి లాగినపుడు
నిన్ను నే విదిలించిన దృశ్యం
ఇప్పటికీ సజీవంగా ఉన్నది

3

ఒక మహత్తర జీవసత్యాన్ని
నిరంతరం నువ్వు
ఆవిష్కరిస్తూనే ఉన్నావు

నిర్మలమైన తనువు వెనకాతలి వెలుగువైపు
నా ముఖాన్ని తిప్పుతూనే ఉన్నావు

మంచుతుఫానులో
ఎడారి దారిలో
వడగళ్ళ వానలో
అగ్నిపర్వత విస్ఫోటనాల్లో
లావాలో.... ప్రళయంలో సైతం
చెదరని నిర్మల, నిశ్చల, నిర్భయ
సందేశాల్ని నింపుతూనే ఉన్నావు
నాలో జ్వలిస్తూ, నా అన్వేషణలో
నా గమనంలో, నా నీడ కదలికలో
నిలిచావు.... మార్గం చూపించావు
స్పందనా!

నా అనాది చైతన్య జలపాతమా
జలజలమని శబ్దించు
ఒక బిందువులా నన్ననుగ్రహించు

# సూఫీతత్వము - ఋతస్యపంథా

ఇస్లాము మత ప్రకారం దేవుడు ఒక్కడే. ఒక్కడే దేవుడు[1] ఆయన అల్లా. అల్లా దండకాపనుడు, దయామయుడు. ఈ జన్మాన మనిషి చేసిన పుణ్యపాపాలకు ఖియామత్[2] ("అంతిమ దినం" లేక ప్రళయకాలం)నాడు న్యాయవిచారణ చేసి బహుమాన, జరిమానాలను పంచి పెట్టుతాడు. మనిషికి శరణ్యం ఖురాను ఇది అల్లా వాక్కు. అల్లా గేబ్రియలుకు (జిబ్రిల్) సందేశమిచ్చినాడు. గేబ్రియలు మహమ్మదు ప్రవక్త వారికి అల్లా సందేశం అందిచ్చినాడు. పైగంబరువారు మానవాళికి అల్లా సందేశం చాటినారు. అయినా అల్లా దూరంగా ఉన్నట్లనిపిస్తుంది[3]. దూరంగా ఉన్నట్లనిపించే అల్లా దగ్గరికి చేరుకొని దైవానుభూతి, ఆనందం పొందవలెననే ఆకాంక్ష ఇస్లాం మతానుయాయులకు కలిగింది.[4] దీనికి ఏది మార్గం? అది సూఫీ మార్గం. పాశ్చాత్యులు "సూఫీజం" అన్నారు.

- దైవానుభూతికి ఉపాయం సూఫీ తత్వం.
- సూఫీజం ఒక మతం కాదు. ఖురాను సూక్తులే ఆధారం.[5]
- భగవంతుని దగ్గరకు చేరుట కేర్పరచుకొన్న మార్గం, పద్ధతి, సాధనే సూఫీతత్వం[6].
- భగవదనుభూతి పొందిన సాధకులు సూఫీలు[7].
- భగవంతునికీ, భక్తునికీ మధ్య కల మోహ మాయా యవనికను తీసేదే సూఫీ హస్తం
- భగవంతునికీ భక్తునికీ మధ్య కల ప్రేమ సంబంధం[8].

"సూ"ఫీ పద నిర్వచనం :

- అరబ్బీ భాషలో సూఫ్ అంటే ఉన్ని. ఉన్ని (సూఫ్) వస్త్రాలు ధరించినవారు సూఫీలు. తసవుఫ్ అని కూడా పేరు. ఇస్లాం మత తాపసులు ఉన్ని దుస్తులు ధరించేవారు. బైబిలులోని ప్రవక్త మోసెస్ (ఇస్లాం మతస్థులు ఈయనను మూసా అంటారు) కూడా ఉన్ని వస్త్రాలు ధరించేవారు[9]. సూఫీ తత్వానికి తసవుఫ్ తత్వమని కూడా అంటారు.

- అరబ్బీ భాషలో సూఫా అంటే శుభ్రత, పవిత్రత ఇవి కలవారు సూఫీలు.

- అరబ్బీ భాషలో సూఫియా అంటే ఎన్నుకొనుట, వరించుట అని అర్థం. మనిషిని తరింపజేయుటకు భగవంతుడే వానిని వరిస్తాడు, ఎన్నుకొంటాడు. దేవునికి సంకల్పం కలుగగనే మనిషి ప్రవర్తన విచిత్రంగా మారుతుంది. ఇట్టి ప్రాప్తి పొందిన ముక్తుడే సూఫీ. గురువు (సూఫీ గురువును షయ్యాక్ (శిక్షకుడు) లేక షేక్ అంటారు) కూడా శిష్యుని వెదకికొంటాడు.[10]

- గ్రీకు భాషలో సోఫియా అంటే జ్ఞానము, "ఫిలోస్" అంటే ప్రేమ. అందుకే ఫిలాసఫి అనేమాట వచ్చింది. సూఫీ కూడా ఫిలాసఫరు జ్ఞానప్రేమి అయినాడు. అంటే అధ్యాత్మ జ్ఞానాన్ని ప్రేమించేవాడని అర్థము

- ఒక పర్షియన్ నిఘంటువులో సూఫీ పదం ఇట్లున్నది: 'సూఫీ కిస్త్? సూఫీ సూఫిస్త్' (సూఫీ ఎవరు? సూఫీ సూఫీయే అని అర్థం) దీని అంతరార్థం సూఫీ పదం అనిర్వచనీయం అని తేలింది.[11]

## సూఫీతత్వం ఎప్పటిది?

ప్రాచీన గ్రీకు తాత్వికులలో ఆర్ఫిక్ తత్వావలంబకులుండేవారు. వీరు తాపసులు పైథాగరస్ (క్రీ.పూ. 6వ శతాబ్దం) అనే సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడీ ఆర్ఫిక్ పంథాను పెంపొందించినాడు. వీరికి షమనులు అనే పేరు[12] పాశ్చాత్య రచయితలు పెట్టిరి. షమనుల నుండి, నవ్య ప్లేటోనిస్టులు, ఆద్యక్రైస్తవ సన్యాసులు ఆశ్రమవాసాన్ని తాపస జీవితాన్ని నేర్చుకొనిరి. ఈజిప్టు, కాన్‌స్టాంటినోపుల్, జెరూసెలెంలో అరబ్బులు క్రైస్తవ సన్యాసులనుండి ఈ జీవిత విధానాన్ని అవలంబించిరి. ఇట్టి అరబ్బులకు హనీఫు లని పేరు. ఏబ్రహాం (ఇబ్రహీం) ప్రవక్త హనీఫు అని ఖురాను ఉవాచ (2 129) ఇట్టి హనీఫులు ఇస్లాం మతం పూర్వంనుండీ వున్నారు. మహమ్మదు ప్రవక్తవారి మీద హనీఫుల ప్రభావ మున్నదని చరిత్రకారు లంటున్నారు. ప్రవక్తవారూ కొండ గుహలో ఏకాంతంగా మౌనంగా ధ్యానించడం, జాగరణ, ఉపవాసం చేయడం సుప్రసిద్ధం. ఉపవాస మాసమైన రమజాను నెలలో 27వ నాడు ప్రవక్త వారికి జిబ్రిల్ అంటే గేబ్రియలు అనే దేవదూత ద్వారా అల్లా సందేశం ప్రబోధమాయెను. అల్లా-భగవదను

ప్రవక్తత్వం పొందిన మొదటి మానవుడు మహమ్మదు ప్రవక్తవారె కావున వారే మొదటి సూఫీ అనవచ్చును. మహమ్మదు ప్రవక్తవారినే అల్లా తన సందేశహరునిగ ఎన్నుకొనినారు. ఇది సూఫీతత్వంలో మూలాంశము. అందుకే అన్ని సూఫీ పరంపరలు తమ గురు శిష్య పరంపరను ప్రవక్తవారివరకూ చెప్పుకొంటారు.[13] సూఫీ పరిభాషలో గురుశిష్య పరంపరను సిల్‌సిలా అంటారు. ప్రాచీన కాలంలో "సూఫీ" పదం లేదు. ఇటీవల 150 ఏండ్లనుండి పాశ్చాత్య (ముఖ్యంగా జర్మను) విద్వాంసుల పరిశోధక గ్రంథాలు "సూఫీజం" అనే మాటను ప్రచారంలోకి తెచ్చినవి[14]. సూఫీ తత్వజ్ఞులకు ఆ సంప్రదాయానుసారంగా వలీ, ఔలియా, పీర్, బాబా, ఖ్వాజా, ఫకీరు, దర్వేషు - అనే పేర్లు వర్తిస్తాయి[15].

## సూఫీతత్వ వివేచన :

* హిందువులకు "వేదాంతము" ఎట్లో ముస్లిములకు సూఫీ తత్వమట్లు.

* సూఫీ (జీవాత్మ) అల్లా (పరమాత్మ) తో తౌహీద్ అగుట సూఫీల పరమలక్ష్యం.[16]

* తౌహీద్, జీవబ్రహ్మైక్యము. భగవత్ప్రాప్తి-అల్లా సందం.

* ఈ ఐక్యము, జీవన్ముక్తి మరణానంతరం కాదు.

## రెండు మార్గాలు :

దైవప్రాప్తికి ఇస్లాము మతంలో రెండు మార్గాలున్నాయి.

* ఒకటి : 'మారిఫత్' - అందే జ్ఞానమార్గం.

* రెండు : 'మహబ్బత్' - ప్రేమ లేక భక్తిమార్గం.

## మూడు లక్షణాలు :

ఇస్లాములో మోక్ష సాధకులకు మూడు లక్షణాలుండవలెను. అవి: 'ఖుషు' అందే వినమ్రత, 'కరామత్' అందే ఔదార్యము, 'సిజద్' అందే సత్యసంధత.

## మూడు అంతస్తులు :

మతంలో మూడు అంతస్తులు, దశలుంటాయి.

* షారియా - బాహ్య స్వరూపము.

* హఖీఖత్ - సత్యము.

* తరీఖత్ - అధ్యాత్మమార్గం. ఇది తసవ్వుఫ్ (దివ్య జ్ఞానం)కు దారి.

## సూఫీల విశిష్టత :

సూఫీలు తమకు కష్ఫ్ (అంతర్జ్ఞానం) కలదంటారు. కేవలం ఖురాను పాఠం 'వహీ' (బాహ్యజ్ఞానం) అంటారు. అందుకే సూఫీలు తమను 'అహ లుల్ హ ఖీ ఖా' (సత్యవేదులు) అనీ షారియా పాఠం మాత్రం తెలిసినవారిని 'అహలుష్ షరియా' (షరియావేదులు) అనీ పిల్చినారు.[17]

## సూఫీ యోగం :

రాజయోగంలో వలె సూఫీయోగంలోనూ చక్రాలున్నాయి.

| రాజయోగం | సూఫీయోగం |
|---|---|
| సహస్రారం | హక్కియా |
| ఆజ్ఞా | ఖఫీయా |
| విశుద్ధ | రుహీయా |
| అనాహత | సిర్రీయా |
| మణిపూర | ఖల్బియా |
| స్వాధిష్ఠాన | నఫ్సీయా |
| మూలాధార | — |

## సూఫీ తత్వ స్వభావం :

దైవభీతి, 'ఖియామత్' (అంతిమ న్యాయవిచారణా దినం) భయం కల ముస్లిమును జాహిద్ అంటారు. వారి భక్తికి భయము మూల కారణం. సూఫీలు దైవప్రియులు. సూఫీల భక్తి, ప్రేమ స్వరూపము[18]. జాహిద్ అంటే వైరాగ్యం (జుహుద్) కలవారు. జాహిద్‌లకు ఖక్కావూన్ (దైవభీతి కలవారు) అని పేరు.

## సూఫీ మధురభక్తి :

సూఫీ-అల్లాల సంబంధం ప్రేమమయము అత్యంతిక భక్తి. జీవాత్మ ఆషిఖ్ అనే ప్రియుడు పరమాత్మ మాషుఖ్ అనే ప్రేయసిగానూ, లేక జీవాత్మయే మాషుఖ్ అనే ప్రేయసి, పరమాత్మయే ఆషిఖ్ అనే ప్రియుడుగానూ భావించడం కూడ కలదు. ఇది సూఫీ మధురభక్తి.[19] ఉమర్ ఖయ్యాం బాయిలలోని "నీవు" ప్రేమరూప అల్లాయే. "మధువు" భక్తిమాధుర్యం. "నీవు", "మధువు" సూఫీ భక్తితత్వంలో మరలా మరలా వస్తుండే కేంద్ర భావబిందువులు ("మోటిఫ్"లు)[20] సూఫీ మరణిస్తే అతని కాయాన్ని గోరీకి తీసుకొనిపోయేటప్పుడు క్రొత్త పెండ్లికూతురు (దుల్హన్) అత్తవారింటికి (ససురాల్) పంపేవిధంగా సంబరంగా ఉత్సవం చేస్తారు. భార్య (సూఫీ)

కర్త (అల్లా) దగ్గరికి పోతున్నట్లు సంకేతం.[21] టర్కీ, అరబ్బీ, పర్షియన్, ఉరుదూ భాషలలో ఉండే అత్యుత్తమ కవిత్వాలు సూఫీతత్వ శోభాయమానాలు.

కొందరు సూఫీ కవుల పేర్లు :

పర్షియన్ కవులు :

'జలాలుద్దీను రూమీ' (13వ శతాబ్దం); మస్నవీ-యే-మస్నవీ అనె గ్రంథం వ్రాసినాడు. దీనిని "పర్షియన్ ఖురాను" అంటారు.

'హాఫీజ్ షిరాజీ' (14వ శతాబ్దం) "దివాన్" అనే గ్రంథం వ్రాసినాడు ఈయన కవిత్వంలో అర్థం మూడంతస్తులలో ఉంటుంది అత్యుత్తమ వస్తు సూఫీతత్వ ప్రతిపాదకము.

'అత్తరీ నిషాపురి' (16వ శతాబ్దం)

'ఉమర్ ఖయ్యాం' (12వ శతాబ్దం).

'సాదీ షిరాజీ' (13వ శతాబ్దం).

'అమీర్ ఖుస్రో' (14వ శతాబ్దం). ఈయన మనదేశం వాడు. పహేలీలకు ప్రసిద్ధి. ఈయన గ్రంథం 'పంచ గుంజ్' రూమీ కవితను పోలుతుంది

ఉర్దూ కవులు :

'గాలిబ్' (19వ శతాబ్దం).

ఖ్వాజామీర్ దర్ద్ (18వ శతాబ్దం). 'దివాన్-ఏ-ఉర్దూ' అనే కవిత వ్రాసినాడు.

నజీర్ అక్బరాబాది (19వ శతాబ్దం).

హిందీ (అవధ్, వ్రజ భాషలు) కవులు :

'మాలిక్ మహమ్మద్ జాయసి' (16వ శతాబ్దం). అవధీ భాషలో 'అఖ్రావత్' వ్రాసినాడు.

'రహీం' (16వ శతాబ్దం). వ్రజ భాషలో 'రహీం దోహావలి' వ్రాసినాడు.

'రాస్‌ఖాన్' వ్రజ భాషలో రాధాకృష్ణభక్తి మీద వ్రాసినాడు. ప్రేమవాటిక, సుజనరాస్‌ఖాన్ ఈయన కవితలు.

సూఫీ మోక్షసాధన సామగ్రి :

* ఇస్లాము శరణాగతి మతము, శాంతిమతము. ఇస్లాము పదము అర్థము శరణాగతి.[22]

* సూఫీ లక్ష్యం భగవదైక్యం. దీనిని తౌహీద్ అంటారు.

* అల్లా దయ ముఖ్యం. దీనిని అహ్వాల్ అంటారు.

* భగవంతుని కరుణా కటాక్షానికి వేచివుండుటను తర్ఫ్ అంటారు.

* సూఫీతత్వం గురుమతం. సూఫీల గురువు[23] షయక్ లేక షేక్. ఈ పదం శిక్షక పదాన్ని పోలుతుంది.

* సూఫీలకు గురుపరంపర ఉంటుంది. దీనికి 'సిల్‌సిలా' అని పేరు.[24]

* సూఫీ జ్ఞానం కితాబులు చదివితే రాదు తర్కిస్తే రాదు. గురుసాన్నిధ్యం, ఆయన కటాక్షం వల్లనే వస్తుంది.

* గురువు పాఠాలు చెప్పడు మౌనం ద్వారా అనుష్ఠింప జేస్తాడు శిష్యుడు ఒక సాధకుడు - అప్రెంటిస్ వంటివాడు. ఇట్లు గురు శుశ్రూషకు చేర్చుకొన్న వారిని 'మురీద్, ఇఖ్వాన్, దర్వేష్, ఫకీర్' అంటారు[25] వీరే ఆధునిక పరిభాషలో సూఫీలు అని పిలువబడుతున్నారు.

* సూఫీ కాదలచిన వాడు గురువు దగ్గర మూడేండ్లు శుశ్రూష చేస్తే, ఆ అంతేవాసి శిష్యునికి చింపిరి నీలంరంగు గుడ్డను ధరించేందుకిస్తారు. ఈ గుడ్డకు ఖిర్కా అని పేరు. అరబ్బీ భాషలో ఖిర్కా అంటే చింపిరిగుడ్డ. ఖిర్కా, ఫకర్ (పేదరికం)కు చిహ్నం. నీలం రంగు అంటే పైకామకు చాలా భయం. నీలచేలధారియగు సూఫీని మభ్యపెట్టజాలడు. ఖిర్కా సూఫీకి బాహ్యచిహ్నం మాత్రమే. నిజంగా సూఫీ తన హాల్కా లేక హలఖా ద్వారానే సువిదితు డవుతాడు. హాల్కా (హలఖా) అంటే అరబ్బీ భాషలో అంతర్జ్యోతి అని అర్థం.[26]

సూఫీ మకాములు :

తౌహీద్ (భగవత్ప్రాప్తి) పొందేందుకు సూఫీ చాలా దూరం పయనించవలసి ఉంటుంది. ఆ మధ్యమార్గంలో వచ్చే మజిలీలే మకాములు.[27]

* ఫనా : అహంకారాన్ని అణచి వేయుటను ఫనా అంటారు. దీనివలన ప్రాపంచిక బంధాలు తెగిపోతాయి. ఫలితం నిస్సంగత్వము.[28] దీనిని బహుద్ అంటారు.

* హాల్ : స్థితి అని అర్థము. భగవదన్వేషణలో కరచు కలిగే ఆధ్యాత్మ స్పృహ.

# ‘ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?’’

“పోయిందే!”



మెరుపరచబడిన అమృతాంజన్ వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు

తలనొప్పులను వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా ఉపశమింపజేయగలదు'

## మేలుపరచబడిన
# అమృతాంజన్



utanjan Limited

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

* హకీకత్ : సత్యం అని అర్థము. తన వలన విష్వంగత్వము, సాధకునకు హకీకా లభిస్తుంది. హకీకా (సత్యం) అంటే అల్లాతో (కలయిక)."

* మకాం : అరబ్బీ భాషలో నివాసం అని అర్థం.

* తౌబా : పశ్చాత్తాపం
* వర : దైవభీతి
* జాహుద్ : విష్వంగత్వము
* ఫకర్ : పేదరికము
* సబర్ : సహనము
* తవక్కుల్ : శరణాగతి
* రిజా : ఫలప్రాప్తి

ఇవి సూఫీ చేరుకొనే పోయే మకాములు (అధ్యాత్మ దశలు) మజిలీలు.

మకాం పర్యవసానంగా సూఫీకి తాత్కాలికంగా అహవాల్ (భగవంతుని కృప) లభిస్తుంది.

* ముజాహదా : ప్రయత్నం అని అర్థం. ఉపవాసాది నియమాల పాలనే ముజాహదా. దీనివలన అహ్వాల్ (చూ. ఇంతకుముందు) శాశ్వతంగా ఉండిపోతుంది.

* ముషాహదా లేక ముహరాద్ : "దర్శనం" సూఫీ దేవుని దగ్గరకు చేరగలిగితే (ఈ స్థితిని కుర్బ అంటారు). అల్లా, సూఫీ హృదయంలో దర్శనమిస్తాడు. ఈ దైవ దర్శనానికి 'మారిఫతుల్ అల్బ' అంటారు

* షద్ : సూఫీల దివ్య, మార్మిక వచనాలకు షతహాత అంటారు. వీరి మాటలు పామరులకు గర్విష్ఠులకూ అర్థం కావు. పైపెచ్చు తప్పుగా కూడా అర్థమై ప్రమాదాలకు దారితీసినవి. హుసేన్ ఇబన్ మన్సూర్ అల్ హల్లాజ్ (పర్షియా దేశీయుడు) సూఫీలలో సర్వశ్రేష్ఠునిగా పరిగణింపబడుతున్నాడు. ఈయన అల్లా చింతనామృతమత్త చిత్తతలో అనా అల్ హక్ ("నేనే సత్యస్వరూప పరమాత్ముడను") అని ప్రకటించగా, అప్పటి ప్రభుత్వం ఈయనను ఉరి తీయించింది (క్రీ.శ 922). మానవుడు అతడే (హువహుప) అంటే మనిషే దేవుడు అని అర్థం.[30]

సూఫీల ప్రవచనాలు చోద్యంగా ఉంటాయి. మచ్చుకు కొన్ని సూఫీ సూక్తులు: ఇవి సూత్రాలవలె క్లుప్తములు.

"నిజమైన అల్లా ప్రేమకి ప్రార్థన అవరోధమే అవుతుంది"
—అల్ హల్లాజ్

"నాకు నై, నేనెంత గొప్పవాడిని"
—బాయజీద్ అల్ బిస్తామి క్రీ.శ. 874

"దేవుడున్నాడనేందుకు నేనే సాక్షిని"

"దైవశక్తి రహస్యమైనది. దానిని చెప్పితే ప్రవక్త మతం మారుస్తాడు."
—ఇబన్ సహల్ అల్ తుస్తరీ, క్రీ.శ. 896

"కర్మకాండలన్నీ అపవిత్రములు"
—అష్ షిబ్లీ 945

"నా వస్త్రంలో ఉండేది దేవుడే" అంటే నేనే దేవుడను అని అర్థం. —ఇబన్ అబీ అల్ ఖైర్ క్రీ.శ. 1048

"సేవకుడు ప్రభువు, ప్రభువు సేవకుడు ఇందులో ఎవరు బాకీదారుడో ఎట్లు చెప్పగలము?
—ఇబన్ అల్ అరబీ క్రీ.శ. 1240

* తరీఖా : "మార్గం" అని అర్థం. హక్ (సత్యము) వైపు కొనిపోయే మారిఫాత్ (జ్ఞానమే) తరీఖా.

సూఫీ తరీఖా (మార్గము)లు :

* సమా : "వినుట" అని అర్థము. భగవంతుని గురించి వినుట.[31]

* జికర్ : "మననం" అని అర్థం. ఇది స్మరణభక్తి. అల్లాను స్మరించుము అని ఖురాను ఆదేశిస్తుంది. అందలి పదం ఉజ్ కురు (స్మరించుము). ఖురాను 18:24, 33:41.[32] జపమాల (తెస్బి)తో మౌన మననమునకు జికర్ ఖఫి అంటారు. కీర్తన రూపస్మరణమునకు జికర్ జహ్రి (జలి) అంటారు. అల్లా నామ పునః పునః స్మరణ ఖురాను సూరాలను వల్లించుటో, అల్లా ప్రశస్తి పొగడుటో అయివుంటుంది.[33].

సూఫీల జప వాక్యాలు :

అల్లాహు అక్బర్ : అల్లా సర్వోత్తముడు[34] దేవఏవ పరః

లా ఇలాహ ఇల్లల్లాహ్ : అల్లాకంటే వేరే దైవం లేడు.[35]

అల్ హమ్దులిల్లాహ్ : అల్లాకీ జై.[36]

మహామదు-ర్రసూలుల్లాహ్ : మహమ్మదు అల్లా ప్రవక్త.[37]

అస్తఘ్ఫిరుల్లా : దేవా నన్ను క్షమించుము.[38]

( ఇంకా ఉంది )

**అల్లో జ్ఞాపికలు :**

1] హిందూమతములోనూ దేవుడు ఒక్కడే. "ఏకోదేవ", "ఏకం సత్ విప్రా బహుధా వదంతి", "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ" అని శ్రుతులు.

2] "అంతిమ దినం" మీద క్రైస్తవులకు విశ్వాసం కలదు. దీనిని "డూమ్స్ డే" అనీ "డే ఆఫ్ జడ్జిమెంటు" అంటారు. హిందువులలో దేవుడు జీవులకు ఎప్పటికప్పుడు వారి జన్మలలో కర్మ సిద్ధాంతానుసారం పుణ్య పాపఫలాల నిస్తాడు.

3] హిందువుల శ్రీకృష్ణుడూ అంతే. శ్రీకృష్ణుడు తన ఉపదేశాన్ని (భగవద్గీత) అర్జునునికి చెప్పినట్లు సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పినట్లు వైశంపాయనుడు జనమేజయునకు చెప్పినట్లు సూతుడు శౌనకాది ఋషులకు చెప్పినట్లు వ్యాసుడు మనకు చెప్పినాడు.

4] దీనినే "ఆనందో బ్రహ్మ" అన్నారు ఉపనిషత్తులలో. దీనిని ఇస్లాం విషయంలో, "అల్లానందం" ("బ్రహ్మానందం" వలె) అనవచ్చును. అల్లా ఉపనిషత్తులలోని బ్రహ్మ పదార్థంగా వర్ణించబడినాడు. "అల్లోపనిషత్తు"నందు అల్లోపనిషత్తు 108 ఉపనిషత్తులలో చెప్పబడలేదు. దీనిని అక్బరు చక్రవర్తి కాలంలో సంస్కృతం తెలిసిన ముస్లిములు వ్రాసినారు అని కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము (2వ సంపుటము, 557 - 558 పుటలు, 1934)లో వ్రాసిరి. అల్లోపనిషత్తును అబ్దుల్ కాదిర్ బదౌనియో లేక శౌకభావనుడనే కుహనా బ్రాహ్మణుడో వ్రాసియుండునని అభిప్రాయమై వుంది.

అల్లోపనిషత్తులోని కొన్ని మంత్రములు :

ఓం అస్ అల్లాం ఇల్లే మిత్రావరుణో దివ్యా నిధత్తే
ఇల్లల్లే వరుణోరాజా పునర్దదు
హలూ మిమితో ఇల్లాం ఇల్లల్లేతి

అల్లోజ్యేష్ఠం శ్రేష్ఠం పరమం పూర్ణం బ్రహ్మణమల్లా
అల్లోః అసుర మహామద రకం వరస్య అల్లో

ఇల్లా కబర ఇల్లా కబర ఇల్లల్లేతి
ఇల్లల్లాః ఇల్లా ఇల్లల్లా అనాది
స్వరూపా అథర్వణీ శాఖాం హ్రాం హ్రీమ్

అల్లోపనిషత్తు అథర్వ వేదానికి చెందినదని భావం.

5] హైందవ భక్తులకూ వేదాలు, పురాణాలలోని దేవుళ్లే ధ్యేయులు.

6] ఆదిశంకరుడు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అన్నారు. కర్మ, జ్ఞానమార్గాలు కష్టతరములు.

7] "గీత" నిర్వచించిన "స్థితప్రజ్ఞుడు" యోగవాసిష్ఠం చెప్పిన "జీవన్ముక్తుడు" - సూఫీ. మన గ్రంథాలలో వచ్చే రైక్వుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు, జనకుడు, జడభరతుడు, శ్రీకృష్ణచైతన్యుడు, రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి వంటివారు సూఫీ లనవచ్చును.

8] సూఫీలు ఈ ప్రేమను "మహబత్" అంటారు. క్రీస్తుకు, ఆయన అనుయాయులకూ మధ్యకల సంబంధాన్ని "అగపా" అంటారు. "అగపా" లేక "అగపే" గ్రీకు భాషా పదం. బైబిలు (క్రొత్త ప్రకరణం)లో ఈ పదానికి ఆధ్యాత్మ అర్థాన్ని ఇచ్చినారు.

క్రీస్తుకూ అనుయాయులకూ కల "అగపా" (ప్రేమ) ఈ యీ రూపాలను ధరిస్తుంది.

| క్రీస్తు | అనుయాయులు |
|---|---|
| నాయకుడు (భర్త) | నాయికలు (భార్యలు) |
| అన్న | తమ్ములు-చెల్లెండ్రు |
| తండ్రి | సంతానం |
| గొర్రెలకాపరి | గొర్రెలు |
| వైద్యుడు | రోగులు |
| పాపహరుడు | పాపిష్ఠులు |
| ఐచ్ఛిక బలిపశువు | బలి ఇచ్చినవారు |

9] ధరించే వస్త్రాలబట్టి పేర్లు కలవారు : దిగంబరుడు అంటే ఈశ్వరుడు. ఈ మాటకర్థం వస్త్రాలు కట్టనివాడు! పీతాంబరుడు (శ్రీకృష్ణుడు), అజితకేశ కంబళి శ్వేతాంబరులు (జైనులు), కాషాయాంబరులు (సన్యాసులు) కంబళీవాలా మహారాజ్ (ఆధునిక యోగి), లంగోటీవాలా.

10] శ్రీ వైష్ణవ సంప్రదాయంలో దేవుడే భక్తుని ఎన్నుకొనే ఉదంతాలు కలవు. ఉదా: విప్రనారాయణ, నిగమశర్మల చరిత్రలు. ఎప్పుడైతే దేవుడు వీరికి మోక్షం ఇచ్చేందుకు నిర్ణయించెనో అప్పుడు వారి నడవడి విచిత్రంగా అనూహ్యంగా మారింది. ఇంగ్లీషు కవి ఫ్రాన్సిస్ థాంప్సన్ వ్రాసిన "హవుండ్ ఆఫ్ హెవెన్" అనే మార్మిక వేదాంత కావ్యంలో దేవుడే వేట కుక్క అయి ("శౌన పరమాత్మ") పారిపోయే భక్తుని తరిమి తరిమి పట్టుకొని అక్కున చేర్చుకొంటాడు. బైబిలు (పూర్వ ప్రకరణం)లోని ప్రవక్త జాబ్ (అయోబ్) కథలో దేవుడెన్ను

కొన్న భక్తుని వింత నడవడి వర్ణితము "మన చలో నిజనికేతనే" అనే పాటను రామకృష్ణ పరమహంస సమక్షంలో నరేంద్రనాథుడు పాడగనే రామకృష్ణుడు నీకోసమే కాచుకొని వున్నాను అంటూ వాణ్ణి తన కర కమల సంజాతుని (శిష్యుణ్ణి)గా చేసెను. వాడే స్వామి వివేకానందుడు.

11] సూఫీ తత్త్వం ప్రేమతత్వమన్నాను నారద భక్తి సూత్రములలో భక్తి పరమప్రేమరూపమనీ (సూ2), ఆ ప్రేమ స్వరూపం అనిర్వచనీయమనీ (సూ51) ఉంది భగవత్ ప్రేమ రూపమైన సూఫీతత్వమూ అనిర్వచనీయమని భావం.

12] "షమన" శబ్దం "శ్రమణ" (స) శబ్దభవం. బౌద్ధ సన్యాసులను శ్రమణులంటారు. శ్రమణ శబ్దం "శత పథ బ్రాహ్మణం"లో కలదు పాశ్చాత్యుల దృష్టిలో షమనుడు యోగి, తపసి, మాంత్రికుడు, వైద్యుడు, అద్భుత మహిమాన్వితుడు. షమనులలో ఒక సమాన పద్ధతి కనపడుతుంది. సామాన్య మానవుడు - ఏదో మానసికమైన ఆందోళన-కొండ గుహలోనో, అడవిలోనో బహుకాల ఏకాంతం-జాగరణ- ఉపవాసం-ధ్యానం-జ్ఞానోదయం- లోకంలోనికి వచ్చుట- జ్ఞానబోధ- "షమనుడు"గా మారుట. బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, అరవిందుడు, రమణ మహర్షి, సత్య సాయిబాబా మున్నగువారి జీవితంపై ప్రణాళికను అనుసరిస్తుంది. షమనుల బోధలు, పరిభాషలో క్రొత్తగా ఉంటాయి కానీ భావంలో అంతకుముందున్న భావజాలమే ఉంటుంది. ఇది తక్కువ చేయడం కాదు ఉన్నతజ్ఞానం నిరంతరవాహిని వంటిది అని చెప్పడమే నా ఉద్దేశం.

13] మనవారి గురుశిష్య పరంపరా ఇట్లే ఉంటుంది ప్రతియొక వేదాంత దర్శనంవారూ తమ గురుపరంపరను బ్రహ్మ వరకో, విష్ణువు వరకో, మహేశ్వరుని వరకో తీసుకపోతారు. ఉదా: భక్తి మార్గానుయాయులైన చైతన్యశిష్యులు తమ గురుపరంపరను ఇట్లు చెప్తారు చైతన్యుడు, ఈశ్వరపురి, మాధవేంద్ర, లక్ష్మీపతి, వ్యాసతీర్థ, బ్రహ్మణ్య, పురుషోత్తమ, జయధర్మ, రాజేంద్ర, విద్యానిధి, దయానిధి, జ్ఞానసింధు, జయతీర్థ, అక్షోభ్య, మాధవ, నరిహరి, పద్మనాభ మధ్వ బాదరాయణ, నారద, బ్రహ్మ, శ్రీకృష్ణ

14] మన మతం పేరునే తీసికోండి. దీనిని 'హిందూయిజం' అంటున్నాము. "హిందూ" మతమని పూర్వగ్రంథాలన లేదు "సింధు" నదిని ప్రాచీన పారశీకులు "హిందు" నది అన్నారు. హిందు నదీప్రాంతంలో ఉండేవారిని "హిందవీ" అన్నారు. ఈ పేరు దేశప్రజల కందరికీ వాడబడింది. వీరధిక సంఖ్యాకులు అనుసరించే మతానికి "హిందూయిజం" అనే పేరును తూర్పిండియా కంపెనీ పండితులు (సర్ విలియం జోన్సు), లాంటివారు పెట్టిరి. సర్వేపల్లి రాధాకృష్ణునివంటి స్వదేశ పండితులు "హిందూయిజం" అనే పేరుకు ప్రచారమూ, గౌరవమూ తెచ్చిరి. సూఫీజం అనే పేరు విషయంలో మాదిరే "హిందూయిజం" పేరు చరిత్రా దాదాపు 150 ఏండ్లు కలదే

15] ఇస్లాం మతంలో వ్యక్తిపూజ నిక్కచ్చిగా నిషేధించబడినా సామాన్య ముస్లిములు ఇస్లామిక పవిత్రాత్ముల జన్మస్థలాల లోనో గోరీల దగ్గరనో ఏటా "ఉర్సు" అనే ఉత్సవం జరుపుకొంటారు విశేషమేమంటే హిందువులూ ఈ ఉత్సవాలలో పాల్గొంటారు అజ్మీరులో మొయినుద్దీను చిష్తీ ఢిల్లీదగ్గర నిజాముద్దీను ఔలియా, గుల్బర్గలో వలీ బందె నవాజ్‌ల ఉర్సులు ఉదాహరణలు. ప్రతి పల్లెలోనూ చిన్నా పెద్ద వలీల, బాబాల ఉర్సులు జరుగుతూనే ఉంటాయి ముస్లిమేతర మతాలలో సూఫీలవంటి వారిని స్వామి, గోస్వామి, గోసాయి, బావాజీ, బైరాగి, సన్యాసి, సంత్, యోగి, ముని, సాధు, ఋషి, మహరాజ్, అవధూత, భిక్షు, ఉదాస్, నిర్మల్, ఆనంద, ఆచార్య, తీర్థ వంటి పేర్లతో పిలుస్తారు. ఇవి సమానార్థకాలు కావు.

16] అద్వైతాన్ని వదలితే, జీవుడు బ్రహ్మతో చేరిపోయే స్థితులను సారూప్య, సాయుజ్య, సాలోక్య, సామీప్యములని హైందవుల మతము. రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, శ్రీకృష్ణచైతన్య, వీరశైవమతా లుదాహరణాలు.

17] మనలోనూ వేదవిదులు (వేదపాఠం చేసేవారు) అనీ వేదార్థవిదులు (వేదంకు కల మూడర్థాలు తెలిసినవారు) అని ఉన్నారు. యాస్కాచార్యుడు తన "నిరుక్తం"లో కేవలం వేద పాఠం చేసేవారిని ఈసడించినాడు. పరిహాసమూ చేసినాడు.

18] నారద భక్తిసూత్రములు : "సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా" "భజనాత్మకం ప్రేమకార్యం ప్రేమైక కార్యం" అంటాయి.

19] మధురభక్తి జయదేవుడు, మధుసూదన సరస్వతి, వల్లభాచార్యుడు ప్రతిపాదించిరి. సృష్టి అంతా స్త్రీ అంశమే. దేవుడొక్కడే పురుషుడు- వీరి సంబంధమే మధురభక్తి. దీని ప్రకారం భక్తులందరూ ప్రియురాండ్రు. భగవంతుడు ప్రియుడు. మీరాబాయి, అక్కమహాదేవి, గోదాదేవి వంటి స్త్రీలేకాక నమ్మాళ్వారు, బసవేశ్వరుడు, శ్రీకృష్ణచైతన్యుడు వంటి పురుషులు కూడా తమను ప్రేయసిగానూ దేవుని ప్రియునిగానూ చెప్పుకొన్నారు. భార్య, ప్రేయసి, జారిణి అనే భావప్రతీకతో జీవ బ్రహ్మైక్యం ప్రతిపాదించే దన్ని మతాలలోనూ కనబడుతుంది. అతి ప్రాచీనం కూడా. ఋగ్వేదం ఇట్లంటుంది.

పాశ్చాత్యులలో ఇందుకు ఉదాహరణ:
"ముద్దులతో నా ముఖాన్ని ముద్దాడాలి నా ప్రియుడు" 10:43:1
(పతిని కౌగిలించే పతివ్రత నా బ్రెస్ట్‌ప్లెట్‌ చేరు చున్నది.)

బృహదారణ్యకోపనిషత్తు:

1. "యథా ప్రియయా స్త్రియా సం పరిష్వక్తో న బాహ్యం
కించన వేద న అంతరం ఏవ మయం
తద్వా అస్య ఏతదాప్త కామం ఆత్మకామం అకామం
రూపం శోకాంతరం" (4:2:21)

ప్రియురాలి కౌగిలితో ప్రియునికి బాహ్యాంతర జ్ఞానం పోయినట్లు, దేవుని పరిష్వంగంలో జీవునికి బాహ్యాంతర జ్ఞానముండదు. దానివలన జీవుడు ఆప్తకాముడవుతాడు. పరమాత్మే అతని కామము. ఆ దశలో జీవునికి ఏ కామమూ ఉండదు. ఏ శోకమూ ఉండదు.

2) "కామాయ పతిః ప్రియోభవతి...ఆత్మనస్తు కామాయ ప్రియోభవతి" (4 : 5, 6)

నారద భక్తిసూత్రము "యథా గోపికా జనానాం" అని జీవుని అభిసారికా నాయికగ వర్ణించింది. బైబిలులోని "సాంగ్ ఆఫ్ సాంగ్స్" (సాలమన్ గీత) సాలమన్ - షూలమిత్తుల ప్రణయం మధురభక్తి. ఏసుక్రీస్తు పెండ్లికొడుకుగానూ, అనుయాయులు వధువులుగానూ సూచించే వాక్యాలున్నాయి.

మత్తయి 9:14,15; మార్కు 2:19,20; లూకా 5:34,35 యోహాను 3:29.

జీవ, బ్రహ్మలలో ఎవరు స్త్రీ, ఎవరు పురుషుడు అనే ప్రశ్న వస్తుంది. దీనికి "దేవీగీత" ఉత్తరమిచ్చింది. "నైవస్త్రీ నపుమానేష నైవచాయం నపుంసకః" భగవంతుడు స్త్రీ కాడు, పురుషుడు కాడు, నపుంసకుడూ కాడు. భక్తుడెట్లా ఆరాధిస్తే భగవంతుడట్లా వశమవుతాడు. సూఫీ ప్రేమలో దేవుడు ప్రియుడైనా కావచ్చును. ప్రియురాలైనా కావచ్చును. కల్హణుని "రాజతరంగిణి"లో ఒక భక్తుడు దేవిని తనకు భార్య కమ్మంటాడు. ఈ కథను విశ్వనాథవారు "భ్రమర వాసిని" అనే నవలగా వ్రాసినారు.

20] వేదంలో "మధు విద్య", "మధ్వ" అనే మాటలు ప్రేమరూప మధుర రుచికర భగవంతునుద్దేశించినవి.

21] పెండ్లి తరువాత అప్పగింత పాటలు సుప్రసిద్ధాలు. కణ్వ మహర్షిలాంటివాడే అప్పగింత శోకం పాడి అందరినీ ఏడ్పించినాడు. (చూ. "అభిజ్ఞాన శాకుంతలము") కౌడ్ నవాబు వాజిద్ అలీషా (క్రీ.శ. 1850). "బాబుల్ మోరా" అనే అప్పగింత పాట (సూఫీతత్వ ప్రేరకం) వ్రాసినారు. ఈ పాటను సైగల్ "స్ట్రీట్ సింగర్" సినిమాలో భైరవి రాగం, దీపచండీ తాళంలో పాడినాడు. సంగీత దర్శకుడు ఆర్. సి. బోరల్. భారతదేశ సినిమా సంగీత చరిత్రలో ఇంతకంటే గొప్ప పాట లేదని సినిమా సంగీతజ్ఞులన్నారు.

22] అన్ని మతాలూ తుట్టతుదకు శరణాగతే గతి అంటాయి. అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ, శ్రీకృష్ణం శరణం మమ, ఈశ్వరుని తిరువడిగళే శరణం, శివశరణు, మామేకం శరణం వ్రజ, దాసోహం మయ్యర్పిత మనోబుద్ధి, సర్వమున్న తిని ఊతక్కళామయుమంటు; స్వామియే శరణమయ్యప్ప అని హిందువులు, బుద్ధం శరణం గచ్ఛామి అని బౌద్ధులు, అందరు నా దగ్గరికి, మీ ఆత్మలకు విశ్రాంతి నిచ్చెదను (మత్తయి 11:29), నేను భూమి నుండి పైకెత్తబడినప్పుడు అందరిని నా యొద్దకు ఆకర్షించుకొందును (యోహాను 12:32) అని క్రైస్తవుల మతం హామీ ఇస్తుంది. ఇవి శరణాగతి తత్త్వాలకు నిదర్శనాలు. బైబిలులోని అయోబ్ తుదకు యెహోవాను అంటే దేవుని శరణు చొచ్చినాడు.

23] హిందువులలో గురువుకు చాలా ప్రాముఖ్యం ఉంది. గురుర్ బ్రహ్మ, గురుర్ విష్ణు, గురుదేవో మహేశ్వర గురు సాక్షాత్ పరబ్రహ్మ, తస్మై శ్రీ గురవేనమః అనీ, మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ అనీ చెప్పినారు. "గీత" చెప్పినవాడు జగద్గురువు. కృష్ణం వందే జగద్గురుం. శిఖ్ఖులు దేవుని "వాహే గురు" అంటారు. వాహే గురు అంటే వహవ్వా గురూ అని అర్థం. చాలా గొప్పదైన గురువని అర్థము.

24] అనుశక్షణ (అంటే చెప్పేవానికి వినేవానికి మాత్రమే తెలిసే రహస్యం) ఉపదేశం మీద ఆధారపడిన మతాలూ, తత్త్వాలు "పరంపర"కు ప్రాముఖ్యాన్నిస్తాయి. "గీత"(4:2) ఇట్లంటుంది "ఏవం పరంపరా ప్రాప్తం ఇదం రాజర్షయోవిదుః" అని జ్ఞాన యోగానికి పరంపర ఉంది అంటుంది. "గురు పరంపరాయాతం అదృష్టం సర్వవాదిభి" అని "సర్వజ్ఞానోత్తరం" చెప్పుతుంది. అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత, వీరశైవ, శిఖ్ఖు, నాథ, అవధూత, యోగి మతాలలో, జైన, బౌద్ధమతాలలో గురు పరంపరలున్నవి. ఆశ్చర్యమేమంటే చార్వాక దర్శనానికి గురు పరంపర కలదు. చార్వాక మతానికి ఆదిగురువు బృహస్పతే అట!

25] సూఫీ గురూపదేశం రహస్యమైనది. రహస్య మంత్రాలన్ని మతాలలోనూ ఉన్నాయి. ఓం నమో నారాయణాయ అనేది శ్రీ వైష్ణవుల రహస్య మంత్రం. ఓం నమశ్శివాయ, అనే షడక్షరీ మంత్రం, నమశ్శివాయ అనే పంచాక్షరీ మంత్రం వీర శైవులవి. రాధా వతయే నమః అనేది కృష్ణభక్తుల మంత్రం. ఓం సత్ శ్రీ అకాల్ అనేది శిక్కుల మంత్రం. క్రీస్తు కూడా తన బోధనలు 12మంది శిష్యులకు మాత్రం అర్థమయ్యేటట్లు బోధించినాడు. తక్కిన జనానికి పిట్టకథలు (పారబుల్స్) చెప్పినాడు. బౌద్ధులు ఓం మణీ పద్మేహుం అనే రహస్య మంత్రాన్ని జపిస్తారు. శబ్దాలు పలుకలేని ఒక బోయవాడు మరామరామ అని మరలా మరలా పలుకుతూ మహర్షి(వాల్మీకి) గా మారినాడనే కథ ఉన్నది. సూఫీ గురువులు మౌనం ద్వారా జ్ఞానాన్ని ఇచ్చినట్లే దక్షిణామూర్తి స్తోత్రంలో మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్వం యువానాం అని ఉంది. మౌన వ్యాఖ్యానంతోనే దక్షిణా మూర్తి మునులకు పరబ్రహ్మ తత్వాన్ని ప్రకటిస్తున్నాడని అర్థం. వేదం "నిణ్యం వాచాంసి" (రహస్య వచనం) అంటుంది. "గీత" "య ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిదాస్యతి" (18:68) అని చెప్పింది. ప్రహ్లాదుడు "చదువులలో మర్మమెల్ల చదివితి" అంటాడు.

26] గురుకులంలో అంతేవాసిగా చేరిన బ్రహ్మచారికి ఉపనయనమై ఉంటుంది. దీనికి గుర్తు యజ్ఞోపవీతం డ్రెస్సు కౌపీనం (పుట్టగోచి). వీరు 12 ఏండ్లు శుశ్రూష చేసి బయటపడి గృహస్థాశ్రమం తీసుకొంటారు. జందెం బ్రహ్మచారికి బాహ్య చిహ్నం మాత్రమే. ఈ విషయంలో బ్రహ్మోపనిషత్తు ఇట్లా కుండ బద్దలు కొట్టినట్లు చెప్పుతుంది:

బహిః సూత్రం త్యజేద్ విద్వాన్
………… ………
బ్రహ్మ భావ మిదం సూత్రం
ధారయేద్యః స చేతనః
సూత్ర మంతర్గతం యేషా
జ్ఞాన యజ్ఞోపవీతినాం

విద్వాంసులు బాహ్యసూత్రాన్ని త్యజిస్తారు. బ్రహ్మభావమే సూత్రం. ఈ సూత్రం లోపలుంటుంది. అది జ్ఞానమనే యజ్ఞోపవీతము. అంటే, బ్రహ్మజ్ఞానమే జందెము అన్నమాట. సూఫీల హద్దా (అంతర్జ్యోతి) వేదంలో హృదయ గుహాగత "గూఢం జ్యోతి" అని పేర్కొనబడింది. బ్రహ్మతేజస్సిదే.

27] హైందవులలోనూ ఆత్మజ్ఞానం రావటానికి మోక్ష ప్రాప్తికి చాలా సాధనాలు, సోపానాలు, అంగాలూ వున్నాయి.

అద్వైతం - సాధన చతుష్టయం

విశిష్టాద్వైతం- పరమపద సోపానాలు (వివేక, నిర్వేద, విరక్తి, భీతి, ప్రసాదన, ఉత్క్రమణ, అర్చిరాది, దివ్య దేశప్రాప్తి, పరాప్తి - ఇది వేదాంత దేశిక ప్రోక్తం)

యోగం - యమ నియమాది అష్టాంగములు

బౌద్ధం- సమ్యక్ (దృష్టి, సంకల్ప, వచన, వ్యవహార, ఆజీవ, వ్యాయామ, స్మృతి, సమాధులు). ఇవి "నిబ్బాణ" (నిర్వాణ) మార్గములు.

వీరశైవం- శివసాయుజ్యానికి షట్ స్థలాలు: భక్త, మహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములు.

ముముక్షువు అవస్థను ఒక యాత్రగ వర్ణించుట కలదు. జాన్‌బన్యన్ కృత (17వ శతా) "తీర్థయాత్రిక పురోగతి" అట్టి సంకేత గ్రంథం. ప్రబోధకుమార్ సన్యాలు బెంగాలీ నవల "మహా ప్రస్థానేర్ పథే" భగవదన్వేషి యాత్రయే. దీనిని సినిమా తీసిరి (1953). సినిమా ("యాత్రిక్") వేదాహ మేతం పురుషం మహాంతం అనే మంత్రంతో ముగుస్తుంది.

28] "గీత" ఇట్లంటుంది: (18:53)

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మ భూయాయ కల్పతే

అహంకారం మున్నగువానిని వదలిపెట్టి, మమకారం లేకుండా శాంతం కలవాడు బ్రహ్మభావాన్ని పొందుతాడు. "గీత" ఇంకొక చోట (18:17) యస్య నాహంకృతో భావో అంటుంది.

నారద భక్తిసూత్రం (సూ. 64) అభిమాన దంభాదికం త్యాజ్యం అంటుంది. రమణ మహర్షి, జిల్లెళ్ళమూడి అమ్మ "నేను"ను వదలండి అని చెప్పేవారు. నేను అనేది అహంకారం. "నేను" లేకపోతే నీవూ లేవు. అంతా భగవన్మయమే.

29] ఉపనిషత్తులు "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అన్నాయి. షేకుతోడి చెలిమి సత్సంగం అయితే, అది జీవన్ముక్తి నిస్తుంది. భజగోవింద శ్లోకం ఇట్లంటుంది:

సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తి

30] మనలోనూ భక్తులు రెండు విధాలు. తమను తామే మరచిపోయి ఎల్లప్పుడూ దైవధ్యాన కలవారు. భక్తిని "అతి"గా శాక సమపాళంగా కలవారు. ప్రహ్లాదుడు "అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత పాన విశేషమత్త చిత్తము" కలవాడు. "వైకుంఠ చింతా వివర్జితచేష్టుడై, యొక్కడు నేడుదు నొక్కచోట". సూఫీల "సుకర్" (భక్తిమత్తత) ప్రహ్లాదున కుండెను. నారద భక్తిసూత్రము "యత్ జ్ఞాత్వా మత్తోభవతి స్తబ్ధోభవతి, ఆత్మారామో భవతి" అనింది.

"ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావాన్ ఏషబ్రహ్మ విదాం పరిష్ఠః" అని శ్రుతి. అంబరీషుడు ఎప్పుడూ "హరి" అంటుంటాడు.

వీరు మత్తచిత్త భక్తులు. ఇక పుండరీకుని వంటి భక్తులు సమచిత్త భక్తులు. శ్రీకృష్ణుడు ఎదుట వచ్చి నిలిచినా ఆయనతో లెక్కాచారంగా పంచాయితీ చేసి ఇక్కడనే ఉండిపో. ఈ క్షేత్రానికి నా పేరు పెట్టుకొమ్మని పాండురంగ విఠలునితో ఒప్పందం చేసికొంటాడు పుండరీ(లీ)కుడు. అల్ హల్లాజ్ వాక్యం అనా-అల్‌హక్ (నేను సత్యమును అంటే భగవంతుడను) అనేది మన "అహం బ్రహ్మాస్మి", "అయం ఆత్మాబ్రహ్మ", "శివోహం", "త్వమేవాహం", "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అనే ఉపనిషద్వాక్యములను బోలుతుంది. హంవ హంవ (మనిషు దతదే) అనే వాక్యం "తత్వమసి" (అది నీవు అయితివి) అనే వాక్యాన్ని పోలుతుంది. అల్ హల్లాజ్ ఉద్దేశించిన "సత్యము" ఏది? హిరణ్మయేన పాత్రేణా సత్యస్యా పిహితం ముఖం" అని ఈశావాస్యోపనిషత్తు చెబుతుంది. బంగారు కప్పెరతో మూయబడిన ముఖం కల బ్రహ్మయే సత్యము. వేదం దేవుని "ఋతవాన్" (సత్యవంతుడు) అంటుంది. "నేను సత్యమును తీసుకవచ్చినవాడను" అని క్రీస్తు అంటే పిలాతు సత్యం అంటే ఏమిటి అని అడుగుతాడు. జవాబుకై వేచివుండక క్రీస్తు ఉరికి ఆర్డరు ఇస్తాడు. నా అంతర్వాణి చెప్పిందే నాకు ప్రమాణం అన్న సోక్రటీసుకు విష పానీయం దక్కింది. కానీ "సత్యమేవ జయతే, నానృతం" అని ముండకోపనిషత్తు.

31] శ్రవణభక్తి 9 భక్తిమార్గాలలో ఒకటి. అవి:

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనం

"ప్రాణేశ నీ మంజుభాషలు వినలేని, కర్ణరంధ్రంబుల కలిమి యేల" అంటుంది రుక్మిణి. (భాగవతము)

32] దైవస్మరణ కీర్తనాలకు హిందూమతంలో చాలా ప్రాముఖ్యం కలదు. "క్రతో స్మర, కృతంస్మర" అంటుంది ఈశావాస్యోపనిషత్తు. "గీత"లో శ్రీకృష్ణుడు "అనన్యాశ్చింతయంతో మాం, యోగక్షేమ వహామ్యహం (9:22) అని హామీ ఇచ్చినాడు. అల్లా, ఖురానులో ఉజ్కురు అంటే శ్రీకృష్ణుడు గీతలో "మాం నమస్కురు" (9:34) అన్నాడు.

కృతయుగంలో ధ్యానం, త్రేతాయుగంలో యజ్ఞము, ద్వాపరయుగంలో అర్చన, కలియుగంలో కీర్తన ముక్తిదాయకా అని "విష్ణుపురాణం". "నారద భక్తిసూత్రములు", "లోకేపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్", "అవ్యావృత భజనాత్" అని అంటాయి. వేదం కూడా శ్రవణ, మననాలను మన్నిస్తుంది.

ఉదా: "భద్రం శ్లోకం శ్రూయసాం", "మనామహే చారుదేవస్య నామా" కీర్తన మహిమను భాగవతం ఇట్లా కీర్తిస్తుంది.

బ్రహ్మ హత్యానేక పాపాటవుల కగ్నికీలలు హరినామ కీర్తనములు (6:118) శబ్దపూర్వక కీర్తన, భజన అనే పద్ధతులు తేలినవి.

భారతీయ సాహిత్యంలో ఉత్తమ సాహిత్యమంతా దైవ నామ కీర్తన అనిపిస్తుంది. చిన్న జాబితా ఇస్తాను.

| భాష | కీర్తన రచనలు |
| --- | --- |
| సంస్కృతం | సామవేదం, రామాయణం, గీత గోవిందం, సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనలు, కృష్ణలీలా తరంగిణి, కృష్ణకర్ణామృతం. |
| అస్సామీ | శంకరదేవ, నారాయణదేవుల గీతాలు. |
| బెంగాలి | విద్యాపతి, చండీదాసుల పదావళులు, రామప్రసాద సేనుని కీర్తనలు. |
| హిందీ | తులసీదాసు, సూరదాసు, రవిదాసు, బాబాఫరీదు, దాదూ, మీరాబాయి, కబీరు. |
| కాశ్మీరీ | లల్లా యోగీశ్వరీ, హబ్బాఖాతూన్. |
| గుజరాతీ | నరసింహ మెహతా, దయారాం |
| తెలుగు | అన్నమయ్య, రామదాసు, క్షేత్రయ, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, త్యాగయ్య. |
| కన్నడం | కన్నడ హరిదాస పదములు, వీరశైవుల "వచనములు". |

మరాఠీ : "అభంగ్" అనే కీర్తనలు, నామదేవ, తుకారాం, గోరాకుంభారు మొదలగువారి కీర్తనలు.

తమిళం : నాయన్మారుల తేవారం అనే శివగీతాలు, ఆళ్వారుల పాశురములు అనే విష్ణుకీర్తనలు.

సిక్కుల వేదం "గురుగ్రంథ సాహెబు"లోని "శబద్"లు హరినామ కీర్తనములు.

తుదకు రవీంద్రనాథ టాగోరు "గీతాంజలి" నిరాకారేశ్వరుని కీర్తనయే.

33] హిందువులు హరి ఓం, హరేరామ హరేరామ కృష్ణ కృష్ణ హరే హరే, విఠల, ఓం నమశ్శివాయ, సాయిరాం సాయిరాం వంటి వానివి మననం చేసుకొంటారు. బౌద్ధులు "ఓం మణి పద్మేహూం" అని జపిస్తారు.

34] మాధ్వులు హరి సర్వోత్తముడు అన్నట్లు.

35] వైష్ణవులు ఏకో నారాయణో హరిః అన్నట్లు.

36] జై సంతోషిమా, జయ జయ జయహే భారత భాగ్య విధాతా అన్నట్లు.

37] మాధ్వులు "వాయు జీవోత్తమ" అన్నట్లు వాయువు జిబ్రీల్ వంటివాడు. హరి వాయువుకు, వాయువు హనుమంతునికి, హనుమంతుడు భీమునికి, భీముడు మధ్వునకూ బోధించిరని మాధ్వ సంప్రదాయం. ఈ సాదృశ్యం వలన "మధ్వ మతం తురకమతం" అనే సామెత కూడా చెలామణిలో ఉంది. ఈ సామెతను డా॥ చిలుకూరి నారాయణరావుగారు సంపాదించిన 1 లక్ష సామెతలలో చూచినాను

38] గజేంద్రుడు "మన్నింపదగున్ దీనుని" అన్నట్లు.

[షంషీ పుంజీ]

# "మత్తు" కోకిల

మత్తకోకిల :-

చిత్తుగా నువు తప్పతాగితి వింతమైకము నిన్ను క
మ్ముకొన్నదే కద నువ్వు తాగిన దెంత భాగ్యము నీకు మా
లైత్తెనో కద గెంతులెన్నియొ వేయుచుంటివి నీకు నే
మత్తులో జరుగేమియోనని మాకు కష్టము తోచగా

తేటగీతి :-

భ్రష్టు పట్టును నీదు శరీర ముడిగి
పోవు నీ జవసత్త్వము గొంతురాదు
మెప్పు పల్కరించరు పిచ్చికొమ్మ
లాంటి చెప్పుచున్నాను దుర్లక్షణమ్ము.

నవారా

# స్మృతి మౌక్తికం

అనంతకాల జలదం
అవిరామంగా వర్షిస్తోంది
క్షణాల చినుకులు
జీవిత సాగరాన కురుస్తున్నాయి
అనుభవాల ఆలిచిప్పల్లో
రాలిన ప్రతి బిందువు
మనో శుక్తి గర్భంలో దాగిన
మధురస్మృతి మౌక్తిక మౌతోంది.

శ్రీ కె. దినకర్

# వెండి వేకువ

నిన్న రాత్రి నిద్రపోయానా-
నా కనురెప్పలమీద నీ గజ్జెలచప్పుడు!
విశ్వవేదికమీద నర్తించే
అభినవ చాంద్రీ ధవళ విగ్రహంలా
నీ పదస్పర్శతో నాలో
గోగులు పూయిస్తున్నావు
పూలవాగులు ప్రవహింపజేస్తున్నావు.

"నువ్వెవరివి? నువ్వెవరివి?" అంటూ
గొంతు చీల్చుకుంటూ ఎన్నిసార్లు అడిగాను నిన్ను?
చెప్పావా ఒక్కసారైనా జవాబు-
రెప్పలార్చుకుంటూ చూడటం తప్ప
పెదవి పగడంమీద ముత్తెపు నవ్వు
మెరిపించుకోవటం తప్ప!

నువ్వొక మౌనరస వర్షానివి.
ఎందుకో ఒక్కొక్కసారి
కస్తూరి రేఖల్లాంటి కనుబొమల్ని
విషాదంతో ముడి వేసుకుంటావు
అప్పుడు నువ్వు అక్షరాలా కృష్ణపక్షానివి.
రింగులు రింగులుగా తిరుగుతున్న
అగరు పొగలోంచి
జుట్టు ఆరబోసుకుంటూ కనిపించే నువ్వు
నీలిమబ్బు పరదాలో మెరిసే ఖవాలీవి.

భావంలాంటి నిన్ను
సజీవ దేహంలా చూడాలని కళ్ళు తెరిచానా-
ఒక్క గంతుతో - నున్నగా
కొబ్బరి మొవ్వులోకి జారిపోయావు.
వేల వేల పక్షుల గొంతులతో
కిలకిలా నవ్వావు
వెండి వేకువలా నన్ను వక్షానికి హత్తుకున్నావు.

# నేపథ్య రథ్య

అది ఒక పరిమళ ధ్వని
అది ఒక పవిత్ర జ్ఞాపకధుని.

పర్వత శిఖరాలనుంచి
కరిగివచ్చే సంగీత ప్రవాహంలా
మౌనంలోంచి మనస్సులోకి
మనస్సులోంచి మాటల్లోకి
పూలమెట్ల మీదుగా
మెత్తగా నడచి వచ్చేస్తుంది.

కలలు రాల్చుకునే పారిజాతాలూ
కన్నీటి వడగళ్ళు ఏరుకునే విషవృక్షాలూ,
అక్కడ ఆగిపోయి - మాగిపోయి
చరిత్రలై పోతాయి-
సాహిత్యం లేని స్వరం ఒకటి
మూగముగ్గు తీగలా
ఆ వీథిని అల్లుకుంటుంది.

వసంత ఋతుకందుకాలు
జరజరా దొర్లిపోతూ-
నిరవధిక శైశవ మధురహాసాలు
ధ్వజస్తంభంమీది చిరుగంటల్లా మ్రోగిపోతూ-
స్మృతుల కర్పూరధూళి రేగిపోతూ....
ఏ హంస రెక్కల్లాంటి పాదాలనో
తనమీద నాట్యం చేయించుకోవాలని
రంగుల రంగస్థలంలా - ఆ వీథి
నిరీక్షిస్తూ ఉంటుంది!

కాలం-పాదాలను వెనక్కి లాక్కుంటుంది
రథ్యాయానం - నిట్టూర్పులో
ప్రాణాన్ని రాల్చుకుంటుంది!

# నీలోకి నీ ప్రయాణం

నీకు నువ్వెంత దూరమో-
నిరంతరం నిన్ను నువ్వు చేరుకోవాలని
ఎన్ని ఇక్కట్ల టిక్కెట్లు కొనుక్కుంటున్నావో
రెప్పలు కత్తిరించుకున్న నా కళ్లకు తెలుసు.

షహనాయీ రాగాల వంకర చిగురు కొమ్మల్ని
పసినవ్వుల పసిడి జలతారు దారాల్ని
పట్టుగా పట్టుకుంటూ - తూలుకుంటూ
తరగని దూరాన్ని దాటెయ్యాలని నీ ప్రయత్నం.

అతి భాషణల కృత్రిమ హరిద్వర్ణంలో
అంతరంగపు దిగులు నీలిమ ఎలా దాగుతుంది?
వేళ్లు నరుక్కున్న మొండి చేతుల్లో ఉన్న వేణువు
ఒగర్చగలదేమోగానీ పాటగా ఎలా మ్రోగుతుంది?

కలతనిద్రల కొలనుల్లో అలజడిగా, అశాంతిగా
నీ గుండెకలువ ఊగిసలాడటం నాకు కనిపిస్తుంది
కోట్లమందిలో కొనసాగే నీ ఒంటరితనం
కన్నీటి మకరందం చిందే ఏకాంత మౌన పుష్ప
మనిపిస్తుంది.

పసీ! నీ కన్నీళ్లు కనురెప్పల గిరిదాటి బయటకు రావు
అవి నీలోంచి మళ్లీ నీ మీదుగా నీలోకి వెళ్ళిపోతాయి!
అవిశ్రాంతంగా; అలవాటైపోయిన గుండెపోటులా సాగే
నీ పయనంలో
అనంతంగా నిట్టూర్పుల మైలురాళ్లు ఆవిర్భవిస్తూనే
ఉంటాయి.

శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

# ఆత్మహత్య చేసుకోబోయే మనిషితో!

నీతో నువ్వే రాజీపడని ఈ పరుగులో
ఇంకెంతకాలం ఈ అరణ్య మౌనం?
నరాల శాంతియజ్ఞంలో
ఇంకెంతకాలం ఈ సారాయి అర్చన?

కోర్కెల అంతు చూపే క్రమంలో
లైంగిక వాంఛకు
భగ్గుమనడమే తెలుసు తప్ప
సూర్యుడి అంశను సొంతం చేసుకునే
అలవాటేది?

నీ ఆత్మవిశ్వాసంపై
బలహీనతల పొరలు!
బాహ్యలోకాన్ని ఎదిరించలేనిచోట
నీ ముఖాన్ని చూపె అద్దాన్ని బద్దలుకొట్టి
సాగర విహంగమైన నీ భావావేశం
ఎందుకా చివరి అంచు పరుగు?
భ్రాంతి విచ్ఛేదం జరిగి
ఆత్మన్యూనత పెరిగి
ఒక ప్రాపంచిక దృక్పథం అసలే లేని
పశు అస్తిత్వమేనా జీవనశేషం?
ఈ ప్రశ్నల వాడిఅంచులమీదే
మనందరి జీవన్మరణ సమస్యలు!

శ్రీ నిఖిలేశ్వర్

# కలగూరగంప

## వివేక చింతామణి - విజ్ఞాన సర్వస్వ వ్యపదేశార్హత: ఒక పరిశీలన

తెలుగు సాహిత్యానికి ఆంధ్ర మహాభారతావతరణంతో సుసంపూర్ణ స్వరూపం ఏర్పడింది. 'ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని - యధ్యాత్మ విదులు వేదాంతమనియు' అనే ఆంధ్ర మహాభారత అవతారికా పద్యంలో మహాభారత మహత్త్వాన్ని వెల్లడించాడు నన్నయభట్టు. అంటే మహాభారతాన్ని విజ్ఞాన సర్వస్వ స్వరూపంగా గుర్తించవచ్చు. కాని ఇంకా అనేక విషయాలు చెప్పాల్సి ఉంది. కాబట్టి అది విజ్ఞాన సర్వస్వ స్వరూపం కాదు. కథాతత్త్వంతో ఒక ఇతివృత్తానికి ప్రాధాన్యం ఇచ్చినటువంటి మహాకావ్యం. అయినా వ్యాసుడి దృష్టి విజ్ఞాన సర్వస్వాన్ని కూర్చడం కాదు. నన్నయ మహాకవి దృష్టి అంతకంటే కాదు.

విజ్ఞాన సర్వస్వం అనగానే సమస్త విషయాలను గుదిగుచ్చి ఒక ఉద్గ్రంథంగా తయారుచేయడం. దానిలో కథాతత్వం ఏమాత్రం ఉండదు. ఉండడానికి అవకాశం లేదు. కాబట్టి దీని నొక మహా సంకలన గ్రంథం అనాలి. ఇలాంటి విజ్ఞాన (సంకలనాలు) సర్వస్వాలు తెలుగు సాహిత్యం పుట్టిననాటినుండి తక్కువగానే ఉన్నాయి. తొలినాళ్ళలో ఈ సంకలన గ్రంథాలు, గ్రంథస్థాలుగా ఉన్న కొన్ని పద్యాలను, మరెవరో ఆశువుగా చెప్పిన కొన్ని పద్యాలను తీసికొని, సంకలన కర్త కూడా స్వయంకృతాలైన మరికొన్ని పద్యాలను చేర్చడం వలన ఏర్పడుతూండేవి. విజ్ఞాన సర్వస్వ నిర్మాణ విషయంలో ఇప్పటికీ అదే పద్ధతి. కాకపోతే సంకలన కర్తలు చాలామంది ఉండవచ్చు. ఆంగ్లేయ సంస్కృతి, సాహిత్యాల వలన మనకి విజ్ఞాన సర్వస్వాలమీద మరింత సమగ్రమైన అవగాహన ఏర్పడింది. అంతేకాని విజ్ఞాన సర్వస్వాలను మన కవులు కూర్చకపోలేదు.

విజ్ఞాన విషయాలను ప్రధానంగా చేసికొని ఏరి కూర్చే గ్రంథాలు 'మడికి సింగన' నాటినుండి మనకి కనిపిస్తాయి. మడికి సింగన - సకల నీతి సమ్మతం నీతి సంబంధమైన విషయాలకి విజ్ఞాన సర్వస్వంగా చెప్పవచ్చు. లేదా, విజ్ఞాన సర్వస్వంలో నీతికి సంబంధించిన సమగ్ర విషయంగా గుర్తించవచ్చు. తెలుగు సాహిత్యం ప్రారంభ దశనుండి సర్వ విజ్ఞాన విషయాలను దృష్టిలో ఉంచుకొని రచన లెందుకు కొనసాగలేదు? అనే ప్రశ్నకి కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తిగారు అభిప్రాయపడినట్లు "జన బాహుళ్యానికి పుస్తకాలు అందుబాటులో ఉండేవి కావు. కులవృత్తికి సంబంధించిన అనేక విషయాలు పరంపరాగతంగా పైతృకంగా లభించేవి కనుక ఆయా విషయాలను చదువుకోవలసిన అవసరం ఉండేది కాదు. పుస్తకాలు లేకుండానే అనేక విషయాలను తెలుసుకొనే అవకాశాలు సహజంగా దైనందిన జీవనంలో, సామూహిక జీవనంలో అయాచితంగా లభిస్తూండేవి"[1] అంతేగాక, సంస్కృత సాహిత్య ప్రభావం ఎక్కువగా ఉండడం, ఆధ్యాత్మిక దృష్టి, ముక్కలు చెక్కలుగా ఉన్న రాచరిక వ్యవస్థ - వారి నిరంతర కలహాలు, కవులు-లాక్షణికులనే పరమావధిగా ఎంచడం మొదలైన ఎన్నో అంశాలు ఈ విజ్ఞాన సర్వస్వాల పుట్టుకకి విఘాతం కలిగించి ఉండవచ్చు.

17 వ శతాబ్దం వచ్చేనాటికి దక్షిణ భారతదేశంలో దేశి కవితలకి ఆదరణ పెరిగింది. సాహిత్యం సులభతరమైన రూపును దిద్దుకొంది. అయినా ఆంగ్లేయుల అంటుజాడ్యం భారతదేశానికి సోకి ఒక ప్రక్క ప్రజలను భయభ్రాంతుల్ని చేస్తోంది. జీవన పరిస్థితులు మరింత దుర్భరంగా తయారయాయి. ఇలాంటి పరిస్థితిలో పూర్వ పంథాలోనో, వినూత్న పంథాలోనో ఒక కమ్మని కథ అల్లగలరే కాని విజ్ఞాన సర్వస్వాలను ఎవరు కూర్చగలరు. అయినప్పటికీ తెలుగు సాహిత్యంలో విజ్ఞాన సర్వస్వాల దృష్టితో అపూర్వమైన కృషి జరిగింది.

తెలుగులో ఈ విజ్ఞాన సర్వస్వాల సృష్టికి ఆద్యుడు పరమానంద తీర్థయతి. కృతి వివేక చింతామణి. ఈతని కాలం నిర్ణయించడానికి గ్రంథస్థమైన ఆధారాలు స్పష్టంగా కన్పించడం లేదు. తరిగొప్పుల మల్లనకవి, పరమానంద యతి మొదలగువారు తాము దత్తాత్రేయ యోగిపుంగవుల శిష్యులమని వ్రాసికొని యున్నారు. ఇందు తరిగొప్పుల మల్లనకవి క్రీ.శ. 1586-1613 వరకు కర్ణాట రాజ్యమును బరిపాలించిన వెంకటపతిరాయల యాస్థానకవి యగుటచే దత్తాత్రేయ యోగ పుంగవుడును, వానని శిష్య ప్రశిష్యులును పదునారవ శతాబ్ది యందుత్తరార్థమున నున్న వారని నిశ్చయించుటకు సంశయింప నవసరముండదు." అని

కీ.శే. దాగంటి శేషయ్యగారు ఈతవి కాలాన్ని నిర్ధారించారు. పరమానంద తీర్థయతి వివేక చింతామణినే కాక—

1. బ్రహ్మ విద్యా సుధార్ణవము (వచనం)
2. ఉత్తర గీతావ్యాఖ్య (వచనం)
3. సంపంగిమన్న శతకము
4. శివముకుంద పరమానంద శతకము
5. దత్తాత్రేయ శతకము
6. అనుభవ దర్పణము (ద్విపద)
7. శివ జ్ఞాన మంజరి (ద్విపద)
8. ముక్తికాంతా పరిణయము (యక్షగానం)
9. తత్త్వ ప్రదీపిక (తెలుగు టీక)

అనే రచనలు చేసారు. పైన పేర్కొన్న కృతులన్నిటి కంటె వివేక చింతామణి విలక్షణమైనది. తెలుగు విజ్ఞాన సర్వస్వ చరిత్రలోనే విశిష్టత కలది.

వివేక చింతామణి – విషయ ప్రణాళిక :

ఈ గ్రంథం మూడు ఖండాలుగా విభజింపబడింది. వివేక చింతామణి కృత్యవతారికలో "ఈ వివేక చింతామణి యను యోగ శాస్త్రంబు ఖండత్రయంబుగా సమర్థించి, యందు ప్రథమ ఖండంబున మదీయాభిప్రాయంబగు చతుర్వేద మహావాక్యార్థ తాత్పర్యంబగు ఉపనిషదర్థ ప్రతిపాదకంబును సనందనగు వేదాంత సిద్ధాంతంబును; ద్వితీయ ఖండంబున శైవ సిద్ధాంతంబును; తృతీయ ఖండంబున బ్రహ్మాండ పంచభువన కోశ రచనా విచిత్రంబు లుపన్యసింప బడియె" అని రచనా ప్రణాళిక స్థూలంగా వివరింపబడింది. ప్రణాళికేతర విషయాలు ప్రతి అంశంలోను గోచరిస్తాయి.

ప్రథమ ఖండం :

ఈ విభాగంలో '51' అంశాలు వివరింపబడ్డాయి. వేద వేదాంగ నిరూపణ, చాతుర్వర్ణ్య నిరూపణ, పురాణోప పురాణేతిహాసాలు, సమస్త మతాలలోనూ ఆత్మ స్వరూప నిరూపణ, పూర్వ మీమాంస - ఉత్తర మీమాంస, వేదాంతశాస్త్రం, జీవేశ్వరాదుల వాదాది వ్యవహార నిరూపణ, సత్వాది గుణత్రయము తత్ప్రభావాలు, జీవుని సప్తావస్థలు, వేద వాక్యార్థ విచారము, మోక్షాంగాదుల విచారము, షట్ సమాధులు - జ్ఞానఫల వివేకము, జీవన్ముక్తి - విదేహ కైవల్యము, మొదలైన వేద వేదాంత విషయాలు ఎన్నో ప్రథమ ఖండంలో చేర్చబడ్డాయి.

వీటిలో ఏ ఒక్క అంశాన్నీ ఒకే రూపంగా భావించడానికి వీలులేదు. ఒక అంశాన్ని బట్టి అనేక విషయాలు అవగాహనలోకి వస్తాయి. అందుకు ఉదాహరణగా చాతుర్వర్ణ్య నిరూపణ గైకొందము.

"మఱియు ఆంధ్ర, కన్నడ, ద్రవిడ, మహారాష్ట్ర లనియెడు నాల్గు జాతులు. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులనియెడు నాల్గు వర్ణంబులు. వారల యందు ఋతు గర్భాదాన పుంసవన సీమంత జాతకర్మ నామకరణ ఉప నిష్క్రమణ అన్న ప్రాశన చౌలోపనయన మహా మహావ్రత ఉపనిషత్తు గోదాన ఉద్వాహ మృతులనియెడు షోడశ కర్మంబులను, యజన యాజన అధ్యయన అధ్యాపన దాన ప్రతిగ్రహంబు లనియెడు షట్కర్మంబులున్ను శివ భక్త్యాది సకల సద్గుణంబులు కలిగిన యతండు బ్రాహ్మణుండగు.

మఱియు ప్రజాపాలన అధ్యయన, దుష్టజన దుష్టమృగ పక్షి శత్రు సంహార, అన్నదాన, సుప్రజాన.... మహా దానంబులు, తద్ధార్థమై దేశ కాల పాత్ర పరీక్ష, విద్యుత ఖ్యాతి కర్మయుక్తుండగు నతండు క్షత్రియుండనంబడు.

మఱియు ప్రథమ స్థాన ద్వితీయ స్థాన తృతీయ స్థాన చతుర్థ స్థాన పంచమ స్థాన మీక్రమంబున ముప్పదియారు స్థానంబుల పర్యంతము క్రమంబున నందులకు ఏకం, దశ, సహస్రం, దశ సహస్రం, లక్ష, దశలక్ష, కోటి, దశకోటి, శతకోటి, అర్బుదం, న్యర్బుదం, ఖర్వం, మహాఖర్వం, పద్మం, మహాపద్మం, క్షోణి, మహాక్షోణి, శంఖం, మహాశంఖం, క్షితి, మహాక్షితి, క్షోభం, మహాక్షోభం, నిధి, మహానిధి, సాగర, మహాసాగర, హరి, మనోహరి, ఫణి, మహాఫణి, క్రతు, మహాక్రతు, భూరి, మహాభూరి అనియెడు ఉద్భండనలు;

మఱియు ఏక, ఏకరూప, భూమి, చంద్ర యీ సంజ్ఞలు ఒకటికి నామంబులు.

బె, బెన్ని, ద్వ, ద్వంద్వ, ద్వి, ద్వితీయ, యుగ, యుగళ, ఉభయ, బాహు, పాద, పక్ష, నయన ఇవి మొదలుగా గల సంజ్ఞలు రెంటికి నామంబులు.

త్రి, త్రయ, తృతయ, నేత్ర, అగ్ని, పురవర, రత్నాది సంజ్ఞలు మూటికి నామంబులు.

చొ, చతు, గతి, కషాయ, వేద, వర్ణ, ఆశ్రమ, సముద్ర సంజ్ఞలు నాల్గింటికి నామంబులు.

పంచ, హరవక్త్రి, వ్రత, ఇంద్రియ, బాణ, విషయ, పాండవ, భూతాది సంజ్ఞలు అయిదింటికి నామంబులు.

షట్, ద్రవ్య, ఋతు, రస, స్కందముఖ, వేదాంగ, కర్మ, వర్గ, దర్శన, అర్థాది సంజ్ఞలు ఆరింటికి నామంబులు.

సప్త, ముని, గిరి, రాజ్యాంగ, తురగ, ధాతు, సభాంగ, స్వర, సాగర, ఇవి యేడింటికి నామంబులు.

అష్ట, వసు, దిగ్గజ, మద, కర్మాది సంజ్ఞలు యెనిమిదింటికి నామంబులు.

నవ, రంధ్ర, నిధి, రస, గ్రహ, రత్న, భావాది సంజ్ఞలు తొమ్మిదింటికి నామంబులు.

బిందు, శూన్య, నాస్తి, అనుస్వార, గగన సంజ్ఞలు సున్నల పేళ్ళనుచు సకల సంజ్ఞా సంఖ్యలు నెఱింగి;

హెచ్చు గుణించి గణితాదుల గుణించి క్రముకాది సమస్త వస్తువులను ప్రయాణించెడి లెక్క వ్రాలు సేయ, వడ్డి వట్టము, బంగారునకు వన్నె, పగడంబునకు కళుజు, ముత్తియంబునకు చౌరత్నంబులకు సూత్ర పరీక్ష, వజ్రంబునకు మంజాడి, పచ్చకు రతి యివి మొదలైనవి వేరె వేర పరీక్షించి;

మఱియు పది రూకల యెత్తు తూకము ఒక గద్యాణము, లా పది నాలుగైన నొక కర్ష, అది నాలుగైన నొక హలం, అది యిరువదైన నొక వీశె, ఆ వీశలు యిరువదైన నొక తుల, ఆ తుల లిరువదైన నొక భార, ఆ భారలు పదియైన నొక యచిత మగునని కర్పూరాది తూనికలు ప్రమాణించి;

మఱియు నొక సోల రెండైన కుంచము, అవి నాలుగు మానిక, అవి నాలుగు ప్రస్థము, ఆ ప్రస్థములు రెండైన నొక వాహ, అది రెండు ఆఢకం, అది నాలుగైన ద్రోణము, అది అయిదైన నొక పుట్టి యివి ధాన్యాదుల కొలత. నాలుగు అయిదు సేయు వాణిజ్యము కృషి గోపాలిక మూర్య భక్త్యాది కర్మయుక్తుండగు నతడు వైశ్యుం డనంబడు.

మఱియు బ్రాహ్మణాది వర్ణత్రయసేవ, క్షేత్ర రక్షణ, సకల దేవతా భక్త్యాది కర్మయుక్తుండు శూద్రుండనంబడు"

వివేక చింతామణి. పుట-6, 7.

ఇది చాతుర్వర్ణ్య నిరూపణకి పరమానంద యతి ఇచ్చిన వివరణ. దీనిలో ఆంధ్ర, కన్నడ, ద్రవిడ, మహారాష్ట్రులని యెడు వాళ్ళు జాతులు అని భాషాపరంగా విడదీసి జాతివాచకాలుగా పేర్కొన్నాడు. తక్కిన బొత్తరాహికులను విడనాడడం జరిగింది. అలా అని ఇది కేవలం దక్షిణ భారత ప్రజని దృష్టియందిడుకొని రచించిన గ్రంథం కాదు. రస శబ్దాన్ని ఆరు, తొమ్మిది సంఖ్యలకు, రత్న శబ్దాన్ని మూడు, తొమ్మిది సంఖ్యలకు పేర్కొన్నాడు. - విజ్ఞానాన్ని అందించడానికి ఉపయుక్తమే కాని, వ్యవహారంలో ఈ శబ్దం రెండింటా ఉండడానికి సంకోచించాలి.

ప్రథమ ఖండంలోనే సమస్త మతములందు చెప్పబడిన ఆత్మ స్వరూపమనే విషయంలో భారతదేశంలోని మతాలనే కాని పాశ్చాత్య సంబంధమైన క్రైస్తవాది మత ప్రస్తావన లేదు.

కర్పూరాది తూనికల కొలతలు, ధాన్యాదుల ప్రమాణాలకి ఇప్పటి ప్రమాణాలకి ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది. పాల్కురికి సోమన బసవ పురాణంలో ధాన్యాదుల కొలత కుపయోగించే తూము, కుంచం శబ్దాలు వాడాడు. ఈ 'తూము' ప్రమాణం వివేక చింతామణిలో చెప్పబడలేదు. ఈ తూము శబ్దమే ఇప్పటి వ్యవహారంలో ఉన్న 'తవ్వ' కావచ్చు. అలాగే వివేక చింతామణిలో 'ఆఢకం' అనే శబ్దమే ఇప్పటి వ్యవహారంలో ఉన్న 'అడ్డ'గా స్థిరపడి ఉండవచ్చు. సోల శబ్దం ఇప్పటి వ్యవహారంలో ఉన్నా రెండు సోలలు ఒక తవ్వ, అవి రెండైతే మానిక, అవి రెండైతే అడ్డ, ఆ అడ్డలు రెండైతే ఒక కుంచం అని ఇప్పటి వ్యవహారం. వ్యత్యాసాలు ఉన్నప్పటికీ నాటి జన జీవనంలోని పద్ధతులు, ప్రమాణాలు, తెలుసుకోవడానికి ఎంతైనా ఉపకరిస్తాయి ఇవి.

చాతుర్వర్ణ్యాలను వివరించేటప్పుడు కర్మకాండ నిర్వహణ, ప్రజా పరిపాలన, వర్తక వాణిజ్యాలు, క్షేత్ర రక్షణ అనే ధర్మాలను క్రమంగా స్వీకరించి నిర్వర్తించేవారని చెప్పడానికి బదులు, వాటిని సూక్ష్మంగా వివరించి చెప్పడం జరిగింది. ఇలా సూక్ష్మాంశ వివరణ కూడా విజ్ఞాన సర్వస్వ విలువలలో ఒకటి. అయితే ఈ వివరణలో పరమానంద తీర్థయతి స్వయంకృతాలు కూడా ఉన్నాయన్నది సత్యం.

ఇలా తాను నిర్ణయించుకొన్న పరిధిలో ప్రతి అంశాన్ని సూక్ష్మంగా వివరిస్తూ 'ఇతి వివేక చింతామణౌ వేదాది సకల శాస్త్రార్థ నిర్ణయ నిరూపణం నామ ప్రథమ పరిచ్ఛేదః' అని ఖండ శబ్దానికి బదులుగ పరిచ్ఛేద శబ్దాన్ని వాడి పరిసమాప్తి గావించాడు.

ద్వితీయ ఖండం :

ఈ విభాగం అంతా శైవ సిద్ధాంతాలకి సంబంధించినది. తెలుగు సాహిత్యంలో శైవ సిద్ధాంతాలను ఇంత విపులంగా వివరించిన గ్రంథం మరొకటి లేదనడంలో అసమంజసం ఏమీ లేదు. అలా అని మత ప్రచారానికి ఉద్దేశించబడిన గ్రంథం కాదు. కథా

భాగానికి అసలు హాపు లేదు. ఈ ఖండంలో '80'కి పైగా శైవ సంబంధి అంశాలు వివరింపబడ్డాయి. ఉదాహృతిగా 'శైవలక్షణ నిరూపణము - సామాన్య శైవ లక్షణము' అనే అంశమును గైకొందము.

"మఱియు నా శైవంబులందు ముఖ్యంబులగు సామాన్య శైవ, మిశ్ర శైవ, శుద్ధ శైవ, వీరశైవంబు లనుచు చతుర్విధంబులు. అందు నెక్కువదగునట్టి నొకండు శ్రీ విభూతి ధారణ మంత్రంబు వలన శుద్ధాత్ముండై స్వయంభు లింగంబుం దైవమును దేవ దానవ ఋషి మానవాది ప్రవర శైవుల శైవను గని నమస్కార ప్రదక్షిణ పూజాదికంబులను యథాశక్తి చేయుచును, శివ భక్తజన వాత్సల్యంబును, శివపూజా రతియును, శివార్చనంబును, శివార్థంబగు వ్యాపారంబును, శివకథా శ్రవణంబును, శివధ్యానంబును, శివానుకూలతయు, పరమ సాత్వికంబు లవి మొదలు..... . యుక్తుండై యుండు నతండు సామాన్య శైవుం డనంబడు" (వివేక చింతామణి. పుట 80)

ఇట్లే మిశ్ర, శుద్ధ, వీరశైవ లక్షణాలు విపులీకరింపబడ్డాయి.

తృతీయ ఖండం :

'బ్రహ్మాండ ప్రపంచ భువన కోశ రచనా విచిత్రంబు లుపన్యసింపబడియె'. అని కృత్యవతారికలో చెప్పినట్లుగనే '130'కి పైగా వివిధ అంశాలు ఈ ఖండంలో చోటు చేసికొన్నాయి. ఇందులో ఛందస్సులు, అలంకారాలు, కావ్య లక్షణాలు, నాయికా-నాయక భేదం, వాద్య వివేకం, తాళ వివేకం, నాట్య వివేకం, కాశీక్షేత్ర మాహాత్మ్యం మొదలైన ఇతర అంశాలు కూడా విశదీకరింపబడ్డాయి.

గ్రంథ వైశిష్ట్యం :

భారతీయుల ఆధ్యాత్మిక దృష్టికి, సృష్టికి మూల మట్టాలను వేద వేదాంగ సాక్షిగ (సరళ గ్రాంథిక) వ్యావహారిక శైలిలో, కేవలం వచనరూపంలో వెలువరించినది ఈ వివేక చింతామణి.

పరమానంద తీర్థులు ద్విపద, శతక, యక్షగాన రచనలు చేసినా వివేక చింతామణి రచనలో వచనం స్వీకరించడం గమనించదగిన విషయం. సమస్త వస్తు సముదాయాన్ని పొందు పరచడానికి, సులభ శైలిలో వెలువరించడానికి ద్విపద రచన తగినదే. అందుకు పాల్కురికి సోమనాథాదుల కృతులే సాక్ష్యాలు. పద్య గ్రంథాలు శతాధిక సంఖ్యలో వెలువడే కాలంలో వివేక చింతామణి రచనకు వచనాన్ని ఎన్నుకోవడం పరమానంద తీర్థయతి ప్రత్యేకత.

శైవ విజ్ఞాన సర్వస్వం అనదగినట్లు ద్వితీయఖండం రచింపబడినప్పటికి, అట్లే వైష్ణవానికి వైష్ణవ సంప్రదాయాలకి, తదితర మతాలకి కూడా మరికొన్ని పరిచ్ఛేదాలు రచిస్తే బాగుండేది. కాని ఈ ఖండం అంతట ఒక్క శైవానికే పరిమితం చేసారు.

విజ్ఞాన సర్వస్వంలో విజ్ఞానమంతా ఇమిడి ఉన్నంత మాత్రాన ప్రయోజనం లేదు. అది సర్వులకు అందుబాటులో ఉండే విజ్ఞాన సర్వస్వమై ఉండాలి. సాధారణంగా ఈ విషయాన్ని గమనించరు. ప్రతి సూక్ష్మాంశం వివరణతో ఉండాలి. అలా ఉండే అంశం ప్రజా బాహుళ్యానికి అందుబాటులో ఉండే భాషలో ఉండాలి. మొదటిది - సూక్ష్మాంశ వివరణ ప్రచురణ, వ్యయాల వల్ల సాధ్యం కాకపోయినా, రెండవది : అందులో ఉపయుక్తమయ్యే భాషకి సంబంధించినది గాన అది మన చేతిలో పని. భాష విషయంలో ఎంతైనా జాగ్రత్త తీసికోవచ్చు. ఇప్పటికి నాలుగు వందల సంవత్సరాల క్రితం వాడైన పరమానంద యతి తన కృతియగు వివేక చింతామణిలో వాడిన భాష నాటి కాలపు వ్యావహారికపు భాషే. ఉదాహరణకి వివేక చింతామణిలో ఏ అంశాన్నైనా గ్రహించవచ్చు.

క్రీ. శ. 18వ శతాబ్దిలో టేకుమళ్ళ రంగశాయి 'వాణీ విలాస వనమాలిక' అనే పద్యగ్రంథాన్ని రచించాడు. ఇది కూడా ఒక విజ్ఞాన సర్వస్వమే. వివేక చింతామణి కంటే రంగశాయి వాణీ విలాస వనమాలిక మరింత విస్తృత ప్రణాళికతో రచింపబడింది. వివేక చింతామణిలో లేని గజ పరీక్ష, అశ్వ పరీక్ష, ఉష్ట్రి పరీక్ష, రత్న పరీక్ష, స్థల మాహాత్మ్యాలు మొదలైన ఎన్నో అంశాలు వాణీ విలాస వనమాలికలో చోటు చేసుకొన్నాయి. పరమానంద తీర్థయతి క్రీ శ. 16వ శతాబ్ది ఉత్తరార్థంవాడైతే, రంగశాయి క్రీ శ. 18వ శతాబ్దిలోవాడు కాబట్టి వివేక చింతామణి కంటె వాణీ విలాస వనమాలిక విషయ బాహుళ్యత కలిగి ఉండడం సామాన్య విషయం.

మన కవులు తమ తమ కృతులను విజ్ఞాన సర్వస్వాల పేరుతో వెలువరించకపోయినా, విజ్ఞాన సర్వస్వ దృష్టితో రచించారనేది సత్యం. చింతామణిని ఆశ్రయించేవారికి సకలాభీష్ట సిద్ధి ఎలా కలుగుతుందో అలాగే వివేకాన్ని కోరుకునేవారు ఈ వివేక చింతామణిని ఆశ్రయిస్తే వారి అభీష్టం నెరవేరుతుందని, వివేక చింతామణి నామం అన్వర్థమవుతుందడమే కాక, ఇది విజ్ఞాన

సర్వస్వ దృష్టితో వెలువరించిన గ్రంథం అని గ్రంథ నామాన్ని బట్టే సుస్పష్టంగా తెలుస్తుంది.

వివిధ ఆధ్యాత్మిక రహస్యాలు విప్పి చెప్పడమే కాక, కొన్ని నూతన సాంకేతిక పదాలు సోదాహరణంగా వివరింప బడ్డాయి. కొన్నిటికి పర్యాయ నామాలు చెప్పబడ్డాయి. మొత్తంమీద చెక్కులుగా విడదీస్తే నేటి మన విజ్ఞాన సర్వస్వాల కిది మూలాధార అని తెలుస్తుంది.

ఈ వ్యాసానికి ఉపకరించిన గ్రంథాలు :

1. మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు, పుట-74. యువభారతి ప్రచురణ.
2. వివేక చింతామణి, తంజావూరు సరస్వతీమహల్ ప్రచురణ. సీరీస్ నెం. 99.
3. కవి తరంగిణి. 10వ సంపుటం. పుట-183.
4. వాణీ విలాస వనమాలిక.

శ్రీ గొల్లకోట సూర్యభాస్కరరావు

# కవిత్వ లక్షణ పర్యాలోచన

కవిత్వానికి లక్షణ నిర్దేశం, సంస్కృతాలంకారిక నిర్ణయాన్ని బట్టి, పాశ్చాత్య వాఙ్మయ వాసనల్ని బట్టి, అరిస్టాటిల్ మొదలగువారి అభిమతాల్ని బట్టి ద్వైవిధీభావంతో పరిగణింపబడు తోంది. లక్షణాన్ని బట్టి లక్ష్యం కాకుండా, లక్ష్యాన్ని బట్టి లక్షణ మేర్పడడం అనాదిగా సంప్రదాయం. "సిద్ధిర్లో కాద్వ్యాకా" అని వాగను శాసనుల అనుశాసనం - భాషా ప్రవాహ స్థితిగతుల్ని పరిశీలించిన పెద్దలు కవి కర్మయైన కావ్యానికి ఎన్నో లక్షణాల్ని తెలిపారు - లేకపోతే ఒకే ఒక్క లక్షణం స్థిరమైపోయేది.

మార్గ దేశి భేదాలతో వ్యవహృతమయ్యే తెలుగుభాషకి సంస్కృతాంగ్ల వాఙ్మయ కవితా లక్షణాల సమన్వయ పరిశీలనే తప్ప దానికంటూ ప్రత్యేక ప్రతిపత్తిగల లక్షణం లేదు - భాషా శాస్త్రపరంగా ద్రావిడ భాషల ఆదాన ప్రదాన విధానాల్ని బట్టి తెలుగు భాషా స్వరూపం ఏర్పడింది.

ఈ పరిశీలనని బట్టి కవిత్వానికుండే విధానాన్ని, ఆంధ్ర కవిత్వ విశిష్ట పరిస్థితినీ, స్థూలంగానైనా అర్థం చేసుకోవచ్చు.

బ్రహ్మశ్రీ పూజ్యులు శ్రీ చిపుకుల వేంకట సుబ్బావధానులు గారు వ్రాసిన "కవిత్వము - లక్షణము" వ్యాసము సాహిత్య విద్యార్థులవశ్యము పరిశీలింపవలసినది. ఇటీవల వస్తున్న కవిత్వాన్ని గూర్చి వారు సోదాహరణం వ్రాసిన అంశాలూ, ఉపపత్తులూ, శాస్త్రీయ సిద్ధాంతాలు కాకపోవచ్చు. అయినప్పటికీ కవిత్వ పరిణామస్థితుల్ని బట్టి దృక్పథాన్ని మార్చుకోక తప్పదు. అయితే ఆ మార్పు శుభంకరమా? అనర్థకారకమా? ప్రగతి దాయకమా? తిరోగతి మూలకమా? అనేవి ఇక్కడ చర్చించవలసినవి కావు. దాని వేదిక వేరు- పరిధి వేరు-

ఇక దేన్ని కవిత్వమనాలి? అదీ ఆలోచించాలి.

ఛందోబద్ధమైనంత మాత్రాన ప్రతిదీ కవిత్వం కాదు- "గద్యం కవీనాం నికషం వదన్తి" అనేది గద్యరచనకి అందే వచన రచనకి వచ్చిన ప్రశస్తి.

"బాణోచ్ఛిష్టం జగత్సర్వం"
"కవిర్దండీ కవిర్దండీ భవభూతిస్తు పండితః"

అనేవి కాదంబరీ దశకుమార చరిత్రల్ని రచించిన బాణభట్టు, దండి మహాకవుల గూర్చి వచ్చిన సూక్తులు- నాటకకర్త అయిన భవభూతికి పండితుడనే ప్రథ మాత్రమే.

ఏతావతా తేలిన అంశం ఏమంటే రచనా వ్యాపారం నిర్నిబంధం అని. గద్యం కావచ్చు, పద్యం కావచ్చు. కవిత్వం అనిపించుకోదగిన విశేషమున్నదేదైనా సరే! అలా అనిపించుకోదగిన విశేషాలేవి?- మనం ప్రత్యేకం నిర్వచించలేం. ఉన్న నిర్వచనాలన్నీ లక్ష్యానుశీలన ఫలితాలే కదా!- అందుకే కవికున్న స్వాతంత్ర్యం అడ్డులేనిది. అలా అని విశృంఖల ప్రవృత్తి కాదు.

ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాస వశం, విశేషావిర్భావం గల రచన కవిత్వమవుతుంది రసభావాద్యలంకారాలు గాని వ్యంగ్య ధ్వన్యాది ఆలంకారిక సిద్ధాంతాలు గాని లక్ష్యానుమేయాలే. ఆదలా వుంచండి-

మమ్మటుడు - కావ్యప్రకాశికలో-

నియతి కృత నియమ రహితాం
హ్లాదైకమయీం అనన్య పరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితిం
ఆదధతీ భారతీ కవేర్జయతి. అంటాడు-

కావ్య నిర్మాణాన్ని గూర్చి-

"అ పారే కావ్య సంసారే కవిరేకః ప్రజాపతిః
యథా స్మైరోచతే విశ్వం తథేదం పరికల్ప్యతే"

అన్న శ్లోకంలో కవికున్న విశిష్టత తెలుస్తోంది. "వాక్యం రసాత్మకం కావ్యం" అని వుంది కదా!

పర్యవసానంగా తేలిన అంశమేమంటే కవి, స్వతంత్రుడనీ, కావ్యరచన కవి సంపూర్ణ స్వేచ్ఛా ప్రతిబింబమనీ కదా!-

ఇంక కవిత్వపు బాగోగులు 'పరిశీలనకి నిర్ణయించిన నాల్గంశాల్లోనూ ముఖ్య లక్షణం అనిర్వచనీయం- అందుకే అవధానులుగారు "కవిత్వం అనిపించే ముఖ్య లక్షణం మొదటిది" అని మాత్రమే పేర్కొనవలసి వచ్చింది. మిగిలిన ఇతివృత్తం, బోధ, సందస్సు నిర్నిబంధాలు తన సమాజ స్వరూప స్వభావ వివేచనతో కవి నిర్మించుకోవలసిన కవితాంగాలవి.

కవిత్వ పరమార్థం ఆనందప్రదత్వమనేది కూడా అవిర్జ్ఞేయమే. అనుభూతిలో, కవికీ, పాఠకునికీ, సృజనాత్మక, పరాత్మక రీతుల్ని బట్టి తారతమ్యముంటుంది - స్థాయి భేద ముంటుంది. పాఠకులందరికీ సమానానుభవముండదు. కించిత్ జ్ఞాన, మహాజ్ఞాన బోధలను బట్టి ఆ భేదాన్నూహించవచ్చు.

"మాట చమత్కారంచేతనో భావ చమత్కారంచేతనో శ్రోతలను తాత్కాలికంగా రంజింపజేసే యే వాక్యమైనా కవిత్వమే అనుకొనే భ్రమ యేర్పడినది" అనే వాక్యార్థం ప్రాచీనాధునిక కవిత్వములలోనూ కనబడకపోదు. బహుశః ఈ వాక్యంలో శ్రోత అయివుండదు పఠిత అయివుంటాడు. ఈ కారణంగా ఏ కావ్యమూ కావ్యం కాకుండా పోతుంది. కవిత్వం కవిత్వం కాకుండా పోతుంది. కథాగత కావ్యంలోనిదే కవిత్వమవుతుందంటే రమ్యభావనఉన్న ప్రాచీనుల రచనలన్నీ అనుపాదేయాలే అవుతాయి. ఒక నిర్ణయం చేయబోయేముందు పౌర్వాపర్య పరిశీలన లేకుంటే కలిగే దోషమే యిది-

కువలయానందంలో అతిశయోక్త్యలంకారానికి ఒక రమ్యమైన ఉదాహరణముంది-

వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపద్యా
పద్యా నాళీ మదిగతవతీ కాంచనీ మైంద్రనీలీం
తత్రత్వన్నో సుకృతి సుభగౌ చందనచ్ఛన్నదేశౌ
తత్రత్యానాం సులభమమృతం సన్నిధానాత్ సుధాంశోః

ఈ శ్లోకంలో వ్యంగ్యంగా కామినీ స్వరూపం చిత్రితమైంది. ఇది కవిత్వమవుతుందా? కాదా? ఒక పదసంయోజన పై చిత్రితోనో, భావ చమత్కారంతోనో, కల్పన వైదగ్ధ్యంతోనో, ఆలంకారిక చిత్రణతోనో చేసిన రచన కవిత్వం కాదా?

"రాశికంటె వాసి ముఖ్యం
బరుపున్న రచనకే విలువెక్కువ"

అనేవాటిలో అభిప్రాయం భేదించదు.

"అల్పాక్షరమ సందిగ్ధం స్సారవ ద్విశ్వతోముఖమ్" అనీ-
"అల్పాక్షరముల ననల్పార్థ రచన" అనీ-

చెప్పిన లక్షణం కవిత్వాని కుండవచ్చు.

వివక్ష, జిజ్ఞాస, సంయమనం, పౌర్వాపర్య వివేచన, నేటి కవితా వ్యవసాయంలో కొరవడడం, తత్పర్యవసానం, హొల్లూ-తాలూ కనబడడం కాదనలేని సత్యమే.

స్పష్టార్థం కోసం వాక్యమెలా వుండాలి? అనేదానికి "యోగ్యత-ఆకాంక్ష-ఆసక్తి" అవసరాలు - ఆసక్తి అని కాదు, ఆసత్తి అని వుండాలి. ఆసత్తి అంటే పద సంయోజనం. బహుశః ఆసక్తి అని ముద్రారాక్షసంగా పడివుండవచ్చు. ప్రస్తుతా ప్రస్తుత ద్యోతకత్వం, అప్రస్తుతా ప్రస్తుత ద్యోతకత్వం, ప్రస్తుత ప్రస్తుత ద్యోతకత్వం, అనేవి కవి స్వయంప్రతిభ వల్ల సముత్పన్న లక్ష్యకావ్యాలవల్ల గుర్తించినవే.

కావ్యాంగాలుగా పేర్కొనబడినవన్నీ కవి స్వేచ్ఛా నిర్దేశాలు

కాళిదాసంతటి కవి-

"పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చావ్య వద్యం నవమిత్య పూర్వం
సంతః పరీక్ష్యాశు పరిగ్రహంతే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః" అంటారు.

ఆర్య ద్రావిడ భాషా కవిత్వాలలో గల రమణీయ సన్నివేశాలను, కల్పనలను, ఆదాన ప్రదాన విధానాల ద్వారా తెలిపికోవలసిన అవసర మిపుడెంతైనా ఉంది. "ముఖేముఖే సరస్వతీ!" కదా- అయా కవిత్వాల విశేషాల్ని మన ఆలోచనల్లో తెలుపుకోవాలనుకున్నప్పుడు భాష వికాసానికి ప్రతిబంధకమైనవి నిర్బంధాలే మరి. వాటిని తొలగించుకోక తప్పదు.

ఒక నిర్దిష్టమైన లయా, తూగూ, ఆకర్షణా వున్నంత మాత్రాన అది కవిత్వమందే అదీ భ్రమే-

"అవిగో అవిగో అవిగో మేడలు
ఇవిగో ఇవిగో ఇవిగో గుడిసెలు"

అంటే కవిత్వమైపోతుందా? ఛందోబద్ధతా, ముక్తచ్ఛందతా, అనేవి కేవల కవి వ్యక్తిత్వ ప్రకాశకాలే.

"ప్రతి మాటకీ శక్తి వుంది పదును వుంది
ప్రతి చిత్రణకీ అర్థం వుంది ఔచిత్యం వుంది

కవిత్వం ఒక ఆల్కెమీ, దాని రహస్యం కవికే తెలుసును.

కాళిదాసుకు తెలుసు పెద్దన్నకు తెలుసు
కృష్ణశాస్త్రికి తెలుసు శ్రీశ్రీకి తెలుసు"
ఈ కాలంలో ప్రాతీయ యీ ప్రమందాన్ని ప్రతిఫలింప
ఇంటిలోన్న కిటికీలన్నీ తెరచి అన్ని పవనాల్నీ ఆహ్వానించు
నువ్వు తెన్నేదేవైనా సిద్ధై పుంటాలి. సీతాంశి రావాలి
చించుకొని రావాలి."

"మాటలు పేర్చడం కవిత కాదు, మంత్రం తంత్రం అసలే కాదు. మళ్ళీ యీనాడు చిత్ర కవితల్నీ ఆయోమయ బంధాల్నీ పునరుద్ధరించకు,

విగ్రహ ప్రగ్రహాల్లేని భావాశ్వాల్ని బరిమీద వదలకు
అన్నా! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం
విస్తరించాలి చైతన్యపరిధి చెయ్యాలి-
అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి"

-అంటూ కీ॥శే॥ బాలగంగాధర తిలక్ చెప్పిన కవితని నేటి కవితా వ్యవసాయకులు గుర్తుంచుకోవాలి.

కవిత్వం ఇలాగే వుండాలి. ఇదే కవిత్వం- అనే నియమం ఎంత అననుకూలమో, ఏది కవితో, ఏది కవితాభావకమో అనేది కూడా అంతగానూ అననుకూలమైన నేడు శ్రీ చివుకుల వేంకట సుబ్బావధానులుగారి వ్యాసం ఒక కనువిప్పు. భిన్నత్వంలో ఏకత్వం సమర్థమైన కవిత్వం రావాలనడంలో వుండి తీరాలి అందులో ఎటువంటి విప్రతిపత్తీ వుండదు, వుండకూడదు.

సౌదర్శని

## బహదూర్షా - బంధగీతి

మొఘలు చక్రవర్తులలో చివరివాడైన అబూ జఫర్ మహమ్మద్ సిరాజుద్దీన్ బహదూర్ షా॥ (1775-1862), తండ్రియైన రెండవ అక్బరు॥షా తరువాత 1837లో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతని రాణి 'జీనత్ మహల్'. అప్పటి పరిస్థితుల్లో అతని అధికారం, ఎర్రకోట నాలుగు గోడలకే పరిమితమైంది

1857 మే 10న మీరట్‌లో బ్రిటీషువారికి వ్యతిరేకంగా తిరుగుబాటు చెలరేగింది. తిరుగుబాటుదారులు ఢిల్లీని ఆక్రమించి రెండవ బహదూర్ షా॥ను యావద్భారతానికి చక్రవర్తి(షహిన్‌షా-ఇ-హిందుస్థాన్)గా ప్రకటించారు. ప్రతిచోట, ప్రతి తిరుగుబాటు నాయకుడూ అతనిని ఐక్యతా ప్రతీకగా అంగీకరించి అతని నాయకత్వాన తిరుగుబాటు జెండా ఎగరవేశారు. జఫర్ పరిపాలనా కాలంలో తెల్లదొరల అల్లరి అధికమించింది. మునుపే ఆంగ్లేయులు లక్నో పాదుషా అయిన వాజిద్ అలీషాను పదభ్రష్టుణ్ని చేసి కలకత్తాలోని 'మటియా బుర్జ్'లో బందీని చేశారు. మిగిలిన పాదుషా బహదూర్ షాను కూడా పట్టి బంధించాలని ఇంకా ధిక్కరించితే వధించాలని కూడా తెల్లదొరలు పథకం వేశారు. ఆ మేరకు సిపాయీల కలహం సంభవించింది. ఆ కలహ వ్యూహంలో తెల్లదొరలు బహదూర్ షా॥ను బంధించారు. సిమ్మట ఆంగ్లేయులకు లోబడవలసినదిగా జఫర్‌కు వర్తమానం వచ్చింది. పూర్వపు మొఘలు రాజుల కీర్తికి కళంకమౌతుందేమోనని జఫర్ ప్రారంభంలో లొంగిపో నన్నాడు. క్రమంగా విముక్తిమార్గం కన్పించలేదు కావున తెల్లదొరలకు లొంగక తప్పలేదు. 1857 సెప్టెంబరులో ఢిల్లీని ఆంగ్లేయులు తిరిగి పట్టుకున్నాక (తిరుగుబాటు పతనానంతరం) బహదూర్ షా॥ను, సిపాయీల తిరుగుబాటులో పాల్గొన్నందుకు, తిరుగుబాటువారులకు సాయపడినందుకు వారు ఇతణ్ని శిక్షించే నిమిత్తం ఒక కమీషనును ఏర్పాటు చేశారు. ఆ కమీషను బహదూర్ షా॥ను రాజద్రోహిగా, కుట్రదారుడిగా, తిరుగుబాటుదారుడిగా, హంతకుడిగా నిర్ణయించింది. తత్ఫలితంగా ద్వీపాంతరవాస శిక్ష విధించింది. అప్పటి బ్రిటీషు అధికారి 'లార్డ్ కేన్నింగ్' బర్మాలోని రంగూన్ జైలుకు అతన్ని కుటుంబ సమేతంగా పంపించాడు

కారాగారంలో సామాన్య ఖైదీకి లభించే కనీస సౌకర్యాలు కూడా ఇతనికి లభించలేదు. దుర్భర ఖైదీ జీవితం అనుభవించాడు. బ్రతికినన్నాళ్ళు తన మాతృదేశానికి తిరిగి రావాలని మిక్కిలి ఆశించాడు. చివరకు 1862 సెప్టెంబరు 12న ఉరితీయబడ్డాడు. అంతటితో మొఘలు సామ్రాజ్యం అంతరించిపోయింది.

రాజకవియైన బహదూర్ షా జఫర్ జీవితగాథ అంతయూ-

'పువ్వు చాటున కంటకమ్ములను కోరి
గాయముల రేపు రక్తగాథగా' - దర్శనమిస్తుంది.

పువ్వు కావాలని పోతే ఉర్దూ కవికి ముళ్ళు గాయాలు చేస్తాయి. గాయం కాగానే రక్తం చిందుతుంది. అలా నిరంతరము రక్తస్రవంతుల్ని పొంగించే హృదయగాథయే బహదూర్ షా జఫర్ జీవనగాథ!

మోమిన్, గాలిబ్, జౌకు లాంటి ఉర్దూ కవిపుంగవులంతా జఫర్ ఆస్థానంలోని వారే. జఫర్ కవిపోషకుడే కాక ఉర్దూ, పర్షియా, అరబిక్‌లలో సహజముగా కవి. అందమైన వ్రాత

రాసేవారు. తన కవిత్వ ప్రతిభ కనుగుణంగా 'జఫర్' బిరుదు స్వీకరించాడు. తన ఆస్థాన కవులచే కవితాగోష్ఠి నిర్వహించే వాడు. జఫర్ లాంటి రాజకవులు ఉర్దూలో ఎక్కడో వాజిద్ అలీషా లాంటివారు తప్ప అంతగా కనపడరు. "మానవుని జీవితమే వేదనామయము. కవిత్వానికి ఆధారభూతం కూడా వేదనే కదా. వేదన లేనిదే ఆనందము లేదు. అయినా ఉర్దూ కవులు తీవ్రవేదనలోనే దివ్యానందాన్ని చూడగలిగారు. ఉర్దూ కవితా మర్యాద కూడా ఇదే!

మీర్జా గాలిబ్ వేదనను చమత్కారంగా చూడగలిగాడు. కాని బహదూర్‌షా వేదనను వేదనగానే చూశాడు. అందుకే అతని కవిత దాశరథి చెప్పినట్లు 'వేదనా నికషం' మీద వన్నె తేరి ఉన్నది. వేదనతో అతని కవితా జీవితం విడదీయరానిదిగా ఉన్నది.

పాదుషాగా బహదూర్ షా అంత సమర్థుడేమీ కాదని, మీదు మిక్కిలి విలాస లాలసుడని చరిత్ర చెబుతోంది. కవిగానే గజలికెక్కినట్లు అతని గజళ్ళు చెబుతాయి. వ్యాపారంభం లోని చరిత్ర ప్రకారం తెల్లదొరలు జఫర్‌ని కుటుంబ సమేతంగా దేశ బహిష్కృతుణ్ణి చేశారు. బర్మాదేశపు రాజధానియైన రంగూన్ లోని 'మాండలే' చెరసాలలో జఫర్‌ను అతని కుటుంబీకులను ఖైదీలుగా ఉంచారు. కొంతకాలం గడిచాక శత్రుశేషం ఉండ రాదని భావించిన తెల్లదొరలు జఫర్‌ని అతని కుమారుల్ని ఉరి తీయదలచారు. అందుకే ఒకానొకరోజు జఫర్-కుమారుల్నందర్ని ముక్కలు ముక్కలుగా ఖండించి వండించి మాంస పదార్థాల్ని పళ్లెరములలో పెట్టించి పైన "కవన్" కప్పి జఫర్ కిచ్చారు ఆరగించాల్సిందిగా. ఆ మాంసం తన పుత్రులదేనని గమనించిన జఫర్ చాలా చాలా వ్యథ చెందాడు. ఇదేమిటి అని తెల్లదొరల్ని అడగ్గా, వాళ్ళు నీకూ ఇదే గతి పడుతుందని వాస్తవాంశాన్ని వాక్రుచ్చారు.

ఉరికంబం ఎక్కబోయే ముందు జఫర్ చెప్పిన చివరి గజల్‌లోనే సుప్రసిద్ధమైన షేర్-

"కిత్‌నా హై బద్‌నసీబ్ 'జఫర్' దఫన్ కేలియే
దో గజ్ జమీన్ భీ మిల్ న సకీ కూయె యార్ మే"

'జఫర్ నీవెంత దురదృష్టవంతుడివి. ప్రేయసి నివసించే వీథిలో ఖననం కోసం నీకు రెండు గజాల స్థలము కూడా దొరకలేదే.'

ఉర్దూకవి లౌకికమైన మరణ వృత్తాంతాన్ని అమోఘంగా విశ్లేషిస్తాడు. ఉర్దూ కవిత్వంలో ఈ సంప్రదాయం నిత్య నూతనంగా భాసిస్తుంది. అలాంటి సంప్రదాయాన్ని పెంచి పోషించిన కవుల్లో, రాజకవి బహదూర్ షా ప్రముఖుడు. కొన్ని క్షణాల్లో ఉరికంబానికి చేరబోయేముందు జఫర్ నోటినుంచి అప్రయత్నంగా పెల్లుబికి వచ్చింది కాబట్టి ఈ పలుకులకు ఎక్కడ లేని శక్తి చేకూరింది. ఆ శక్తిలోనే అంతర్నిగూఢంగా దేశభక్తి దాగి ఉంది.

సహజంగా ఉర్దూ కవి ప్రేయసి గల్లీలో మరణించాలని కోరుకుంటాడు ప్రేయసి (సాకీ)ని ఉర్దూ కవులు ఖుదాకు సంకేతంగా చెబుతారు ప్రేయసి గల్లీలోనే మరణించాలనే వాంఛను వాళ్ళు దైవ సాన్నిహిత్యంగా భావిస్తారు. మరి జఫర్‌కు జరిగిందేమిటి? మరణం సాకీ గల్లీలో కాదు కదా. అతని సమాధి రంగూన్‌లో కదా. జీవితంలో వియోగ వ్యధను అనుభవించిన ఉర్దూకవి మరణంలోగాని, మరణానంతరం గాని సాకీ సాన్నిహిత్యం (దైవ సాన్నిధ్యం) కావాలని కోరతాడు జఫర్‌కు మాత్రం అది కూడా సాధ్యం కాలేదు. అందుకే తన వ్యధనంతా 'షేర్'లో నిక్షేపించాడు.

జఫర్ గజళ్ళకు అనువాదంగా ఈ షేర్‌కు వ్యాఖ్యానప్రాయంగా తెలుగులో వెలువడ్డ 'జ్వాలా హవంతి' అనే చిరుపొత్తం గమనింపదగ్గది.

'కాపురమ్ము నలిన కాంతుడు వీథిలో
దాపురమ్ము కొరకు స్థలము లేదు"

కాటికి వెళ్ళేటప్పుడు కూడా "కూయె యార్ మే" అనేంతటి గాఢప్రేమ జఫర్‌ది. కాని 'సాకీ'ని ఏలచిన పోటీదారులెందరో! సాకీ-జఫర్ స్వదేశం. పోటీదార్లు - తెల్లదొరలు. జఫర్‌ను తర లించారు. అంతేకాదు. అంతం చేశారు. జఫర్‌కు చావడమిష్టమే. కాని ప్రేయసి వసించే వీధిలో చస్తే సంతృప్తి! పరాయివాళ్ళకు వశమైన పల్లవి గల్లీలో ఖననార్థం రెండు గజాల నేల కూడా జఫర్‌కు దొరకలేదు. దురదృష్టవంతుడయ్యాడు. నరకబాధంతా జఫర్‌దిగానే భావింపబడాలి.

ఇదంతా షేర్‌లో జఫర్ నిక్షేపించిన ధ్వని. ఈ ధ్వనిలో జఫర్ కవియొక్క ప్రగాఢమైన దేశభక్తి విశదమౌతున్నది. 20 యేళ్ళుగా భారతదేశాన్ని పరిపాలించాడు. కాని జఫర్ లాగానే తత్పూర్వీకులు కూడా దేశాన్ని పాలించారు. మొఘలులే కాదు ఇతరేతరులు కూడా. అయినా వారంతా మానవసంస్కృతికి భారం గానే కన్పిస్తున్నారు. ప్రేయసి గల్లీని భారతదేశపు వీధిగా జఫర్ ధ్వనింపజేశాడు. కవితాపరంగా కనపడే సాకీ గల్లీ, పాదుషా పరంగా దేశవీథిగా సమన్వితమౌతున్నది. చెలియ గల్లీలో చస్తే కవిగా సంతృప్తి. దేశవీధిలో చస్తే కవిగానే కాక చక్రవర్తిగా కూడ సంతృప్తి. ఇటు చక్రవర్తిగాను అటు కవిగాను పై రెండు రకాల సాన్నిహిత్యాన్ని కోల్పోయినందుకు పడే మధనపాటే ఈ షేర్.

కాళిదాసుకు తెలుసు పెద్దన్నకు తెలుసు
కృష్ణశాస్త్రికి తెలుసు శ్రీశ్రీకి తెలుసు"
ఈ కాలంలో ప్రాచీనుల యీ సంప్రదాయాన్ని ప్రతిఫలించు.
ఇంటికున్న కిటికీలన్నీ తెరచి అన్ని పవనాల్నీ ఆహ్వానించు
నువ్వు చెప్పేదేదైనా నీదై వుండాలి. నీలోంచి రావాలి
చించుకొని రావాలి."

"మాటలు పేర్చడం కవిత కాదు, మంత్రం తంత్రం అసలే కాదు. మళ్ళీ యీనాడు చిత్ర కవితల్నీ అయోమయ బంధాల్నీ పునరుద్ధరించకు,

విగ్రహ ప్రత్యగ్రహాల్లేని భావాశ్వాల్ని బరిమీద వదలకు
అన్నా! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం
విస్తరించాలి చైతన్యపరిధి చెయ్యాలి-
అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి"

-అంటూ కీ.శే. బాలగంగాధర తిలక్ చెప్పిన కవితని నేటి కవితా వ్యవసాయకులు గుర్తుంచుకోవాలి.

కవిత్వం ఇలాగే వుండాలి. ఇదే కవిత్వం- అనే నియమం ఎంత అననుకూలమో, ఏది కవితో, ఏది కవితాభాసమో అనేది కూడా అంతగానూ అననుకూలమైన నేడు శ్రీ చివుకుల వేంకట సుబ్బావధానులుగారి వ్యాసం ఒక కనువిప్పు. భిన్నత్వంలో ఏకత్వం సమర్థమైన కవిత్వం రావాలనడంలో వుండి తీరాలి. అందులో ఎటువంటి విప్రతిపత్తి వుండదు, వుండకూడదు.

సౌదర్శని

# బహదూర్షా - బంధగీతి

మొఘలు చక్రవర్తులలో చివరివాడైన అబూ జఫర్ మహమ్మద్ సిరాజుద్దీన్ బహదూర్ షా (1775-1862), తండ్రియైన రెండవ అక్బరుషా తరువాత 1837లో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతని రాణి 'జీనత్ మహల్'. అప్పటి పరిస్థితుల్లో అతని అధికారం, ఎర్రకోట నాలుగు గోడలకే పరిమితమైంది.

1857 మే 10న మీరట్‌లో బ్రిటీషువారికి వ్యతిరేకంగా తిరుగుబాటు చెలరేగింది. తిరుగుబాటుదారులు ఢిల్లీని ఆక్రమించి రెండవ బహదూర్ షాను యావద్భారతానికి చక్రవర్తి(షహిన్‌షా-ఇ-హిందుస్థాన్)గా ప్రకటించారు. ప్రతిచోట, ప్రతి తిరుగుబాటు నాయకుడూ అతనిని ఐక్యతా ప్రతీకగా అంగీకరించి అతని నాయకత్వం కింద తిరుగుబాటు జెండా ఎగరవేశారు. జఫర్ పరిపాలనా కాలంలో తెల్లదొరల అల్లరి అధికమించింది. మునుపే ఆంగ్లేయులు లక్నో పాదుషా అయిన వాజిద్ అలీషాను పదవీభ్రష్టున్ని చేసి కలకత్తాలోని 'మటియా బుర్జ్'లో బందీని చేశారు. మిగిలిన పాదుషా బహదూర్ షాను కూడా పట్టి బంధించాలని ఇంకా ప్రతిఘటించితే వధించాలని కూడా తెల్లదొరలు పథకం వేశారు. ఆ మేరకు సిపాయిల కలహం సంభవించింది. ఆ కలహ వ్యూహంలో తెల్లదొరలు బహదూర్ షాను బంధించారు. సిమ్మట ఆంగ్లేయులకు లొంగవలసినదిగా జఫర్‌కు వర్తమానం వచ్చింది. పూర్వపు మొఘలు రాజుల కీర్తికి కళంకమౌతుందేమోనని జఫర్ ప్రారంభంలో లొంగిపోనన్నాడు. క్రమంగా విముక్తిమార్గం కన్పించలేదు కావున తెల్లదొరలకు లొంగక తప్పలేదు. 1857 సెప్టెంబరులో ఢిల్లీని ఆంగ్లేయులు తిరిగి పట్టుకున్నాక (తిరుగుబాటు పతనానంతరం) బహదూర్ షాను, సిపాయిల తిరుగుబాటులో పాల్గొన్నందుకు, తిరుగుబాటువారలకు సాయపడినందుకు వారు ఇతణ్ని శిక్షించే నిమిత్తం ఒక కమీషనును ఏర్పాటు చేశారు. ఆ కమీషను బహదూర్ షాను రాజద్రోహిగా, కుట్రదారుడిగా, తిరుగుబాటుదారుడిగా, హంతకుడిగా నిర్ణయించింది. తత్ఫలితంగా ద్వీపాంతరవాస శిక్ష విధించింది. అప్పటి బ్రిటీషు అధికారి 'లార్డ్ కేన్నింగ్' బర్మాలోని రంగూన్ జైలుకు అతన్ని కుటుంబ సమేతంగా పంపించాడు.

కారాగారంలో సామాన్య ఖైదీకి లభించే కనీస సౌకర్యాలు కూడా ఇతనికి లభించలేదు. దుర్భర ఖైదీ జీవితం అనుభవించాడు. బ్రతికినన్నాళ్ళు తన మాతృదేశానికి తిరిగి రావాలని మిక్కిలి ఆశించాడు. చివరకు 1862 సెప్టెంబరు 12న ఉరి తీయబడ్డారు. అంతటితో మొఘలు వంశం అంతరించిపోయింది.

రాజకవియైన బహదూర్ షా జఫర్ జీవితగాథ అంతయూ-

'పువ్వు చాటున కంటకమ్ములను కోరి
గాయముల రేపు రక్తగాథగా' - దర్శనమిస్తుంది.

పువ్వు కావాలని కోరే ఉర్దూ కవికి ముండ్లు గాయాలు చేస్తాయి. గాయం కాగానే రక్తం చిందుతుంది. అలా నిరంతరము రక్తస్రవంతుల్ని కొంగించే హృదయగాథయే బహదూర్ షా జఫర్ జీవనగాథ!

మోమిన్, గాలిబ్, జోకు లాంటి ఉర్దూ కవిపుంగవులంతా జఫర్ ఆస్థానంలోని వారే. జఫర్ కవిపోషకుడే కాక ఉర్దూ, పర్షియా, అరబిక్‌లలో సహజముగా కవి. అందమైన వ్రాత

రాసేవారు. తన కవిత్వ ప్రతిభ కనుగుణంగా 'జఫర్' బిరుదు స్వీకరించాడు. తన ఆస్థాన కవులచే కవితాగోష్ఠి నిర్వహించే వాడు. జఫర్ లాంటి రాజకవులు ఉర్దూలో ఎక్కడో వాజిద్ అలీషా లాంటివారు తప్ప అంతగా కనపడరు. "మానవుని జీవితమే వేదనామయము. కవిత్వానికి ఆధారభూతం కూడా వేదనే కదా. వేదన లేనిదే ఆనందము లేదు. అయినా ఉర్దూ కవులు తీవ్రవేదనలోనే దివ్యానందాన్ని చూడగలిగారు. ఉర్దూ కవితా మర్యాద కూడా ఇదే!

మీర్జా గాలిబ్ వేదనను చమత్కారంగా చూడగలిగాడు. కాని బహదూర్‌షా వేదనను వేదనగానే చూశాడు. అందుకే అతని కవిత దాశరథి చెప్పినట్లు 'వేదనా వికసం' మీద వన్నె తేరి ఉన్నది. వేదనతో అతని కవితా జీవితం విడదీయరానిదిగా ఉన్నది.

పాదుషాగా బహదూర్ షా అంత సమర్థుడేమీ కాదని, మీదు మిక్కిలి విలాస లాలసుడని చరిత్ర చెబుతోంది. కవిగానే గజలెక్కినట్లు అతని గజళ్ళు చెబుతాయి. వ్యాపారంతో లోని చరిత్ర ప్రకారం తెల్లదొరలు జఫర్‌ని కుటుంబ సమేతంగా దేశ బహిష్కృతుణ్ణి చేశారు. బర్మాదేశపు రాజధానియైన రంగూన్ లోని 'మాండలే' చెరసాలలో జఫర్‌ను అతని కుటుంబీకులను ఖైదీలుగా ఉంచారు. కొంతకాలం గడిచాక శత్రుశేషం ఉండ రాదని భావించిన తెల్లదొరలు జఫర్‌ని అతని కుమారుల్ని ఉరి తీయదలచారు. అందుకే ఒకానొకరోజు జఫర్-కుమారులందర్ని ముక్కలు ముక్కలుగా ఖండించి వండించి మాంస పదార్థాల్ని పళ్లెరములలో పెట్టించి పైన "కఫన్" కప్పి జఫర్ కిచ్చారు ఆరగించాల్సిందిగా. ఆ మాంసం తన పుత్రులదేనని గమనించిన జఫర్ చాలా చాలా వ్యథ చెందాడు. ఇదేమిటి అని తెల్లదొరల్ని అడగ్గా, వాళ్ళు నీకూ ఇదే గతి పడుతుందని వాస్తవాంశాన్ని వాక్రుచ్చారు.

ఉరికంబం ఎక్కబోయే ముందు జఫర్ చెప్పిన చివరి గజల్‌లోనే సుప్రసిద్ధమైన షేర్-

"కిత్‌నా హై బద్‌నసీబ్ 'జఫర్' దఫన్ కేలియే
దో గజ్ జమీన్ భీ మిల్ న సకీ కూయె యార్ మే"

'జఫర్ నీవెంత దురదృష్టవంతుడివి. ప్రేయసి నివసించే వీథిలో ఖననం కోసం నీకు రెండు గజాల స్థలము కూడా దొరకలేదే.'

ఉర్దూకవి లౌకికమైన మరణ వృత్తాంతాన్ని అమోఘంగా విశ్లేషిస్తారు. ఉర్దూ కవిత్వంలో ఈ సంప్రదాయం నిత్య నూతనంగా భాసిస్తుంది. అలాంటి సంప్రదాయాన్ని పెంచి పోషించిన కవుల్లో, రాజకవి బహదూర్ షా ప్రముఖుడు. కొన్ని క్షణాల్లో ఉరికంబానికి చేరబోయేముందు జఫర్ నోటినుంచి అప్రయత్నంగా పెల్లుబికి వచ్చింది కాబట్టి ఈ పలుకులకు ఎక్కడ లేని శక్తి చేకూరింది. ఆ శక్తిలోనే అంతర్గూఢంగా దేశభక్తి దాగి ఉంది.

సహజంగా ఉర్దూ కవి ప్రేయసి గల్లీలో మరణించాలని కోరుకుంటాడు. ప్రేయసి (సాఖీ)ని ఉర్దూ కవులు ఖుదాకు సంకేతంగా చెబుతారు. ప్రేయసి గల్లీలోనే మరణించాలనే వాంఛను వాళ్ళు దైవ సాన్నిహిత్యంగా భావిస్తారు. మరి జఫర్‌కు జరిగిందేమిటి? మరణం సాఖీ గల్లీలో కాదు కదా. అతని సమాధి రంగూన్‌లో కదా. జీవితంలో వియోగ వ్యధను అనుభవించిన ఉర్దూకవి మరణంలోగాని, మరణానంతరం గాని సాఖీ సాన్నిహిత్యం (దైవ సాన్నిధ్యం) కావాలని కోరతాడు. జఫర్‌కు మాత్రం అది కూడా సాధ్యం కాలేదు. అందుకే తన వ్యధనంతా 'షేర్'లో నిక్షేపించాడు.

జఫర్ గజళ్ళకు అందునా ఈ షేర్‌కు వ్యాఖ్యానప్రాయంగా తెలుగులో వెలువడ్డ 'జ్వాలా హసంతి' అనే చిరుపొత్తం గమనింపదగ్గది.

'కాపురమ్ము నలిన కావించు వీథిలో
దాపురమ్ము కొరకు స్థలము లేదు"

కాటికి వెళ్ళేటప్పుడు కూడా "కూయె యార్ మే" అనేంతటి గాఢప్రేమ జఫర్‌ది. కాని 'సాఖీ'ని వలచిన పోటీదారులెందరో! సాఖీ-జఫర్ స్వదేశం. పోటీదార్లు - తెల్లదొరలు. జఫర్‌ను తర లించారు. అంతేకాదు. అంతం చేశారు. జఫర్‌కు చావడమిష్టమే. కాని ప్రేయసి వసించే వీధిలో చస్తే సంతృప్తి! పరాయివాళ్ళకు వశమైన పల్లవి గల్లీలో ఖననార్థం రెండు గజాల నేల కూడా జఫర్‌కు దొరకలేదు. దురదృష్టవంతుడయ్యాడు. నరకబాధంతా జఫర్‌ది గానే భావింపబడాలి.

ఇదంతా షేర్‌లో జఫర్ నిక్షేపించిన ధ్వని. ఈ ధ్వనిలో జఫర్ కవియొక్క ప్రగాఢమైన దేశభక్తి విశదమౌతున్నది. 20 యేళ్ళుగా భారతదేశాన్ని పరిపాలించాడు. కాని జఫర్ లాగానే తత్పూర్వీకులు కూడా దేశాన్ని పాలించారు. మొఘలులే కాదు ఇతరేతరులు కూడా. అయినా వారంతా మానవసృష్టికి భారం గానే కన్పిస్తున్నారు. ప్రేయసి గల్లీని భారతదేశపు వీధిగా జఫర్ ధ్వనింపజేశాడు. కవితాపరంగా కనపడే సాఖీ గల్లీ, పాదుషా పరంగా దేశవీధిగా సమన్వితమౌతున్నది. చెలియ గల్లీలో చస్తే కవిగా సంతృప్తి. దేశవీధిలో చస్తే కవిగానే కాక చక్రవర్తిగా కూడ సంతృప్తి. ఇటు చక్రవర్తిగాను అటు కవిగాను పై రెండు రకాల సాన్నిహిత్యాన్ని కోల్పోయినందుకు పడే మదనపాటే ఈ షేర్.

జఫర్ గజళ్ళను దేశమంతటా ఎందరో గానం చేశారు. ఆ 'తరఞ్ఞుం'లో పరవశించాయి జఫర్ టూమ్రీలు కూడా చాలా ప్రసిద్ధి పొందాయి ఆ వరవడిలోనే వెలువడ్డ 'జ్వాలా హసంతి'లో పై షేర్‌కు సుప్రసిద్ధప్రాయమైన వ్యాఖ్యానం గమనింపవచ్చు.

"భువన మెల్ల 'సాక్షి' పూర్ణ స్వరూపమ్ము
అనన వృత్త మంగకముల ప్రాకె."

విశ్వాన్నే ఒక సాక్షి స్వరూపంగా చూసే విశాలదృష్టికి రమ్మని జ్వాలా హసంతి నిర్మాత కోరుతున్నారు దేశదేశాలు అవిన అవయవాలు. హృదయవిదారకంగా కవిపించిన జఫర్ అనన ప్రవేశం హృదయప్రాయమే. గుండె నుండి రక్తం ప్రతి అవయవానికి ప్రవరించినట్లు బర్మాలోని జఫర్ ఆవనోదంతం సకల దేశాలకు ప్రాకిపోయింది. ప్రఖ్యాతి గడించింది. అందుకే జఫర్ అదృష్టవంతుడు.

స్వదేశంలో మరణించలేదని జఫర్ ఆవేదనలో మంచి అతని దేశభక్తి ఆవిష్కృతమవుతున్నది. తదావిష్కరణ మాత్రం కవితాత్మకంగా చిత్రింపబడింది. ఇక్కడే జీవిత సంఘటనలు కవిత్వానికి ప్రేరకాలౌతున్నాయి. అన్న వాక్యం సార్థకతను పొందుతుంది సాక్షి చుట్టూ మూగే వలపుల వోటీదార్లుగా ఆంగ్లేయులు; దేశంగా సాక్షి; ప్రేమికుడిగా జఫర్- ఇన్నిరకాల భావ సమన్వయం కుదురుతోంది ఇందుకు సవరణ ప్రాయంగా స్వదేశంలోనే మరణించలేదనే వ్యథ చెందటంకన్నా, విశ్వంలో మరణం పొందాలనే భావం ఆవిష్కరించటం మిన్న. స్వదేశాన్నే కోరితే చక్రవర్తి సంకుచితత్వం. విశ్వాన్నే కోరితే ఆత్మ వైశాల్యం జఫర్‌లోని కవితాత్మ వైశాల్యానికి, ఈ సవరణ పద్యం పోషకంగా కవిపిస్తున్నది. సాక్షిని కవులు మూర్తిగా చూశారు. మూర్తి అంటే ఆకారమే కదా ఆకారానికి అవయవాలుంటాయి. ఇక్కడ విశ్వమనే సాక్షికి దేశాలే అవయవాలు. గుండెనుంచి రక్తం సకల అవయవాలకు సరఫరా అవుతున్నట్లే, రంగూన్‌లోని జఫర్ మరణోదంతం సమస్త దేశాలకు ప్రాకిపోయింది. ఫలితంగా జఫర్ నామం అతని దేశభక్తి తెలిసిపోయాయి. మన్నె మిన్నుముట్టింది. మరి బర్మా దేశం మాత్రం విశ్వసాక్షి హృదయమే!

ఇలా బహదూర్‌షా తనలోని ఆర్తిని కవితామూర్తిగా ఆవిష్కరించుకున్నాడు ఇలాంటి వేదనా మధు పాయినుంచి వెలువడే ప్రతి మాటకు అపూర్వమైన, అనంతమైన మహిమ ఉంటుంది. మంత్రం ఉంటుంది. ఆ మంత్రశక్తితో ఈ 'షేర్'ను ఇన్నిరకాల కోణాలకు ప్రాతిపదికగా విస్తరించే భావసంపుటిని విశ్లేషించగలిగాను జఫర్. క్లుప్తత, గుప్తత, ఆప్తత, వ్యాప్తత- ఈ నాల్గు గుణాలు గజల్‌లో ఉండటం సహజమే. అన్ని గుణాల్నీ ఒక్క 'షేర్' కలిగి ఉండటం విశేషమే.

ఇలాంటి గజళ్ళను పరిశీలించడం వల్ల వేరే భాషలో వచ్చిన సాహిత్య విమర్శ ఆయా కవిత్వాలలోని తీరుతెన్నులు తెలియడమే కాకుండ మన దేశంలో కవిగాను, చక్రవర్తిగాను రాణించినవారు కొందరున్నారు. అలాంటివారిలో తెలుగుభాషలో శ్రీకృష్ణదేవరాయలు మొదలగువారున్నారు. అలాగా ఉర్దూలో జఫర్, రాజకవుల్లో కవి చక్రవర్తుల్లో ఒకడు. కవిగాను, కవి పోషకుడుగాను, దేశభక్తుడుగాను, వ్యక్తిత జీవుడిగాను, సమైక్యతా మూర్తిగాను పేరు పొందాడు. చరిత్రలో శాశ్వత స్థానం పొందగలిగాడు. భావి తరాల వారికి ఆదర్శప్రాయుడైనాడు. ఇలాంటివారి కవిత్వాన్ని పరిశీలించడం వల్ల, వారు తమ జీవితాల్ని దేశానికి అంకితం చేసిన విధానం వారి దేశభక్తి తెలియడంతోపాటు వారి కవిత్వంలోని అంశాలు తెలుస్తాయి. దీనివల్ల అన్ని భాషలను సమన్వయంతో చూసే దృష్టి ద్వారా జాతీయ సమగ్రత (నేషనల్ ఇంటిగ్రిటీ) ఒకటి అచ్చితంగా స్పష్టంగా అలవడుతుంది. పరిశోధకులైనటువంటి వారు కేవలం ఒక భాషకే పరిమితం కాకుండ తోటి భాషలతో ఏమాత్రం పరిచయమున్నా వాటిలో విశేషంగా కృషిచేసి ఆయా భాషల్లో ఉన్న సాహిత్యపు విలువలను పరిశోధక వ్యాసాల రూపంలో తమ భాషలో వ్రాసుకుంటే ఆ భాష పరిచయం లేనివారికి కూడా ఆ కవిపట్లగాని ఆ భాషా సాహిత్యపు విలువలపట్లగాని గౌరవం ఏర్పడుతుంది. తద్వారా జాతీయ సమగ్రత ఏర్పడుతుంది అనటంలో సందేహం లేదు. ఆ విధంగా ఇతర భాషా సాహిత్యపు విలువలను గురించిన పరిశోధనా వ్యాసాలు ప్రచురిస్తే ఆ సాహిత్యం ఎంతోమందికి పరిచయం కావడమే కాకుండ, అందులోని ప్రత్యేకతలు తెలియగలవనుటలో సందేహం లేదు.

(ఈ వ్యాస నిర్మాణంలో తగు సూచనలిచ్చి తోడ్పడిన డా॥ ఎమ్. బుర్హన్నగారికి వ్యాసకర్త కృతజ్ఞతలు తెలుపుతుంటున్నాడు )


ఆధార గ్రంథాలు :

1. డా॥ బుర్హన్న, ఎం - జ్వాలా హసంతి
2. డా॥ దాశరథి - కవితా పుష్పకం.
3. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రీసర్చి - మేకర్స్ ఆఫ్ మాడరన్ ఇండియా.


శ్రీ పి. ఓబులేసు

# గ్రంథ విమర్శలు

## పురాతన శైవక్షేత్రం-పంచధారల

డా॥ కొల్లూరు సూర్యనారాయణగారు రచించిన "పురాతన శైవక్షేత్రం - పంచధారల" యను గ్రంథము భాగవతుల చారిటబుల్ ట్రస్టు ప్రచురించుట ముదావహము. శ్రీ భాగవతుల శంకరశాస్త్రిగారు (ఆరుద్రులు), యీ కావ్యానికి శ్రీకారం చుట్టారు. విశేషములను విపులీకరించి సమీక్షకుడికి ప్రయాస లేకుండా చేసిరి.

ఆరుద్రగారి శ్రీకారం చదువరులకు చాలు. అయినను కొన్ని యంశముల నిచ్చట పేర్కొని రచయితను అభినందింప నూహకొందును.

"పాడు, పాళ్ళు" యను పదములు పాడువడిన స్థలముల సూచించును. 'పల్లి' యనుపది మాత్రమే జైన స్థావర సంకేతము. క్రీస్తుబ్దము 16వ శతాబ్ది పునర్ నిర్మితమైన ధర్మేశ్వరస్వామి ఆలయమున తూర్పు దిశ ప్రాకారమున బౌద్ధ విగ్రహమున్నదని పేర్కొనిరి. మరికొన్ని వివరముల ఛాయాచిత్రమును పొందు పరిచిన బాగుండెడిది. ఫణిగిరి అంచున చెప్పబడిన గుహ బౌద్ధారామముగా తోచుచున్నది. ఈ బౌద్ధ గుహలో శైవము జొరబడినది. బొజ్జనకొండపైనున్న రాతి స్తూపములను, గుంటుపల్లి గుహాలయములలోని వృత్త చైత్యమును "ధర్మలింగేశ్వరాలయములుగా" కొలచుట ఆచార్యమైయ్యను, సముద్రగుప్తుని బంగారు నాణెము దొరకినది వాస్తవమే! అంత బొజ్జనకొండ, తదితర ఆంధ్ర ప్రాంతరములలో గుప్త సామ్రాజ్యపాలనము వచ్చెననుట సత్యదూరము.

కాశీ విశ్వేశ్వరుని ఆలయమున లింగము భీకరమైనదిగా రచయిత చెప్పిరి (పుట-9). భీకరమన్న ఏమి? యేదయినా పురుషాకారము వికటముగా లింగాగ్రముపై చూపినారా? అట్లయిన ఈ లింగము ముఖలింగముగా యెరుగననగును. ఛాయాచిత్రము నొకటి పొందుపరిచిన బాగుండెడిది. పుట-17లో ఒక శ్లోకమును పరిశీలించినచో ఈ లింగము పంచవక్త్రము లేక పంచబాణము. మరియు పంచధారల ధర్మలింగముగా పేర్కొనబడినది. అనగా శుద్ధ వైదిక శైవమును ఉద్దేశించు ముఖలింగముగా గమనింపవలెను.

అట్లే పుట-9లో కోటిలింగమును గూర్చి ప్రస్తావించిరి. మూడడుగులు మాత్రమే భూమిపై కనుపించుచున్నది. అనగా లింగము యొక్క బ్రహ్మ - విష్ణు - రుద్ర భాగములు కొంతమేర అంతర్గతములు. ఇట్టి లింగమును సహస్ర లింగముగా నెరుగవలయును. ఈ కోవకు చేరిన లింగములు - గుంటూరు జిల్లా-చేజెర్ల (కపోతేశ్వరాలయము) పంచారామ క్షేత్రముల తూర్పు చాళుక్య చక్రవర్తి భీమేశ్వరుని కాలమున (892-921 ఎ.డి.) ప్రతిష్ఠింపబడినట్టివి.

విగ్రహములపైని, ఆగమ-వాస్తు విన్యాసముపైని యెట్టి వివరణ కానరాదు. కేవలము ప్రాచీనతమములైనవి - ఉత్కృష్టమైనవి, యని మామూలుగా చూడవచ్చినవారికి చెప్పు కథవలె నడిచినదీ రచన. మరికొన్ని ఛాయాచిత్రములతో, దేవాలయ వాస్తు, మూర్తి శిల్పములపై విపులీకరించిన మిక్కిలి ఉపయోగముగా నుండెడిది.

మూడవ భాగమున ఆలయ శాసనములన్నింటినీ గుదిగూర్చిరి. చాలాకాలము క్రితం భారత ప్రభుత్వ శాసనాల శాఖ ప్రచురించినట్టివి. ప్రతి శాసనమునకు తెలుగు సేత నొసగినచో చదువరుల కుపయోగించును గదా! ఈ పుస్తకము క్షేత్రమును దర్శింపవచ్చువారికి మార్గదర్శకము. ఈ విధముగా రచయిత సంకల్పము నెరవేరినది.

డా॥ ఇంగువ కార్తికేయ శర్మ

## 1. ప్రఖ్యాత భారతీయ శాస్త్రవేత్తలు

[రచయిత: డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు, పుటలు-124, వెల: రూ. 15/- సైజు 1/8 డెమ్మీ ప్రథమ ముద్రణ: ఆగస్టు 1989, పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ.]

ప్రస్తుత గ్రంథము భారతీయ శాస్త్రజ్ఞుల కృషినీ, వారి జీవితాలనూ తెలిపేది. అతి ప్రాచీనమైన సుశ్రుతుని నుండీ చంద్రశేఖర్ వరకు గల 37 మంది శాస్త్రజ్ఞుల చరిత్ర ఇందు కలదు. చరకుడు, కణాదుడు, బ్రహ్మగుప్తుడు, జహంగీరు (మొగలు చక్రవర్తి), సి. వి. రామన్, సవాయ్ జయసింగు, రాధాకృష్ణరావు, హాల్డేన్, ఖొరానా వంటి ప్రముఖు లిందున్నారు.

వీరి జీవితాలు, పరిశోధన ఆసక్తి కలిగేటట్లు వ్రాయబడింది. శాస్త్రజ్ఞుల పటములు - కొన్ని ఊహాచిత్రాలు, కొన్ని ఫోటోలు - బాగున్నాయి. ఇందులో ఇద్దరు ముగ్గురి (ఉదా: కృష్ణన్, శేషాద్రి)తో నాకు కొంత వ్యక్తిగత పరిచయం ఉండేది

ఈ పుస్తకంలో వుండవలసిన శాస్త్రజ్ఞులు సంజీవరాయ శర్మ (గణిత శాస్త్రజ్ఞుడు - ఇప్పటికీ సజీవుడు) మోక్షగుండం విశ్వేశ్వరయ్య (ఇంజనీరు), బి. వి. నాథ్, (భాగవతుల విశ్వనాథ్-వ్యవసాయ శాస్త్రజ్ఞుడు) యల్లాప్రెగ్గడ సుబ్బారావు (ఔషధ శాస్త్రజ్ఞుడు-ఈయనకు "ఆసియా లూయీపాశ్చరు" అనే బిరుదుండేది) పతంజలి "శాస్త్రజ్ఞు"ని (ఆధునిక దృక్కోణంలో) క్రిందికి వస్తాడా? "సులభ" సూత్రాలకు "శుల్బ" సూత్రాలనీ, "మేఘనాథు"నికి "మేఘనాదు"డనీ, "హోమీ బాబా"కు "హోమీ భాభా" అనీ "రాజా రమణ్ణ"కు "రాజారామణ్ణ" అనీ ఉండవలెను. హాల్డేన్ భారతీయుడు కాదు. ఖొరానా చంద్రశేఖరులు జన్మతో భారతీయులైనా, ఇప్పుడు అమెరికా పౌరులు. మాస్కోలో "ట్రైబోలజీ" పరిశోధనా సంస్థకు సీతారామయ్య అనే ఆంధ్రుడు డైరెక్టరుగా ఉండేవాడు ట్రైబోలజీ అంటే ఘర్షణ, కందెన నూనెల సాంకేతిక శాస్త్రము.

## 2. ప్రపంచప్రఖ్యాత శాస్త్రవేత్తలు

[రచయిత: డా॥ గుమ్మడూరు రమేష్‌బాబు, పుటలు-107, వెల రూ. 15/- సైజు 1/8 డెమ్మీ, ప్రథమ ముద్రణ: ఆగస్టు 1989, పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ.]

ఈ పుస్తకంలో పైథాగొరస్ (క్రీ.పూ. 6వ శతాబ్దం) నుండి నేటి ఖొరానా వరకు గల 46గురు శాస్త్రజ్ఞుల జీవిత విశేషాలున్నాయి కొన్ని పేర్లు: అరిస్టాటిల్, డార్విన్, ఎడిసన్, జగదీశ చంద్రబోసు, ఐన్‌స్టీన్, మున్నగువారు. ఇందు 7గురు భారతీయులే ఉన్నారు గ్రంథకర్త అభిమాన ధోరణి అనవచ్చును. గ్రంథం పుటలు తిరగవేస్తుంటే, శాస్త్రజ్ఞులు మన మనోనేత్రాలలో సినిమాలోవలె కన్పిస్తారు. రచన చిన్నదయినా, దాంట్లోనే విషయాలను అమర్చిన నైపుణి శ్లాఘనీయము ఇంత సులభం ఈమాత్రం మనము వ్రాయలేమా అని అనిపించవచ్చును. సుమతి శతకం వంటి పద్యం వ్రాసి చూడండి. దాని తడాఖా తెలుస్తుంది! ఇందులోనుండి ఎవరినీ తీసివేయుమని "డిమాండు" చేయనుగానీ, ఇందుండవలసిన కొందరు శాస్త్రజ్ఞుల పేర్లు ఇస్తున్నాను; లూయీ పాశ్చరు, రోనాల్డ్ రాస్, నీల్స్‌బోర్, నికోలా టెస్లా, అబ్దుస్ సలాం. ఇందలి శాస్త్రజ్ఞులను గురించిన కొన్ని ఆసక్తికర విషయాలను తెలుపుతాను: సూర్యుని చుట్టూ భూమి తిరుగుతున్నదనే అతని సిద్ధాంతానికి ప్రాయశ్చిత్తంగా గెలీలియో, మతాధికారుల ఎదుట లెంగీలు తీయవలసి వచ్చెను. లెంగీలు తీస్తూ, ముసలివాడు కాబట్టి, మోకాళ్లను కష్టంగా వంచుతూ "ఇంకా తిరుగుతూనే ఉంది!" అని గొణుగుచుండెనట!

చార్లెస్ డార్విన్ "బీగిల్" అనే ఓడలో ప్రయాణం చేయడం హఠాత్పంభుటనే ఎవరో సమయానికి రానందున డార్విన్‌ను రమ్మని ఓడెక్కించినారు. న్యూటను - ఆపిల్ పండు కథ. జరుగలేదని చాలామంది అభిప్రాయము. తానెంత లబ్ధ ప్రతిష్ఠుడైనా, బెంజమిన్ ఫ్రాంక్లిన్ తన వృత్తి "ముద్రాపకుడు" (ప్రింటర్) అనే సమోదు చేసేవాడు. మేడం క్యూరీ జ్ఞాపకార్థము ఒక మూలకానికి "క్యూరియం" అని పేరు పెట్టితే, క్యూరీ తాను కనిపెట్టిన ఒక మూలకానికి తన దేశమైన పోలాండు గౌరవార్థము "పోలోనియం" అని పేరు పెట్టింది. జెన్నరు, రసిని ఆరోగ్యంగా వున్న ఒక బాలుని కెక్కించాడు (పుట-45) అని వుంది. ఆ "ఒక బాలుడు" ఎవరో కాదు. జెన్నరు ముద్దుల కొడుకే, గోమశూచి రసిని ఎక్కించుకొనేందుకు వేరేవాళ్లెవరు ముందుకు వస్తాయి కనుక! నోబెల్ బహుమానం వచ్చిన ఖొరానా మన దేశంలో ఉద్యోగం రానందున అమెరికాకు వెళ్ళిపోయినాడు. మన దేశంలో ఉద్యోగం వచ్చివుంటే నోబెల్ బహుమానం వచ్చివుండేది కాదు

కొన్ని సవరణలు : "ఏ వస్తువునైనా నీటిలో ముంచినప్పుడు, ఆ వస్తువు తన బరువుకు సమానమైన నీటిని తొలగిస్తుంది" (పుట-15) అని వుంది. "బరువు" స్థానంలో "ఘనపరిమాణము" అని వుండవలెను. "గెలీలి గెలీలియో" అనికాక "గెలీలియో గెలీలి" అని వుండవలెను.

అచ్చు తప్పులు : "ఆల్ఫ్రెడ్" (పుట-52) అని కాక "అల్‌ఫ్రెడ్" అనీ, "గ్రెగర్" (పుట-94) అనికాక "గీగర్" అనీ, "ష్రోడింగర్" (పుట-72) అనికాక "ష్రోడింగర్" అనీ వుండవలెను పేర్ల తప్పులుంటే మొదటికే మోసం.

శాస్త్ర విషయాలు అర్థం చేసుకోవడం కష్టం. దీనికితోడు శాస్త్ర పరిభాషా క్లిష్టత కూడా ఉంటుంది ఉదా: విద్యుదయస్కాంత రశ్మ్యుద్గారత (పుట-71) ఇది సామాన్య పాఠకునికి అర్థం కాదు ఇంగ్లీషులో ఏమైనా సులభమా? పైదానికి "ఎలక్ట్రో మేగ్నెటిక్ రేడియేషన్" అని పేరు. ఇంగ్లీషులో శాస్త్రీయ పరిభాషకు అలవాటు పడినట్లే తెలుగు పరిభాషకూ అలవాటు పడవలెను. అచట గ్రీకు, లాటిను భాషల పెత్తనము.

ఇది సంస్కృత భాషాధిపత్యము. ఆధునిక శాస్త్రరచనకు తెలుగు భాషే భారతీయ భాషలలో మిక్కిలి అనుకూలమైంది అని హాల్డేన్ అభిప్రాయమై ఉండేది.

# 3. ప్రపంచాన్ని మార్చిన శాస్త్రీయ సంఘటనలు

[రచయిత డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు, పుటలు-112, వెల: రూ 15/- సైజు 1/8 డెమ్మీ, ప్రథమ ముద్రణ: ఆగస్టు 1989. పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ.]

శాస్త్ర విజ్ఞానం ప్రజాపరం కావలెను "అబ్రకడబ్ర" అనే రీతిలో పరిశోధనా పత్రికలలోనూ, "జీర్ణమంగే సుభాషితమ్" అన్నట్లు పరిశోధకునిలోనే ఉండిపోరాదు. పాశ్చాత్య కాలంలో శాస్త్ర విషయాలను ఆసక్తికరంగా వ్రాసే గొప్ప రచయితలున్నారు. గత తరంలో సర్ జేమ్సు జీన్సు, ఆర్థర్ ఎడ్డింగ్‌టన్, ఆలివర్‌లాడ్జి, నేడు ఆర్థర్ క్లార్కు, జార్జిగామో, ఐసాక్ అసిమోవ్‌లు ఉదాహరణాలు. మన దేశంలో జయంత్ నార్లీకర్, కేళవాని, కె. టి. అచయ మున్నగు శాస్త్రజ్ఞులు ఇంగ్లీషులో జనానికి సులభంగా అర్థమయ్యేటట్లు శాస్త్ర విషయాలు వ్రాస్తున్నారు. తెలుగులో అలనాడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు సైన్సును తెలుగులో వ్రాసిరి. నేడు మహీధర నళినీమోహన్, జమ్మి కోనేటిరావు తెలుగులో సైన్సును సులభశైలిలో వ్రాస్తున్నారు. ప్రస్తుత గ్రంథం ఈ కోవకు చెందినది. కొన్ని శాస్త్ర పరిశోధనలు మన జీవిత విధానాన్నెట్లు మార్చివేసినవో ఇందు వివరించినాడు గ్రంథకర్త.

ఇందలి విషయాలు: మనిషి పుట్టుపూర్వోత్తరాలు-డార్విన్, రోదసి, భూభ్రమణం, సూర్యుడు, సౌరపవనం, చంద్ర, శుక్ర, గురు, బుధ, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో, శని, దశమ (జామాత కాదు సుమా!) గ్రహాలు, తోకచుక్కలు, ఉల్కలు, న్యూట్రాన్ నక్షత్రాలు, కాంతికిరణాలు, రేడియో తరంగాలు, ఎక్స్‌రేలు పరమాణు కిరణాలు వంటి "అణోరణీయాన్ మహతో మహీయాన్" అణువు నుండి అనంతం వరకూ కల పదార్థ తత్వ చర్చ, ధ్వని తరంగాలు, లోహాలు, ఖనిజాలు, ఆంటిబయాటిక్సు, జ్ఞాపకశక్తి కేంద్రం, రబ్బరు, ప్లాస్టిక్సు, అంకెలు-సంఖ్యలు వంటి దైనందిన ఉపయోగకారి విషయాలపై విజ్ఞానదాయక వివరణ ఇందు గలవు. శ్రద్ధతో చదువవలసిన పుస్తకం. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అని కదా గీతాచార్యుడు చెప్పినాడు.

హిందువులు ప్రపంచ గణిత శాస్త్రానికిచ్చిన కానుకలు: 1. సున్న ("సిఫర్" అనే మాట "శూన్య" అందే మున్ననుండి వచ్చింది) 2 ఒక్కో అంకెకు ఒక గుర్తు 1, 2, 3, ... 9, (ఇదే పద్ధతి కానీ ఇప్పుడు వాని గుర్తులు అంతర్జాతీయంగా వాడబడుతున్నాయి ఈ అంకెల వ్యాప్తికి 13 శతాబ్దంలో యూరోప్లో "ఫైబొనచ్చి" అనే ఇటాలియన్ గణిత శాస్త్రజ్ఞుడు మూలం.) 3. ఋణాంకాలు (-1, -2 ...) 4 దశమూలాంక సంఖ్యలు ("ఇర్రేషనల్ నంబర్స్") 5 రేఖాగణిత సమస్యల బీజగణిత పరంగా పరిష్కారాలు

పుస్తకాంతంపై అర్థాలు రంగులతో శాస్త్రజ్ఞుల బొమ్మలు, డిజైనుతో నిండుగ కనిపిస్తూ పుస్తకం ఆకట్టుకుంటాయి. చివరి అట్టపైన రచయిత జీవిత విశేషాలు ఆయన బహుముఖ ప్రజ్ఞను తెల్పుతాయి.

పై రెండు పుస్తకాలు సామాన్య పాఠకునిలో శాస్త్ర సంబుద్ధిని ("సైంటిఫిక్ టెంపరు") కలిగిస్తాయనడంలో సందేహం లేదు. ఈ పుస్తకాలు హైస్కూలు విద్యార్థులకూ, క్రొత్తగా విద్య నేర్చిన ప్రమోధికులకూ చాలా ఉపకరిస్తాయి. ఇటువంటి పుస్తకాలకు మంచి ప్రచారం రావాలను. శాస్త్ర, సాహిత్య రంగాలలో నిష్ణాతులయిన డా॥ రమేష్‌బాబుగారు తెలుగు పాఠకుల కందిస్తున్న విజ్ఞాన కానుకలు ఈ మూడు పుస్తకాలు. ఆయన నుండి ఇటువంటి ఉత్తమ శాస్త్రగ్రంథాలను ఆశిస్తాము.

సర్దేశాయి తిరుమలరావు

# కూనలమ్మ పదాలు ఇంటింటి పజ్యాలు

[రచన : ఆరుద్ర, వెల : రూ. 15-00, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, విజ్ఞానభవన్, 4-1-435 బ్యాంక్‌స్ట్రీట్, హైదరాబాదు - 500 001]

సుప్రసిద్ధ సాహితీవేత్త, సమగ్రాంధ్ర సాహిత్య నిర్మాత, అభ్యుదయ కవి శిరోమణి శ్రీ ఆరుద్ర చెప్పిన పదాలనూ, వ్రాసిన ఇంటింటి పజ్యాలనూ జోడించి విశాలాంధ్రవారు చక్కని ముద్రణతో ఈ పుస్తకాన్ని ప్రచురించారు. ఎప్పుడో, ఎవ్వరో చెప్పిన ఎనిమిది కూనలమ్మ సంబద్ధి గల పదాలు లభించగా వాటిని చదివాననీ, అవి తనను ఉత్తేజపరచాయనీ కవ్వించాయనీ, వాటి ఛందస్సు తనను ఆకర్షించాయనీ తెలిపి వాటి

ప్రభావంతో ఆరుద్రగారు ఈ పదాలను వ్రాశారు. ఇందుకు మల్లాది రామకృష్ణశాస్త్రిగారూ, ముళ్ళపూడి వెంకటరమణగారూ ప్రోత్సహించారు.

ఈ పదాలు మాత్రాచ్ఛందస్సులో ఉన్నాయి. ప్రతి పాదంలో పదేసి మాత్రలుంటాయి. చమత్కారం, హాస్యం, వ్యంగ్యం సమ్మిశ్రితంగా రూపుదిద్దుకున్న పదాలు ఇవి. ఇందుకు

"కురులు దువ్వ విధాన
చెలుని దువ్వెదు దాని
నిజముగా నెరజాణ
ఓ కూనలమ్మ"

"పిల్ల నిచ్చినవారి
పీకమీద సవారి
చేయు అల్లుడె మారి"

అనేవి ఉదాహరణలు. అంత్యప్రాసలు పదాలకో అందం.

ఇంటింటి పజ్యాలు నిజంగా పద్యాలు కావు వచనకవితా ఖండికలు. ఈ పజ్యాలను ఇంటిల్లిపాదీ చదువుకోడానికీ, చదువుకుని ఆనందించడానికి వ్రాయబడినాయని తెలుపబడినది. వ్యంగ్యమూ, చమత్కారమూ ఈ పజ్యాల్లో కూడ ఉన్నాయి. సంసారాల్లో కనిపించే ఆహార విహారాదులు చమత్కృతిమంతాలై కొన్ని పజ్యాలు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ఇందుకు ఈ కింది పంక్తులు మచ్చుతునకలు.

"అరవ్వాడు తింటాడు ఇడ్డెన్లూ వడ
బెంగాలీ తింటాడు జిలేబీ, సింగడ
తెలుగువాడు తింటాడు పెసరట్టూ ఉప్మా
ఎక్కడమో తినేవి ఏమిటి చెప్మా"

"ఆడాళ్ళూ మగాళ్ళూ ఉత్తర దక్షిణ ధ్రువాలు
అయినా పెళ్ళాడానికి వీళ్ళు చాలా అవసరాలు"

"ఆయన ఊదిపారేసే పొడు సిగిరేట్ల ఖర్చు
ఆవిడ చీరల పద్దుకన్నా ఎప్పుడూ హెచ్చు"

ఇంతేకాక రాజకీయాలూ, ప్రాపంచిక విషయాలూ ఎన్నో చోటు చేసుకున్నాయి ఈ పజ్యాల్లో. అంత్యప్రాస విలాసం ఈ పజ్యాల్లోనూ నియమంగా పాటింపబడినది.

[illegible] ఆరుద్రగారిది అందెవేసిన చేయి. ఉదాహరణ - 'శ్రీవారి [illegible]' 'భుజస్కంధావారం' 'సాలార్ [illegible]' [illegible].

[illegible] పదాలనూ, ఇంటింటి పజ్యాలనూ సరదా కోసమే కాక [illegible]స్వాదన కోసం కూడా చదువతగ్గవి.

[illegible] అచ్చుతప్పులు అంతగా లేకున్నా అక్కడక్కడ సున్నాలూ, వత్తులూ జారిపోవడం కాస్త బాధను కలిగిస్తుంది. ప్రతి పదానికీ, పజ్యానికీ వేసిన బొమ్మలు ప్రత్యేకాకర్షణ.

**వేముగంటి**

# పెరియాళ్వార్ తిరుమొళి మూడవ పత్తు

[తమిళం: విష్ణుచిత్తుడు, తెలుగుటీక: శ్రీచరణ రేణువు, వెల : రూ. 18/- ప్రాప్తిస్థానం : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు 521 207, కృష్ణాజిల్లా]

ఆళ్వారులలో విష్ణుచిత్తుడు పెరియాళ్వారుగా ప్రసిద్ధుడు. పూదోటలో దర్శనమిచ్చిన శిశువు గోదాదేవి. ఆ దివ్యమూర్తిని పెంచి పెద్దచేసి శ్రీరంగనాథునకు అర్ధాంగిగా సమర్పించిన ధన్యాత్ముడు. ఆనాటి జనకుడు ఈనాటి విష్ణుచిత్తుడని నేనెన్నడో ప్రవచించాను....

విష్ణుచిత్తుడు యీ గ్రంథములో యశోదగా దర్శనమిస్తాడు. బాలకృష్ణుని లీలా విలాసాలను లలితములుగా మధుర భావ సంకలితములుగా వర్ణించడం ఆ పుణ్యపురుషుని భక్తిపార వశ్యమునకు రూపముగా చెప్పవచ్చు.

దీనియందు మూడు వంతులు బాలకృష్ణుని లీలలను సుకుమారంగా ముదలకిస్తున్నట్టు చెప్పడం ముచ్చటగా ఉంటుంది. ఆయా సందర్భాల ననుసరించి పోతనామాత్యుని పద్యాలు ఉదాహరించడం సముచితంగా ఉంది.

చివరి భాగంలో హనుమంతుడు శ్రీరాముని అరణ్యవాస విషయం సీతాదేవికి చెప్పడం - తాను రాక్షసుడను కాను నీ పతికి దాసుడనమ్మా నమ్ము - అని ప్రబోధించినట్టుంటుంది.

తమిళ శ్రీవైష్ణవ గ్రంథ సంచయములో విష్ణుచిత్త సూక్తిమాలకొక విశిష్టస్థానం ఉంది. ఆ సూక్తిమాలికలో ఇది మూడవ శతకం. మూలముతో సహా తెలుగువ్యాఖ్యతో ముద్రించిన యీ కృతి మూలం చదవాలనే ఆసక్తి కలవారికి ఫలప్రదం అయింది. వ్యాఖ్యాత శ్రీచరణ మహాశయుడు ధన్యాత్ముడు.

అక్కడక్కడ అచ్చు తప్పులుండడం ఒకింత బాధాకరమే. 'మూడా[illegible]' అనాలా? 'మూన్రావదు'- అని అనాలా?- ఏమయినా గోదా గ్రంథమాలవారి కృషి బహుధా ప్రశంసనీయం. మిగతా భాగాలు కూడా త్వరలో వెలువడతాయని ఆశిస్తున్నాను.

**—యామిజాల పద్మనాభస్వామి**

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247